ఆంధ్రగ్రంథమాల—౯.

# భీష్ముడు

అయిదంకముల నాటకము

[ఆంగ్లానువాదము]

అనువాదకుడు

పొణకా పిచ్చిరెడ్డి, బి. యె., (ఆనర్సు)

ప్రకాశకుడు

కా. నాగేశ్వరరావు

౧౯౨౮]

[వెల రూ. ౧-౦-౦

# పీఠిక

మానవులకు జీవయాత్ర సుఖదుఃఖములతోఁ గూడి దుర్గమముగ నున్నది. విశ్వకల్యాణమునకు మానవుని జీవయాత్రను సార్థకము చేయుటకు విశ్వమంతయును పరితపించుచున్నది. పరబ్రహ్మము మొదలు పరమాణువు వఱకును గల విశ్వమంతయును కల్యాణోత్సవానందమును బొందుటకు పరుగిడుచున్నది. భానుడు ప్రాణదానము చేయుచున్నాడు. సోముడు సుధ నొసంగుచున్నాడు. భూతములు తేజోబలములను ప్రసాదించుచున్నవి. సస్యములు ప్రాణమును సంవర్ధించుచున్నవి. విశ్వమంతయును విశ్వకల్యాణమున కానందరాగిములను పాడుచు సంభ్రమమును గలుగజేయుచున్నది. ఈపరువులాటలందె విశ్వమపశ్రుతిని బొంది దుఃఖవేదన ననుభవించుచున్నది. వ్యక్తులు, కులములు, సంఘములు, జాతులు నిత్యమైన విశ్వకల్యాణోత్సవమునకు బదులు అనిత్యమైన స్వీయకామ్యోత్సవమును గోరుచు దుఃఖము ననుభవించుచున్నారు. జీవయాత్రకు బదులు దేహయాత్రను గోరుచు త్యాగయాత్రను విడిచి భోగయాత్రను జేయుచున్నారు. కల్యాణాత్మ్యము భోగయానము లైన కాంతాకనకాదులయందు

లగ్నమై ప్రళయరూపమును దాల్చుచు దుఃఖమునుగలుగ జేయుచున్నది. బంధువులు ప్రియులు; భార్య ప్రాణప్రియ; ధనము ప్రియతరము; ప్రాణాభిమానములు ప్రియతమములు. ప్రేమాస్పదమైన సకలమును స్వార్థార్పణమునకును, శేషము విశ్వకల్యాణార్పణమునకును వినియోగపడుట ధర్మప్రమాణముగ నున్నది. విశ్వకల్యాణమునకు మానవులు త్యాగపరాయణులై ప్రాణాభిమానధనములను సమర్పించుట దుర్లభముగ నున్నది. వృద్ధులు వైరాగ్యమును బూనవచ్చును; కోటీశ్వరులు లక్షల నీయవచ్చును; దోపిడిగాండ్రు గుడిగోపురములను గట్టవచ్చును; ధర్మకర్తలు ధర్మనిర్ణయములను జేయవచ్చును; గురువులు త్యాగోపదేశములను జేయవచ్చును; చిత్తశుద్ధిలేని వైరాగ్యము, దానధర్మములు, బోధలు విశ్వకల్యాణమునకును, ఆత్మానందమునకును నిరర్థకములు.

జీవయాత్రయందు సంకల్పాచరణములు జతగూడునపుడు విశ్వకల్యాణ మానందప్రదమై హృదయశాంతి గలుగుచున్నది. విశ్వమునందు బ్రత్యక్ష మగుచున్న సనాతనమైన ధర్మసంరంభమును గురువు లుపదేశించుచున్నారు; కవులు వర్ణించుచున్నారు; చిత్రకారులు చిత్రించుచున్నారు; గాయకులు పాడుచున్నారు; ఆగమజ్ఞులు సాధించుచున్నారు; విశ్వకల్యాణమునందు బాల

కృష్ణులు మురళీగానము చేయుచున్నారు; రాధాకృష్ణులు ప్రేమామృతమును గురియించుచున్నారు; నటరాజు తాండవమాడుచున్నాడు; పార్వతీపరమేశ్వరులు వైరాగ్యానందమును ప్రత్యక్షము చేయుచున్నారు; బుద్ధుడు వైరాగ్యప్రేమను సమర్పించుచున్నాడు; క్రీస్తు త్యాగప్రేమను సమర్పించుచున్నాడు; ప్రజలు కర్మదీపికలను వెలిగించుచున్నారు. అనంతమైన కల్యాణమహోత్సవమున కనంతమైన దృశ్యములను మహానుభావులు ప్రదర్శించుచు మానవధర్మాభ్యుదయమును జేయుచున్నారు. మానవకల్యాణప్రదర్శకులందు హెన్రికు ఇబ్సెను గారు గణనీయుడుగ నున్నారు.

అవతారమూర్తులు మానవకల్యాణమునకై స్థాపించిన మతధర్మములు, సంప్రదాయాచారములు కాలాంతరమునను సంకుచితములై ధర్మచ్యుతి గలుగుచు మానవత్వము దిగబడుచున్నది. ఏసుక్రీస్తు సిలువమీద చేసిన యాత్మార్పణము దురాచారసంప్రదాయమయమై దైవారాధనమునకు నిరర్థకమైనది. మరములు వెలసినవి; దేవళములు విలసిల్లినవి; గురువులు వర్ధిలిరి; ధనాశ పెరిగినది; కామ మతిశయించినది; నిరంకుశత్వము ధర్మాధికారస్థానము నాక్రమించినది. కళంకభూయిష్ఠమైన సంఘమునందు ఇబ్సెనుగారికృతులు పిడుగులవలె పడి సంచలన

మును గలిగించినవి. వారికృతులందు బ్రాందునాటకమూ సుప్రసిద్ధిని బడసినది.

ఆనాటకమునకు శ్రీయుత పొణకా పిచ్చిరెడ్డిగారు ఆంధ్రానువాదముచేసి ఆంధ్రవాఙ్మయమునకు సుగంధ కుసుమమును సమర్పించిరి. భారతీయసంప్రదాయముని కనుకూలముగను పాత్రలపేర్లనుమార్చి భావములున్నవి యున్నటులు వ్రాసినటు లనువాదకులు పీఠికయందు వ్రాసి యున్నారు.

నాటకమునందు భీష్ముడు నాయకుడు. సుధ కళావంతుడైన శరచ్చంద్రుని వదలి త్యాగశీలుడైన భీష్ముని వరించినది. శరచ్చంద్రుడు "శాంతిసమరములలో దేనిని వరించెదవు? సుఖదుఃఖములలో దేనికై కోరెదువు? జ్యోతిస్తమస్సులలో దేని బ్రవేశించెదవు? అమృతమృత్యువులలో దేని నపేక్షించెదవు?" అని సుధ నడిగెను. సుధ "మృత్యుమార్గమునే" అనుచు "సర్వస్వత్యాగమును" గోరెడి కఠినాత్ముని భీష్ముని వరించినది.

త్యాగవరణము సుధకు దేహయాత్రను దుఃఖమయము చేసినను స్వర్గయాత్రను సాధ్యముచేసినది. సుధ పుత్రత్యాగమును, ఇచ్ఛాత్యాగమును, ప్రాణత్యాగమును జేసి నిత్యానందమును బడసినది. భీష్ముడు ప్రజాహృదయమునందు ప్రజ్వలింపజేయదలచిన త్యాగాగ్ని క్షణకాలమూ

మండినను వెంటనే చల్లారినది. సంకల్పశూన్యమైన ప్రజా హృదయము సామాన్యవిషయములకు ప్రయోజనకరమైనను పెద్దవిషయములందు వెనుకంజ వేసినది. కొత్వాలు, ధర్మాధికారి, ఉపాధ్యాయుడు, ప్రజలు సమయము వచ్చినపుడు సమాధానబుద్ధిని జూపిరికాని త్యాగమును జూపజాలకపోయిరి. "సర్వత్యాగము లేక సర్వశూన్యము" భీష్మునకును దురారాధ్యమైనది. భీష్ముడవలంబించిన త్యాగసమరము నిరర్థకమైనది. భీష్ముడు కోరిన "నూత్నోదిత సంకల్పము—తత్త్వమెఱుగు ఆత్మ—చెక్కులుగల భక్తి—సంకోచమే లేక మృత్యురాజ్యమున సయితె మెఱుగగల-జనితానందము—ప్రతిమనుజుని ఫాలతలమున ముండ్లకిరీటము" ఫలములు అసంభవము లైనవి. ప్రజలు భీష్ముని "దుర్మార్గపుత్రుడు, దుర్మార్గభర్త, దుర్మార్గజనకుడు, ఇంకను చెప్పవలసియుండిన, దుర్మార్గహైందవుడుసయితము" అని తిట్టి రాళ్లు రువ్వి వెడలగొట్టిరి. భక్తిస్నానమువలన శరచ్చంద్రునకు పునర్జన్మము, శాంతి కలిగినవి. ఇచ్ఛాగృధ్రమును చంపగలిగిన గిరికకు శాంతి చేకూరినది. సిలువను ధరించిన ఏసుక్రీస్తువలెనె త్యాగమును కోరి బోధించిన భీష్ముడును దుఃఖవేదన ననుభవించెను.

మానవధర్మాభ్యుదయమునకు ప్రేమస్వరూపమైన త్యాగము సాధనముగాని శూన్యమైనత్యాగము సాధ

నము కాదని అవ్యక్తస్వరము ఘోషించినది. మానవులు భక్తిస్నానముచేసి పావనులై స్వర్గవాసమును చేయుటకు, స్వార్థమువలె అభిమానమును ప్రతిబంధకముగ నున్నది. కామము తమోగుణాన్వితమై విషయపరమగుచున్నది. ప్రేమ రజోగుణాన్వితమై చిత్తపరగుచున్నది. భక్తి సత్వాశ్రయమై ఆత్మపరమగుచున్నది. కామమునకు భోగమును, ప్రేమ కనురాగమును, భక్తికి త్యాగమును ఫలములు. మానవులకు భోగానురాగములందుగల లక్ష్యము త్యాగమునందు గలుగుట దుస్తరమని గ్రంథము విశదము చేయుచున్నది. జీవయాత్రయందు నిరంతరము సంప్రాప్తమగుచున్న దేహాత్మలసమరమునం దాత్మసామ్రాజ్యమునకు సువ్యక్తమైనభక్తి పండితులకు పామరులకు సులభసాధనముగ నున్నది. ప్రేమభరితమైన త్యాగము భక్తిపరమై జీవయాత్రయందు సుఖప్రాప్తికి సాధనం బగుచున్నది. ప్రేమరహితమైన త్యాగము జీవయాత్రయందు దుఃఖభాజనం బగుచున్నది.

ఇబ్సెనుగారు రచియించిన నాటకము పిచ్చిరెడ్డిగారి రచనయందు భారతసంస్కారమును బొంది దేశావసరములకు ప్రయోజనకరముగ నున్నది. ఇబ్సెనుగారు ప్రదర్శించినదుస్థితి భారతీయులను సంపూర్ణముగ నావహించినది. గురువులు, గురుపీఠములు, ప్రజాహృదయ

ములు చైతన్యము లేక నిద్రించుచున్న సమయము నందు పిచ్చిరెడ్డిగారి గ్రంథము ప్రబోధోదయమునకు దగి యున్నది.

భాష, శైలి భావానురూపములై చిత్తము నాకర్షించుచున్నవి. శ్రీయుత పిచ్చిరెడ్డిగారు వారికృతినాంధ్ర గ్రంథమాలయందు జేర్చినందులకు కృతజ్ఞులము. ఆంధ్రలోక మీనవీనకృతి నాదరించి దానియంతరార్థమును గ్రహించి స్వధర్మనిర్వహణమును జేయుగాత!

ప్రభవ శ్రావణ బ. ౫ బుధవారము } కా. నాగేశ్వరరావు.

# మనవి

నాటకకళాధురంధరులగు 'హెన్రిక్ ఇబ్సన్' నార్వే దేశభాషయందు రచించిన 'బ్రాండు' అను మూలగ్రంథముయొక్క ఆంగ్లేయానువాదము ఈభీష్మునకు మాతృక. సమర్థులగు పలువురాంగ్లేయులను అనువదించుటకై ఈ గ్రంథ మాకర్షించినది. అందు యఫ్. యి. గారట్ గారి యనువాదము గ్రంథకర్తమీది గౌరవము నినుమడింప జేసి నన్నీకార్యమునకు పురికొల్పినది.

హైందవ సాంప్రదాయికములుగ పాత్రలకు పేర్లు మార్చితిని. దేశ, కాల, రుచిభేదములు ఈనాటకము యొక్క మొదటిపద్యరూపమునకు తెలుగున అవస్థాభేదమును కలిగింపజేసినవి.

పాశ్చాత్త్యులపద్యము నిర్లక్ష్యములగు కట్టుబాట్ల వలన మార్పుజెందిన వచనము. దానిని చదువుటకు సంగీతమనవసరము. అందువలన కథాప్రచారమునకు, నిరాఘాటాభినయమునకు అడ్డుండదు.

మన పద్యరచనావిధాన మిందులకు వ్యతిరిక్తము. తెలుగున రాగయుక్తముకాని పద్యము మన్నింపబడదు.

మనపద్యములు వచనమువలె చదువదగియుండవు. ఫలితము: పద్యరూపనాటకము ప్రదర్శించువారు పరిహాస పాత్రులగుట వాస్తవము. కావున ఆమార్గము పరిత్యజింపబడినది. ముఖ్యావసరము లని తోచినచోట్లమాత్రము పద్యము లిమిడ్చితిని.

భాషా మతసంప్రదాయములలో అత్యవసర మని తోచినచోట్లతప్ప సాధారణముగా 'మక్కికి మక్కి' గానే వ్రాసితిని. నార్వే దేశచరిత్రాంశమగుటచే అయిదుపంక్తుల నొకచో విడిచితిని. కొన్నిచోట్ల కొన్నిపంక్తులను మార్చితిని.

ఇవితప్ప ఇతరమగు మార్పు లేవియు చేయలేదు. ఆంగ్లేయానువాదమున గల భాషామార్దవము ఈరచనయందు కొఱవడియుండవచ్చును గాని భావము మాత్రము సంపూర్ణముగ వచ్చియున్నదనియే నాతలంపు.

తమగ్రంథమాలతరఫున ప్రచురించుట కంగీకరించి, ముద్రణాకార్యమునందు శ్రద్ధ వహించి, పుస్తకము నిట్టి సుందరాకారముతో వెలువడజేసిన శ్రీ దేశోద్ధారక వాగేశ్వరరావు పంతులుగారికి మిగుల కృతజ్ఞుడను.

భాషాంతరీకరణమున నాకు తోడ్పడిన శ్రీ మ. కోదండరామిరెడ్డి గారి సాయమును మఱవజాలను. 'ఇబ్సెన్' రచించిన అయిదంకముల పద్యనాటకమును తర్జుమా చేయుట కష్టము గాన పాఠకుల సాదరబుద్ధి యపేక్షితము.

నెల్లూరు,
శ్రావణ ౹౹ ౩౦ లు.

అనువాదకుడు.



# నాటకమునందలి పాత్రలు

—:o:—

1. భీష్ముఁడు — కథానాయకుఁడు
2. అతనితల్లి
3. శరచ్చంద్రుఁడు — ఒక చిత్రలేఖకుఁడు
4. సుధ — కథానాయిక
5. కొత్వాలు
6. వైద్యుఁడు
7. ధర్మకర్త
8. ఉపాధ్యాయుఁడు
9. దేవాలయము గుమాస్తా
10. గిరిక
11. కర్షకుఁడు
12. వానికుమారుఁడు

ఇంకను ఉద్యోగులు, గుమాస్తాలు, కర్షకులు మొదలైనవారు.

# భీష్మము

---

## మొదటి అంకము

---

[హిమాచ్ఛాదితములగు కొండలనన్నిటిని పొగమంచు దట్టముగ కురుస్తూ ఉంది. అరుణోదయకాంతులు వర్ణరత్నపునంమువలె కొంచెముగా గాన్పించుచున్నవి. భీష్ముడు కాషాయవస్త్రములను ధరించి ఒకపొడుగు కఱ్ఱ కోకసందిని తగిలించుకొని పశ్చిమాభిముఖుడై పోవుచున్నాడు. అతనివెంట పోవుచున్న కర్ణుడును, వాని కుమారుడును, కొంత వెనుక నున్నారు.]

కర్ణుడు

(భీష్ముని పిలుచుచు) ఓయీ! అంతవడిగా పోకు. ఎక్కడున్నావు?

భీష్ముడు

ఇక్కడ.

కర్ణుడు

దారి తప్పుతావు. మంచు చూడు ఎట్లా మూసుకొని వస్తున్నదో! బారెడుదూరం కూడ చూపు ఆనడం లేదు.

కుమారుడు

నాయనా! ఇదిగో వెలియ.

భీష్ముడు

కర్షకుడు

నిలువక్కడ; అగాధములు——

భీష్ముడు

దారి కనుగొనుటకు గుర్తే చిక్కుట లేదు.

కర్షకుడు

(గద్గరగా) నిలువు. ఇక్కడనుంచు దమ్మిడీమందముగూడ లేదు. నీప్రవాహముంటుంది; దానిమీద అడుగు పెట్టబోకు.

భీష్ముడు

(వినుటనభినయించి)పైన సెలయేళ్లు దూకు చప్పుడును ఉరుమువలె వినవస్తూ ఉన్నది.

కర్షకుడు

అవును. ఏరుపారుటవలన అంతా కోసివేసినందున అట్లైనది. అది ఎంత లోతున్నదో తెలియదు. మనముగ్గురిని ఒక్క గుటకలో మ్రింగి వేస్తుంది.

భీష్ముడు

నేను పోయి తీరవలయును; ఇంతకుముందే చెప్పితినికదా!

కర్షకుడు

ఎంతబలముండినా ప్రయోజనం లేదు. అది క్రిందంతా బోలు; పగులుతూ ఉన్నది. నిలవ్వయ్యా! మరి అడుగుపెట్టితివా, నీవు చచ్చినవాడివే!

భీష్ముడు

నేనొక మహాపురుషుని వార్తాహారుడను.

కర్షకుడు

ఓహో! ఆయన పేరేమండి!

భీష్ముడు

ఆయన పేరు ఈశ్వరుడు.

కర్షకుడు

సరే. తమ రెవరండీ!

భీష్ముడు

పరివ్రాజకుడను

కర్షకుడు

కావచ్చును. కాని నీవు పరమహంస పరివ్రాజకాచార్యుడవై నాసరే — మామాట వినకుండ ఈ మంచువలయు గుండపోతివా తెల్లవారేప్పటికి శవమొకటి (వ్రేలితో ఎదుట చూపి) అక్కడికి కొట్టుకొని వచ్చియుం టుంది. (నెమ్మదిగా నతనిని సమీపించి గద్దించును) తెలివితేట లెంత ఉండినా పరివ్రాజకుడు వీథిని తిరుగవలసినప్పుడు తాను తిరుగవలసిందే కాని వీథిని త్రిప్పలేడు కదా! ఈమూర్ఖపుపట్టు, పెడకట్టెతనము మాను మనిషి కుండే దొక్కప్రాణము; అదిపోతే రెండవ దెక్కడ తెచ్చుకోగలడు! ఎంతతక్కువగా లెక్కవేసుకొన్నా ఏడుమైళ్లకు లోపల ఇంటిపాలకువ లేదు. మంచు కమ్ముకొని వస్తున్నది. కత్తితో కోసినా తెగేటట్టులేదు.

భీష్ముడు

ఇందుచేత కొండలక్రింద వుండే కొఱవిదయ్యములవల్ల దారితప్పే అవకాశము తక్కువగును కదా!

కర్షకుడు

అయితే అక్కడక్కడ మంచుగుండా లున్నవే; వాటిలో చిక్కు కుంటే మళ్లి ఎట్లు తప్పించుకో గలవు!

శ్రీకృష్ణుడు

మనము వాటిని దాటుదాము.

కర్షకుడు

ఏమీ, నీళ్లమీద నడవడమా? నీవు సరిగా మాట్లాడుతున్నట్లు నాకు తోచలేదు.

శ్రీకృష్ణుడు

దేవునియందు నమ్మకమున్నయెడల కాలు తడిగాకుండా దాటవచ్చునని చూపియున్నారు కదా ఒకరు!

కర్షకుడు

అది ఆదినాలలో. ఇప్పుడు అపనిచేస్తే తల, కాళ్లు నేలతగిలేదాక విరిచేది వట్టిమాట.

శ్రీకృష్ణుడు

మీకు శుభమగుగాక! (పోవును.)

కర్షకుడు

ఎందుకన్యాయముగా నెత్తికి దెచ్చుకొంటావు!

శ్రీకృష్ణుడు

భగవంతునికి నాప్రాణ మవసరమైనయెడల ఈ పర్వతములకును, ఈ ప్రవాహములకును ఇదే స్వాగతము.

కర్షకుడు

(ఆత్యాతురముతో ఊపిరాడక) అయ్యో! వీనికి నిశ్చయంగా మతి పోయింది.

కుమారుడు

(చెవిలో) నాయనా, రా; వెనుకకు పోదాము. పెద్ద తుపాను కొట్టేటట్టుంది.

భీష్ముడు

(నిలిచి, మళ్లవారి దగ్గరకువచ్చి) కర్షకుడా! "నాకూతురు నాగుకవ తాపైపున చావబోతూ 'మానాయనను చూడనిదే నేను సుఖముగా మరణింపలేను' అని నన్నురమ్మని దీనముగా చెప్పిపంపిన" దని నీవే కదా నాతో చెప్పితివి.

కర్షకుడు

అవును; నీవు చెప్పినది నిజమే.

భీష్ముడు

నిన్ను యీ దినములోగా చూడవలెననిగదా ఆమె కోరినది.

కర్షకుడు

అవును.

భీష్ముడు

ఆమె తర్వాత ఒకఘుంటయైన బ్రతుకదుగదా!

కర్షకుడు

అయితేనేమి?

భీష్ముడు

రమ్ము.

భీష్ముడు

కర్ణుడు

నేను రాలేను; వెనుకకు తిరుగు.

భీష్ముడు

(అతనిని తీవ్రముగా చూచి) నిలు. ఆమె యాత్మ శాంతినొందుటకు నూరురూపాయ లియ్యగలవా?

కర్ణుడు

అయ్యా! సంతోషంగా యిస్తాను.

భీష్ముడు

దానిని రెండింతలు చేయఁగలవా?

కర్ణుడు

ఆమె యాత్మ శాంతిఁబొంది గమ్యస్థానము చేరుటకై నా యింటినైనా తెగనమ్మి ఖర్చు పెట్టాను.

భీష్ముడు

అది సరే కాని నీవు యిచ్చెదవా......నీప్రాణము, అందుకు బదులు.

కర్ణుడు

నాప్రాణమా? అయ్యా! స్వామీ!—

భీష్ముడు

అవును; ప్రాణమే.

కర్ణుడు

(తల గోకుకొంటూ) కాదు; దాని కొకపద్దున్నది. శ్రీరామమూర్తి దయవలన, నాకు భార్య, బిడ్డలు ఉన్నారే!

భీష్ముడు

నీవు తెలచినవారికి తల్లి యుండెనుగదా!

కర్ణకుడు

ఆ! అదెప్పుడో! విచిత్రాలు ఒకదానికంటె యింకొకటి జరిగే కాలం లో అట్లా యిప్పుడు జరుగదు. మీకు తెలియనిదేమున్నది!

భీష్ముడు

ఇంటికి పొమ్ము. నీజీవితము మృత్యుపథమున నున్నది. దేవుడు నిన్నె రుగడు. నీవాయనను ఎరుగవు.

కర్ణకుడు

అబ్బా! నీవెంత కఠినుడవయ్యా!

కుమారుడు

(లాగుచు) వచ్చివేయి.

కర్ణకుడు

సరేకాని, అతనుగూడ రావలెనని నేను చెప్పడం.

భీష్ముడు

నేను రావలెనా?

కర్ణకుడు

ఈపాడు ఈదరగాలిలో నీకేమైనా ఉపద్రవము వస్తే మనమంతా కలిసి బయలుదేరిన సంగతి రుజావవుతుంది. కాదని ఎట్లా అంటాం?—నీ విక్కడ సుడిగుండాల్లోపడి మునిగిపోతే, నాకేమో సంకెళ్లు తగిలించి కొట్లో కొడతారు. ఇంకా కష్టపెట్టినా పెడతారు.

భీష్ముడు

అట్లయిన దేవునిపనికై కష్టము లనుభవించినవాడ వగుదువు.

కర్ణుడు

దేవునిపనితో గాని నీపనితో గాని నాకు సంబంధము లేదు. నా పనే చూచుకుంటే చాలినంతవున్నది; ఇంకా జాస్తికూడ.

భీష్ముడు

సుఖించి పో. [దూరమున ఉరుమువలె ఒకశబ్దము వినబడును.]

కుమారుడు

(బిగ్గరగా) అదిగో! అక్కడ వంచుకొండ పడుచున్నది.

భీష్ముడు

పడనీ.

కర్ణుడు

వద్దయ్యా, రా!

భీష్ముడు

నా కభ్యంతరం కలిగించవద్దు.

కుమారుడు

మాతోగూడ రా.

కర్ణుడు

(భీష్ముని పట్టుకొని లాగుచూ) వద్దు; ఒట్టుసుమా.

భీష్ముడు

(వదలించుకొని వానిని మంచముపైన పడద్రోసి)అందుకు......వదలినవాని చింతింపవలదు.

[పోవును.]

కర్షకుడు

(పూర్ణ్యంపి, చేయి తడుముకొంటూ) అబ్బా! ఎముకలువిరిగినవి. ఎంత మోటుమనుండకొడుకు! ఇటువంటివెకాబోలు ఆయన చేస్తానే దేవుడిపనులన్నీ (లేస్తూ చేయిగట్టి) ఓహోయి, పరివ్రాజకుడా!

కుమారుడు

దాటిపోయినాడు—ఆకొండమీదుగా.

కర్షకుడు

ఆ! హా! నాకింకా కనబడుతుంటే? (మళ్లీపిలుచును) ఓయ్, అక్కడ మనము దారి వదలినది ఎక్కడ చెప్తావా?

భీష్ముడు

(పొగమంచులోనుండి) నీకు దారిని తెలుపుటకు స్తంభము లేవియూ అక్కరలేదు. నీవు పెద్దరస్తాలోనే ఉన్నావు. భయపడకు.

కర్షకుడు

దేవునిదయవల్ల అట్లేఅయితే రాత్రికి హాయిగా విశ్రమిస్తాను.

[తండ్రి, కొడుకు తూర్పుముఖముగా నిష్క్రమింతురు.]

భీష్ముడు

(ఇంకా ఎత్తయినచోట ఉండి వారుపోయినవైపు చూచుచు) ఇంటికి పోవుచున్నాగా. (కర్షకుణ్ణిగూర్చి) ఓరి,సోమరిపోతా! నీ కణుమాత్ర మైన ఇచ్ఛయుండి, శక్తిహీనతియే కారణమైనచో విన్న నాపూర్వ మీదనైన మోసికొనిపోయియుందునే. నేనెంతఅలసియున్నను, పాదములు రక్తసిక్తములైయున్నను నీపనిని చక్కచేసియుందును కదా!

కాని తాను చేయజాలినంతకంటె యెక్కువ చేయనిచ్ఛగింపనివానికి చేయూసహాయము నిష్ఫలము. (ఇంకను పైకిపోయి) ప్రాణము! ప్రాణము! ...ఆహా! సుజనులు, వారిభార్యలు తమ ప్రాణములపైన యెంతవిలువనుంతురు? మనకు కనబడు సామాన్యమైన పురుగుగూడ మానవప్రపంచమంతటిని రక్షించు భారము తనభుజములపై బడినట్లు తనప్రాణమునకై- ప్రియమైన ప్రాణమునకై - భయపడుచున్నదికదా! ప్రాణములను-తమ ప్రియమైన ప్రాణములను- తాకకుండ వదలునెడ సంతోషముతో నెంతయైన యిత్తురు. (స్మృతి నభినయించి చిరునవ్వుతో) బడిలో రెండుసంగతులు మనసుకుతోచి నా చిరుతప్రక్కలు నొప్పియెత్తునట్లు నవ్వినంగలను నాచర్మమును బడిపంతులబెత్తము రుచిచూచినది. చీకటికి భయపడు గడ్లగూబ, నీళ్లలోదిగ జంకు చేప — నేనునవ్వితిని; మఱచిపోవ యత్నించితిని. కాని అవిమాత్రము నామనస్సులో గట్టిగా నాటుకొన్నవి; వదలలేదు. ఆహాసమంజరి యెక్కడ ఉదయించెను? ఈ లోకమునందు స్థితి, ఉండెడలనస్థితి, క్రియ, ఇచ్ఛ, భారము మాయచేర్పడిన భుజములు, వానిపని కష్టమని తలచుహృదయము వీటికిగల భేదమనెడు యాఘాతమే దానిఉదయమునకు కారణము. ప్రతి మనుజుడు —స్వస్థుడుగాని, అస్వస్థుడుగాని— అట్టిచేప అట్టి గుడ్లగూబవంటివాడు. సంసారకష్టములకై నిర్దేశింపబడి, సంసారచక్రఘోరపరివర్తనలకుపరిచితుడయ్యును దానివలననే భయముచెందుచున్నాడు. తీరమునకును, సముద్రమునకును మధ్య ఆవేదనలో మునుగుచున్నాడు. నక్షత్రశోభితమగు రాత్రికి వెఱచి, చండభాను తీక్ష్ణాతపములోపడి మ్రగ్గుచున్నాడు. (కొంచెముసేపు కదలకనిల్చి, ఉలికిపడి, వినుట అభినయించి.)

ఆ వినవచ్చునది పాటయా? అవును. హాసమిళిత మగు గానము—
ఉత్సాహసూచకధ్వని—మఱియొకటి—మూడు—నాల్గవది యనుస
రిస్తున్నది.

పరుగిడెడు భానుగని భయపడినపగిది
మంచుపొగ పాఱుకొలఁది గాన్పించు వెల్ల
బయళు లవిగో- యిప్పుడె విప్పి పఱచినట్లు—
—కొండబుజమెక్కి నిలిచి రాకొదమ యెండ.

భోగలాలసులగు వారి నీడలు దీర్ఘములై కాన్పించుచున్నవి. ఆలింగ
నాది ప్రేమసూచకక్రియ లాచరించి వీడ్కొనుచున్నారు—ఇప్పుడు
చీలిరి...ఇద్దఱు మాత్రము పడమటివైపుగ నస్తున్నారు...ఇతరులు
తూర్పునకు మరలిరి. దూరమునుండి హస్తసంజ్ఞలచే వీడ్కొలుపు
చున్నారు.

[సూర్యుడు కొంచము కొంచముగా మంచుచీల్చుకొనుచు ప్రకాశించు
చున్నాడు. భీష్ముడు వచ్చుచున్నవారిని జూచుచు నిలువబడును.]
ఆహా! వీరిరువురి మట్టును,

క. కలదొక తేజము, వారలు
నిలిచినచో మంచు కఱఁగు, నేర్పున గిరియుఁ
వలిపము దాల్చును బచ్చగ
కలకల స్వర్గంబు నవ్వ గతి గాన్పించుఁ.

చెల్లెలు...నిజము......అన్నతోగూడా......వారిద్దఱు ఒక తల్లి
బిడ్డలు. చేతిలో చేయిజేర్చి పచ్చిక కంబళముపై నాడుచున్నారు.

భీష్ముడు

చూడు, ఆమె తూనీకవలె ఎంత తేలికగా తిరుగుచున్నదో. అతడును చాల చురుకుగా నున్నాడు...అదిగో! అతనిని విడి తప్పించుకొన్నది. అతడు పట్టుకొనును. లేదు; తప్పించుకొనుచునేయున్నది. వారు తిరుగు కొనునట్టి ఆట యగుచున్నది...అతడు...వారి నవ్వు పాటరూపు చెందినది.

[సుధ, శరచ్చంద్రుడు ప్రయాసపువేగములతో న్యగరుమలతో, బయళ్లపై ఎగురుచు వత్తురు; మంచు విచ్చిపోయినది; నిర్మలవసంత ప్రాభాతిక కాంతులు పర్వతముపై బడియున్నవి.]

శరచ్చంద్రుడు

ఓసుధా! నాముద్దతుమ్మెద!"
ఉంచు నీరెక్కలను బట్టెద,
చిన్నికన్నుల వలనునేసితివే
అదియేది యనెదవో
నేనుపాడెదు పాటలేసుమ్మీ!

సుధ

(వానిముందు ఆడుచు, తప్పించుకొనుచునే యుండును.)

చిన్న మెరుపుల తుమ్మెదైతే
పూలతేనియ లానని నను
నన్నుతరిమెడి బాలకుండవుగా,
నీవుండుమయ్యా
నన్నునెప్పుడు పట్టకుండగనే.

శరచ్చంద్రుడు

ఓ సుధా! నా ముద్దుగుమ్మైన !!
ఎగిరిపరువిడ జూచుచున్నావా,
నేను నావలపన్ని యుంచితినే
నిశ్చయముగా నీ
వందులోపల చిక్కుకొనెదవులే.

సుధ

ముద్దులొలుకుచు క్రొత్తకుమ్మైన
నైనయెడ నే పరుగులిడునటు
తెలియక నన్ననుసరించవలెగా
నీవలకుజిక్కిన
రెక్కలను తాకకయె యుండవలెగా.

శరచ్చంద్రుడు

లేదులే, నిన్నెత్తి మెల్లగ
నాదు హృదయములో బిగించెద
నీవు నేర్చినయాటలన్నిటినీ
ఉల్లాసకరముగ
నెల్ల కాలము నాదుకొను మచటనే.

[గమనించకయే ఒకనిట్టమైనచరియ అంచుకువచ్చి నిలబడుదురు.]

భీష్ముడు

(చేతులుతట్టి అరచును) నిలపండి; నిలపండి. మీవెనుక పారియు!

శరచ్చంద్రుడు

అరచిన దెవరు?

సుధ

(పైనచూపుచు) చూడు.

భీష్ముడు

త్వరగా తప్పుకొండి. ఒకబోలుమంచుకుప్పమీద నిలుచున్నారు. క్రింద లోయలో పడనున్నది; జాగ్రత.

శరచ్చంద్రుడు

(ఆమెమెడపై చేయివేసికొని భీష్మునిజూచి నవ్వుచు) ఆమెకు నాకు భయముతో నవసరము లేదు.

సుధ

మా ఆటకుముందు మాజీవితములంతయు గలవు.

శరచ్చంద్రుడు

మామార్గము భానుకిరణభాసితము; నూరుసంవత్సరములవరకది ముగియదు.

భీష్ముడు

అంతవరకు మీరు క్రిందికిపోరు? మంచిది!

సుధ

(మేలిముసుగు సెగరవైచుచు) అంతట మాయాట ఆకాశమున కెగిరిపోవును.

శరచ్చంద్రుడు

నూరుసంవత్సరములు క్రీడించెదము. ప్రతిరాత్రియు మంగళదీపములు వెలుగుచుండ మానవయస్సంతయు దారుణయాతనలకే—

భీష్ముడు

అటుపిమ్మట;

శరచ్చంద్రుడు

తర్వాత, యింటికి—స్వర్గమునకు.

భీష్ముడు

అయితే. అచ్చటనుంచి మీరువచ్చినది? ఆ!

శరచ్చంద్రుడు

అవును, నిశయము. మరెచ్చటనుంచి!

సుమ

ఇప్పుడు మాత్రము ఆతూర్పుగట్టున లోయనుండి యీకొండమార్గమున వచ్చితిమి.

భీష్ముడు

నేను మిమ్ములను చూచినట్లు జ్ఞాపకం, ఒకసారిమాత్రం, ఆఎత్తుకొండ వెన్నెముకమీద.

శరచ్చంద్రుడు

అవును; ఆ అంచున యిప్పుడే మా స్నేహితులను వదలినది.....మా వద్దకు దిగిరమ్ము. దేవుడెట్లు నిరుపమానముగ నుండెనో తెలిపెదను. నీవు సంతోషముయొక్క సమ్మోహనప్రభావము ననుభవింతువు

శిష్యుడు

రమ్యా ఓయీ! మంచుబొట్టువలె వ్రేలాడుచుండకుము......ఆహా! ఇప్పుడు హిమము పలుచనగుచున్నది......మొదటిసంగతి. నేను చిత్రలేఖకుడను. అందువలన ఆనందదాయకములగు సంగతులను దెలిపెదను. నాచేయి నాభావమునకు రెక్కలువలె నొప్పు వేయగలదు; అచేతనములగు వర్ణములకు జీవము పోయగలను. దేవుడు పురుగునుండి సీతాకోకచిలుకను చేయగలడుగదా! అట్లే ఇప్పుడు వీటి నన్నిటిని మించిన సంగతేమనగా: ఆయన సుధను నాకు ప్రేయసిగా ప్రసాదించినాడు. నారంగులపెట్టె వీపునకు తగిలించుకొని దక్షిణదేశయాత్ర చేసి నేనిటు వచ్చినాను.

సుధ

(ఆతురతతో) రాజువలె సంతోషముగా పాడేందుకు వెయ్యి పాటలతో.

శరచ్చంద్రుడు

నే నీప్రదేశమునకువచ్చినప్పటికి ఈమెకూడ నిచటనే పర్వతసమీరాస్వాదనలోలయై బాలభానుని, ప్రాలేయమును, వన్యపుష్పములను గని ఆనందించుచుండెను. నన్నేదోయొకశక్తి ప్రోత్సహించినది:— 'పో, సౌందర్యములను వెదకు; వనములలో, పచ్చికబయళ్లలో, పోయి వెదకు' అని ఆపాట స్పష్టముగా, బిగ్గరగా, నాహృదయాంతరాళమున వినబడినది. అదిగో అక్కడ, ఆకాశము వంగియున్నదే, దానిక్రింద మబ్బులగూకసము కదలుచున్నదికదా, అచట నాముఖ్యచిత్రమును చిత్రించితిని.

కన్నియకపోలములు విల
సన్నవపుష్పితగులాబి జంటయె యగు; హా

సోన్నతి జ్వలించుకన్నులు;
అన్నా! హృది బాటపాడె నాయెలనగవుల్.

సుధ

లేదు. ఒకగ్రుడ్డిగ్రుక్కతో జీవితపాత్రమును ఖాలిచేసివేసినావు. ఉదయాన్నే మత్తునివలె, కర్రను చేతికిదీసికొని, సంచి తగిలించుకొని మళ్లీ ప్రయాణానికి సిద్ధమైతివి—

శరచ్చంద్రుడు

అప్పుడాయూహ తళుక్కున మెరసి నాకు గాటముగా తగిలినది-"ఏమి, నీవు నీప్రణయానురాగముల నామె కెరిగించుటకే మరచితివే—"అని. అప్పుడే నాప్రేమ నెరింగించితిని. ఆమెయు అప్పుడే సమ్మతించెను. అంతయు నిమిషములో అనుకూలమయ్యెను. వృద్ధపౌరోహితుడు చెప్పజాలనంత ఆనందమును బొందెను. మూడుదినములు విందులతో ఉత్సవములతో, వేడుకలతో ప్రధానము జరిగెను. పిన్నలు పెద్దలు అందరు వచ్చిరి. ఇంటివద్ద విందులుమాత్రము రాత్రితో ముగిసినవి. అయితే మావిహారములుమాత్ర మంతటితోముగియలేదు. ఆడుచు, పాడుచు, ఆరెుత్తుదాక కొందరు మాతోవచ్చిరి.

సుధ

హాయిగానాటపాటల నరుగుమాకు
ఈప్రయాణము మిక్కిలి యింపునింపు

శరచ్చంద్రుడు

అంతమెరుగని ప్రణయ రసానుభవము
మాదె యాగాదె యీమధుమాసనిశల.

భీష్ముడు

మాదుమధురగీతములచే మారుమ్రోగ

సుధ

చైత్రమాసపువెన్నెల రాత్రులెల్ల

శరచ్చంద్రుడు

అలముకొనియున్న ఈయుత్తరాది మంచు
పరుగులిడు ముందె మేమిటు వచ్చుకొలది.

భీష్ముడు

ఇప్పుడు మీరుపోవుట—ఎచటికి?

శరచ్చంద్రుడు

పట్టణమునకు.

సుధ

నాయిల్లచటనున్నది.

శరచ్చంద్రుడు

మొదట ఆశిబిరముదాటి తర్వాత మాదారి ఆవాగుకు పడమటివైపుకు దిగును. అచటనుండి పడవనెక్కి జోరుగా ఇంటికి వెండ్లివింగుకు బోదుము. కడపట,

దిగుదు మొకచోట దక్షిణదేశమందు
చదల నెప్పుడు వసియించి మొదటితడవ
నవనిపై వ్రాలు హంసద్వయంబు బోలె.

భీష్ముడు

అటుపిమ్మట?

శరచ్చంద్రుడు

కలలవలె విశాలము, గా
ధలవలె రమ్యము లు జీవితంబే యొక పెం
డిలి విందుగ—

ఉత్తరిగ కనబడు యీకొండలు,

అర్చకుడు లేని గొప్ప దేవాలయంబు
లేతప్రాణులు కష్టాలు లేక హాయి
ననుభవింప నిర్దిష్టములై రయ్య యిచట
యీ శుభోదయమున—

భీష్ముడు

—అయ్యొ ఎవరివలన?

శరచ్చంద్రుడు

క్రీడాలోలు రంపరిగలగ;

లేతయాకుల మాపొదరింటిచుట్టు
వ్రాల నుంకించు పాడు తుపాను మబ్బు
పానపాత్రల ధ్వనులకే పారిపోయె
హృదయమున దౌష్ట్యమును గల్గి బెదరుగొలుపు
పదసమూహము నెల్ల వాఙ్మయమునుండి
తరిమివైచిరి పూదండ తలకు జుట్టి
హాయి యీయాస్తిని మా కుపాయన మొసంగి.

భీష్ముడు

మీ కిరువురకు శుభమగుగాక! (పోవ మొదలిడును.)

శరచ్చంద్రుడు

(ఉలికిపడి భీష్ముని బాగుగ పరిశీలించును.) కాదు. ఒకక్షణ మాగుము. ......జ్ఞాపకమునకు......అందులో ఏమి లేకుండవచ్చును. వచ్చి నట్లే ఉన్నది.

భీష్ముడు

(తీక్ష్ణముగ) నీవు నన్నెరుగవు.

శరచ్చంద్రుడు

స్మృతికివచ్చినట్లే నిశ్చయించినాను......ఎప్పుడో......ఎక్కడనో ......ఇంటివద్దనో......బడిలోనో నాకు సరిగా జ్ఞప్తియుంటే—

భీష్ముడు

బడివద్దనే; అవును; అక్కడ మనము చెలికాండ్రము. అప్పుడు నేను బాలుడను; ఇప్పుడు తరుణవయస్కుడ నైతిని.

శరచ్చంద్రుడు

అది నిశ్చయము కాదు. (తటాలున ఆశ్చర్యముతో) నీచేయి; ఆ! నీవు! ఇప్పుడు నిన్ను నాకు తెలుసును—భీష్మా!

భీష్ముడు

మొదట నుండియు నిన్నెరిగియుంటిని.

శరచ్చంద్రుడు

బలే కలుసుకొన్నాం; బలే కలుసుకొన్నాం. ఇదే సుదినము. మేము

గోలీలేయుచు ఆడుచు నిన్ను పిలిస్తే వచ్చేవాడవుకావు. అట్లే నీమ ట్టుకు నీవు ఏకాకిగా ఉండేటిఘము మానలేదే!

భీష్ముడు

అవును; అక్కడ నాకు యిల్లులేదు. ఇక్కడా అంతే......కాని నిన్నుమాత్రము నేను ప్రేమించితిని. దక్షిణపు పల్లపుభూముల నుండి వచ్చిన మీరందరు, నదీముఖమున భయోత్పాదకములగు పర్వత ఛాయలలో నెదిగిన నాకంటె భిన్నమైన ప్రకృతిగలవారని తలచితిని.

శరచ్చంద్రుడు

నీస్వస్థల మిచ్చటనే...నే నెఱుగుదును.

భీష్ముడు

నామార్గము దానిప్రక్కనే పోవును.

శరచ్చంద్రుడు

దానిప్రక్కన!—అయితే, ఇంకాదూరం తిరుగుతావు?

భీష్ముడు

ఇంకాదూరమా? అవును—మాయిల్లుదాటి చాలదూరము.

శరచ్చంద్రుడు

నాయూహ సరియైతే నీవొక పరివ్రాజకుడవు.

భీష్ముడు

(చిరునవ్వుతో) అవును. ఈదినమిక్కడ. రేపెక్కడనో? పైరులో కుందేళ్లవలె మాపని.

భీష్ముడు

శరచ్చంద్రుడు

అయితే నీకడపటిగమ్యస్థాన మేది?

భీష్ముడు

(త్వరగా కఠినముగా) దానినిగూర్చి అడుగకుము.

శరచ్చంద్రుడు

ఎందువలన?

భీష్ముడు

(స్వరముమార్చి) ఆ! మంచిది! మీపడవ—మీరు చెప్పుచుంటిరే ఆ పడవ—నన్ను గూడ ఒకచోట దింపును.

శరచ్చంద్రుడు

మా పెండ్లిగురమా! అరే ఎంతసంతోషము! సుధా, ఆలోచించు; మనమందఱము పోవుదారి ఒక్కటే.

భీష్ముడు

నేనుపోవునది అపరకర్మలు జరుపుటకు.

సుధ

అపరకర్మలు!

శరచ్చంద్రుడు

నీవు భూస్థాపితముచేయబోవున దెవరిని?

భీష్ముడు

ఎవరినిగూర్చి మీరు గర్వపడుచున్నారో ఆ దేవుని.

సుధ

(భయపడి వెనుకకుజంకి.) రమ్ము, శరచ్చంద్రా!

శరచ్చంద్రుడు

భీష్మా!

భీష్ముడు

బాగా గుడ్డచుట్టి పెట్టెలో పెట్టి, మీభౌతిక పుదేవుడు, మన్ను కుబానిస, పట్టుపగలు ఫ్రూడ్సి పెట్టబడును. ఇప్పటికైన ఆపనిని పూర్తిచేయుట మంచిది. ఎప్పుడో అయిపోయియుండవలసినది. ఈ వేయిసంవత్సరములు అత దస్వస్థుడుగా నుండినసంగతి చాలకాలముక్రిందటనే బహిరంగమాయెను.

శరచ్చంద్రుడు

భీష్మా! నీవు జబ్బుగా నున్నావు.

భీష్ముడు

లేదు. బాగా ఆరోగ్యముగనే యున్నాను. రాతిమీద మొలచిన చెట్టువలె గట్టిగా, ఈ పాపిష్టికాలము, ఇప్పటిప్రజలు—నిజముగా—వీరికి చికిత్సకావలసినది. మీకేమి? ఆట పాటలతోడనే సరిపోవుచున్నది. నమ్మకముంటే చాలు. మీదృష్టి వేరువైపునకు ద్రిప్పవచ్చు. మీభారము, దాని కష్ట నిష్ఠురములంతా అతనిమీద త్రోసివేసి, మీరు తొలగండి! మీకై ముండ్లకిరీటముధరించి—ఆ మహాత్యాగమును చేసినే, తనప్రాణమును ధారపోసెనని మీరు నేర్చుకొనలేదా? అట్లుచేయుట అతనిపని; మీరుమాత్రం ఉల్లాసంగా ఆడవచ్చు. ఆడండయ్యా ఆడండి! మీ ఆటలెక్కడ ముగియునో......మిత్రమా! అది వేరువిషయము.

భీష్ముడు

శరచ్చంద్రుడు

ఆహా! యిప్పుడు తెలిసెను. పల్లెల్లో, పట్నాలలో ఎక్కడా పాడేపాటేకదా యిది. దానికిప్పుడు మంచిసమయము; జీవితమంతయు కన్నీటివరద అని బోధించువారిలో కడపటివాడవానీవు? నరకలోక గంధకజ్వాలల గాథలతో ప్రపంచమును దుఃఖమగ్నము చేయవచ్చితివా?

భీష్ముడు

నేను నీతిని బోధించువాడనుగాను. గురువుననిగాని పరివ్రాజకుడననిగాని పలుకుట లేదు. హిందువుడనో కానో తెలియదు. ఇదిమాత్రము నేనెరుగుదును. నేను మనుష్యుడను. నాదేశసారము నంతయు పిల్చి వేయుగాయముపై నాచేతినుంచి అడ్డగింతును.

శరచ్చంద్రుడు

ఏమి? ఇట్లుచెప్పుటకు నీవు మొదటివాడవు—మన పురాతన దేశమునకు కావలసినంతకంటె కొంచెమెక్కువగనే బలముగలిగియున్నది

భీష్ముడు

అట్లే అయినయెడల బాగుగ నుండియుండును. ఆనందము తనకు స్తన్యమిచ్చిన రొమ్మును మరచదు. తుచ్ఛసుఖములకు బానిసలమని ఒప్పుకొనుడు. మంచిది; పుట్టినదిమొదలు గిట్టునందాక అట్లనేయుండుడు. ఒకనిమిష మొకటి, మరునిమిష మొకటిగా నుండకుడు. దేనిలో ప్రవేశించినను మనఃపూర్తిగా చేరుడు. కాని ప్రతివిషయముమీదను కొంచెము కొంచెము మనస్సుంచకుడు. మధుపానలోలత్వమున అందము గలదు; కాని త్రాగుచు చింతనొందుచుండువాని యందు గొప్పతనమేదియు లేదు. కొంచెము దేశముతిరిగి పరిశీలనదృష్టులను ప్రజలపై

సారించుము. ప్రతిమానుజుడును ప్రతివిషయమునం దీషత్తైనను ఎరుగి నేర్చియున్నాడు. పర్వదినములయందు కొంచెమాచారము, ప్రాత యలవాటులయెడ కొంచెము నమ్మకము, అన్నపానాదులయందు కొంచెము లోలత్వము (వారి తండ్రులును అట్లే యుండిరి.)............ వాగ్దత్తములలో కొంచెము ధారాళము, ఇట్లే.....అంతయు కొద్దిగనే-తప్పినా ఒకముక్క-గెల్చినా అంతే; మొత్తముమీద చూచినా, చిల్లరగాచూచినా, మంచిలోచెడ్డలోకూడా భాగం; అభిప్రాయాలలోనంతే; క్రియలలోనూ అంతే.

అయితే ప్రతిఒక్క-దానివల్లను—వచ్చినరోగమే అది—అన్నియు ఉపయోగములేకుండ బోవుచున్నవి.

శరచ్చంద్రుడు

ఆక్షేపించుట చాలతేలికయగు విషయము. ఓర్చుకొని యుంటేగా ఇంకను బాగుండును.—

భీష్ముడు

కావచ్చును; అయితే అంతలాభకరమైనదిమాత్రము కాదు.

శరచ్చంద్రుడు

జనుల లోపముల జాపితా—నాకేమిపుడు—ఒప్పుకొందాము. కాని అయ్యా! నేనెవరినిగూర్చి గర్వపడుచున్నానో, నీవెవరిని పూడ్చ దలచియున్నావో, ఆయనను నీ వాక్షేపించగలవా?

భీష్ముడు

మిత్రమా! నీవు చిత్రలేఖకుడవుగదా! నీదేవుని మనముందర బెట్టు. నీ వాతని చిత్రించియున్నావని, ప్రజలందరు ఏకగ్రీవముతో దానిని

మెచ్చుకొనిరని వింటిని. చెప్పు. అతడు కొంచెము వయస్సు చెల్లిన వాడుగదా!

శరచ్చంద్రుడు

అయిననేమి?

భీష్ముడు

సరి. ముసలియగుచున్నాడు. తాతకువలె వెంద్రుకలు పలుచనైనవి; వెండిపోగులవలె గుబురుగడ్డము; కోపిష్ఠి కాదు:—కొంచె ముండవచ్చును లే—పిల్లలను భయపెట్టి నిద్రపుచ్చేటంత. కాలిజోడా; మరేమైనా; అదేమంత ముఖ్యమైన విషయముకాదు—నెత్తిన టోపిబెట్టి, కండ్లకు సులోచనములుంటే తగియుండును.

శరచ్చంద్రుడు

(కోపముతో) ఏమంటావు?

భీష్ముడు

నిన్ను హాస్యమాడుట లేదు; మనసొంతపు- మనజాతీయపు—దేవుని నిక్కమైనరూపే అది.

రోము తద్రతుకు రూపము నెపుడు
పాల్గాలివుబిడ్డగ భావించినట్లు
మీరలు మీదేవు మిడికెడువృద్ధు
రెండవబాల్యంబు దండజేర్చెదరు
శంకరుపీఠి నాచార్యునిరీతి
సర్వేశుని ప్రపంచసామ్రాజ్య మెల్ల
సర్వమార్గంబుల సంక్షప్తపఱచి

దేవాలయములకు దీటుచేసెదరు
బ్రతుకునమ్మకముల భాగింతు రెపుడు
జీవితావధి మీకు చింత్యమేకాదు
చావకుండిన జాలు సర్వయత్నముల.

బలహీనులు, లక్ష్యమే లేనివారు నగు మీకు సంపూర్ణ జీవిత మవసరము కాదు. మీ దేవుని—వ్రేళ్లసందున తొంగిచూచుచుండువానిని—చిత్రించుము. అతనిని వయసుకు దగినట్లు—బట్టతల, వృద్ధు, చావ సిద్ధముగ నున్నవాడు. నా దేవుని తెరగు వేరు. అతడు ఝుంఝామారుతము, నీ దేవుడు పిల్లగాలి; అతడు దుర్నిరీక్ష్యుడు, అగమ్యుడు; ఇతడు బధిరుడు. అతడు ప్రేమమయుడు; ఇతడు స్థాణువు. అతడు అభిమన్యునివలె యౌవనుడు; డెబ్బదేండ్ల ముదుసలి గాదు. పూర్వము ముండ్లపొద మండినప్పుడు ప్రళయకాలపర్జన్యగర్జానుకారియగుచు నాతని వాక్కొకసారి వినిపించెను. పర్వతములను సహితము సమూలముగ నుత్పాటింగించిన యా ధ్వనియెదుట 'మోసెసు' గూడ హ్రస్వరూపియై అడగిపోయెను 'గిబియను' లోయలో సూర్యునవరోధించుట మొదలగు వింతలెన్నియో అత డొనరించెను. మీవలెనే కాలముగూడ చెడిపోయి యుండబట్టిగాని యిప్పుడైనను అట్లే చేయగలడు.

శరచ్చంద్రుడు

(నమ్మకము లేక చిరునగవుతో) నీవు కాలము నుద్ధరించెదవు?

భీష్ముడు

నిశ్చయముగ వినుము. నే నీయుద్ధమునకై యే క్రమక్రమముగా మనప్రాణముల హరించు ఈవ్యాధి నివారణకొఱకే జన్మించితిని.

శరచ్చంద్రుడు

(తలనాడించుచు,)

పొగయటం చగ్నికణము నార్పగ దలంతో
నిలుపు దీపము కుదురుగ వెలుగువఱకు;
వాడు భాషనాశముచేయ వలవదయ్య
నవ్యమగుభాష సిద్ధమౌ నాటిదనుక.

భీష్ముడు

అదిగాదు. నేనుద్దేశించియుండు విషయము క్రొత్తది. శాశ్వతపువాక్కులనుగూర్చియే నేచాటునది. మతములు, మతసూత్రములు వచ్చుచుండును, పోవుచుండును. వానికి కారణము వేఱొకటి. అవిరెండును తమ మొదటి దినమునుచూచెను. అందువలననే తమ కడపటిదినమును చూడ గలవు. సృజింపబడిన ప్రతివస్తువు నాశనమొందును, క్రిమికీటకాదులచే కలుషితములై, భేదమెరుగని కాలశాసనమువలన నెద్దియోయొక గర్భస్థ రూపికి తావునివ్వగలవు. కాని స్థిరముగ నిలుచున దొక్కటిమాత్రము గలదు. అవ్యక్తమగు నాయాదిశక్తి. ఒకపరి పతితమైనదానిని, మున్నొక మహాత్ముడుప్రాణత్యాగముచే నుద్ధరించెను. జనులలో స్వచ్ఛమగుభక్తి ప్రబలియుండినప్పు డున్న తాళయపూరితమగు నాత్మకును, మాంసవినిర్మితమైన దేహమునకును సంబంధము నాశక్తి కలుగజేసెను. ఇప్పుడు భగవంతునిగూర్చినక్రొత్తయభిప్రాయములు ప్రబలుటవలన నెక్కడచూచినను దానిగూర్చినమాటలే...ఏదో ఒకటొకటిగ...వినవచ్చుచున్నవి. కాని యీ యాత్మశకలములనుండియు, అవశిష్టములగు ఈమొండెములనుండియు, ఛేదితములగు ఈ కరమస్తకాదులనుండియు ఆ యాత్మ

భీష్ముడు

పూర్ణమై యావిర్భవింపగలదు. భగవంతుడు సంపూర్ణశక్తితో మనుజుని—తన ముఖ్యప్రతిమను—తనకుమారుని—తన 'ఆదామును'—తరుణనవయౌవనరూపశోభితునిగా నిర్మింపగలడు.

శరచ్చంద్రుడు

శుభమగునుగాత! ఇచటనుండి మేము వేరగుదుము. అది మంచిది.

భీష్ముడు

ఆ; మీరు పడమటివైపునకు బోయెదరా? నేను త్తరమునకుబోయెద. వానికు రెండుదారులు బోవును. రెంటికిని గమ్యస్థాన మొకటే. శుభమగునుగాక!

శరచ్చంద్రుడు

శుభమగునుగాక!

భీష్ముడు

(క్రిందికిబోవుచు- వెనుకకుదిరుగును.) రాత్రినుండి దినమును వేరుగనుంచుము. జీవిత మొక శిల్పమని జ్ఞాపకముంచుకొనుము.

శరచ్చంద్రుడు

(చేయివిసరుచు.) నీయిష్టమువచ్చినట్లు ప్రపంచమును తలక్రిందులు చేయుము. నేను మాత్రము నాపురాతనపుదేవునే నమ్మియుండెదను.

భీష్ముడు

మంచిది. మూడుకాళ్లముసలిని కర్రతోగూడ జిత్రించుము. నేనాతనిపాతిపెట్టుటకు వెళ్లెదను. (దారినే క్రిందికి పోవును.)

శరచ్చంద్రుడు

(నిశ్శబ్దముతో దూరముగాబోయి భీష్ముడుపోయినవైపు చూచును.)

సుధ

పరధ్యానముగా కొంచెముసేపు నిలుచుండును. ఉలికిపడునట్లు లేచి చుట్టునుచూచి వ్యాకులచిత్తయై సూర్యుడ స్తమించెనా?

శరచ్చంద్రుడు

లేదు. మబ్బుచాటుననున్నాడు. చూడు తిరిగి ప్రకాశించుచున్నాడు.

సుధ

గాలి ఎంతచలిగా నున్నగి !

శరచ్చంద్రుడు

అవును. ఆకొండలలో సందుగుండా యిప్పుడు చలిగాలి కొట్టినది. క్రిందికి దిగి పద.

సుధ

మనదారి కడ్డముగా నుండిన దక్షిణపువైపుకొండలు......ఇంతకుముం దంతనల్లగా గన్పించలేదు.

శరచ్చంద్రుడు

నీవు మొదట వాటిని గమనించి యుండలేదు—ఆతడువచ్చి అరచి ఆట లాడకుండ మనల భయపెట్టునరకు—. అతడిని పోనీ; అయున్మత్తుడు అడ్డమువచ్చెనే అచ్చటనుండి మనఆట మరల నందుకొందము.

సుధ

ఇప్పుడు గాదు. ఆడుటకు నేను చాలా అలసియున్నాను.

శరచ్చంద్రుడు

అవును. నాకును అల్లేయున్నది. నిజంగా యిక్కడ క్రింద, ఆపైన కటకముమీదవలె అంత తేలికకూడా కాదు. కాని దీనిని వెనుకవేసిన

తరువాత......అప్పుడు!......ఇంతకుముందుకంటె పదింత లెక్కువ యుత్సాహంతో, సంతోషంతో ఆడుచు పాడుచు ఉండవచ్చును.

సుధ

అటుచూడుము.

అతివ ? కంటివె ! ఆ నీలియంచు రేక
ఖరకరస్పర్శ ధగధగ మెఱయు నిపుడు
నవ్వు వికసించు, నపుడె వర్ణముల మార్చె
అహహ ! వెండియె నిమిషాన 'అంబ'రయ్యె.

చాలదూరమున, నిర్మలమైన దిఙ్మండలమున కావల కనబడునదియే సముద్రము. నల్లనిదారమువలె వంకరగానుండునది తీర్థమునకు బోవుదారి; కనబడుచున్నదా? చుక్కవలె నగపడుచు చూచుచుండగనే కొండకావల నదృశ్యమగుదాని చూచితివా? అదియే మనయోడ; నీది నాది. చక్కగా నీటి కెదురెక్కుచున్నది. నీవు నేను దానిలో జేరినతర్వాత యీసాయంత్రం ఏటినుండి సముద్రానికి ప్రయాణమగును. ఇప్పుడు దానిచుట్టును బూడిదవలె పొగమంచు కప్పియున్నది. .........సుధా! పలుకవేమి? ఆకసమును, సముద్రమును ఎంత ముచ్చటైనరంగులతో ప్రకాశించుచున్నవి!

సుధ

(పరధ్యానముగా తనముందుచూచి పలుకును) అవును........కాని చెప్పు, నీవు చూచితివా?

శరచ్చంద్రుడు

దేనిని?

సుధ

(అతనివైపు చూడకయే దేవాలయములలోవలె మెల్లగాపలుకును.) మాట్లాడుచుండినప్పుడు అతడు ఎట్లాయెను!

[దారినే క్రిందకు దిగిపోవును. శరచ్చంద్రు డనుసరించును.]

[కొండలనడుమ శిబిరము నానుకొని యొకదారి. కుడిచేతివైపు అగాధమగు నొకలోయ. ఇంకను దూరమున ఈకొండమీదుగా జూచిన, అత్యున్నతమలగు శిఖరములు, హిమావృతములు, కనబడును.]

భీష్ముడు

(ఆదారిని నడచుచు,దిగువకువచ్చుచుండును. నడిదారిలో చాల ముందుకువచ్చియున్న ఒకరాతిపై నిలుచుండి క్రిందిసారంగములోనికి చూచుచు.) ఇకను నాకు తెలియును. ఈపొలాలు,ఇండ్లు, ప్రతిదియొవరిదైనది చెప్పగలను. ఆముందుకువచ్చియుండుకొండ......ఆకావిరంగు, మన ప్రాతదేవాలయము......ఆప్రవాహముపొడుగున నుండు చెట్లవెలుగు, నాబాల్యము స్వప్నమువలె అంతయు ఇప్పుడు స్మృతికి వచ్చుచున్నవి. అయితే భేదమేమనగా: ఇప్పుడు ప్రతిది చిన్నదిగను, ప్రాతదిగను నున్నటులు తోచుచున్నది. పర్వతపునుదుటినుండి మంచుమాత్ర మెక్కువగ పడుచున్నట్లున్నది. ఆకసము తగులుచున్న యీకొండ గోపురములలో ఇంకొకటి అన్నిటికన్న ఎత్తైనది చేరి అపరించి బెదరించి, అడ్డగించి సూర్యకాంతి నంతటిని దొంగిలించి చీకటి చేయుచున్నది. నిజంగా!... .. (కూర్చుండి దవ్వునకు దృష్టిపరపును.) ఆ! అదే వాగు. చిన్నప్పుడది అంత చిన్నదిగా నిర్జీవముగా ఉండినదా? అబ్బా! పోరుగాలి. గాలికి ముందుగా ఒక తెరచాపగట్టిన

పడవ ఉన్నది. ఆ వంగియుండే రాతిక్రింద దక్షిణముగా నుండునవి అంగడియిల్లు, పడవరేవు. వానివెనుక ఎఱ్ఱనిగోడ—అది అనితంతువు శాలము. నదీముఖమువద్ద—వితంతువు శాలము... నా బాల్యానుభవములు వేయివిషయములు తరంగములవలె నెట్టుకొని స్మృతిపథమునకు వచ్చుచున్నవి... అచ్చట ఇసుకతిన్నెలలో, రాతిగుట్టలలో నా లేత మనస్సు ఏకాకిగనుండ నేర్చుకొనియెను.

అహో! దుర్భరము. నా మనస్సున కన్యమైనదియు, పంకనిమగ్నమును నగు వేరొకరి యాత్మచే రక్తస్పర్శయనెడి బంధనములతో బిగింపబడి ఊపిరాడక మూల్గుచున్నాను. ఇప్పుడు నా యున్నతాశయములన్నియు యవనికమరుగన నున్నట్లు అస్ఫుటము లగుచున్నవి. బలిమియు, ఉత్సాహమును దూరమాయెను. మనస్సును ఆత్మయు మాంద్యమును, చాంచల్యమును బొందెను. గృహపరిసరములలోనుండియు నాకు నేను క్రొత్తవాడనుగా గన్పించుచున్నాను. కలగని లేచునప్పటికి బంధితుడనై యుండినట్లాయెను. (మరల లోయలోనికి తొంగిచూచును.) అచ్చట నా సంరంభమంతయు నేమి! ఆ బాలగోపాలము ప్రవాహమువలె ప్రతియింటనుండి పరుగులిడుచున్నారు. ఆ యెగుడుదిగుడులలో నిప్పుడు వారి దీర్ఘపంక్తు లదృశ్యమగుచున్నవి. మరల అంతలోనే ఆ ప్రాత గుడికి పైతట్టు దూరముగ కాన్పించుచున్నవి.

(లేచి నిలుచుండును.) మందహృదయులు, సోమగులు, నగు ప్రాణులారా! మిమ్ము నేను బాగుగ నెరుగుదును. మీ మాతండ్రికి రెక్కలున్నటులు లేదు. మీ ప్రార్థనలలో పైనున్న దేవునియొద్దకు "దేవా, అనుదినము మా కాహారము నిమ్ము" అను నాల్గుమాటలు చెప్పినప్పుడు తక్క వేరు మెుర యెద్దియు సతీషస్వరముతో చేరగలుగుటది

భీష్ముడు

లేదు. ఆనాల్గుమాటలు మాత్రము మీ స్వత్వముగ జేసికొంటిరి. సరి; అది దేశమునకు సాంకేతికపదమైనది. దానిని మీరు సందర్భమునుండి క్రూరముగా చించి ప్రతిహృదయమునను ధరించియున్నారు. ఓడవలె భగ్నమైన మీమతములో నదియొక్కటి మాత్రము తీరమున పార వైచిన వస్తువువలె దిక్కుమాలి నిలిచియున్నది. అందువలన!...... యీరంధ్రము వాయుశూన్యము. బొగ్గుగనివలె, గోరీవలె నిది మూయ బడి యున్నది. ఇచట ఒకచిన్న జెండాను సహితము కదలింపజాలు నూత్నవాయువు వీచుటలేదు.

[పోవ నుద్యమించును; పైనుండి విసరివైవబడినరాయియొకటి యాతని ప్రక్కనే దొర్లుచు క్రిందపడును.]

భీష్ముడు

(చేయిపట్టి అరచి) ఎవరచట రాళ్లురువ్వునది?

[గిరిక; పదునైదు సంవత్సరముల బాలిక, తనఒడిలో రాళ్లుపోసుకొని కొండపై అంచుపొడుగున పరుగెత్తుచున్నది.]

గిరిక

వాడు అరుస్తున్నాడు. దెబ్బతగిలినది. [మరల రువ్వును.]

భీష్ముడు

బిడ్డా! ఆయాట చాలింపుము. ఇక చాలును.

గిరిక

ఆఁ; గాలికివిరిగిన ఒకకొమ్మమీద వ్రాలి కూర్చొని ఊగుతున్నాడు. దెబ్బ తగలనేలేదు. (మరల రువ్వి అరుస్తూ) ఇట్లు వస్తున్నాడు. నే

నెప్పుడూ యింతకోపాన్ని మూడలేదు. హా! రక్షించండి, నన్ను చీల్చి పారవేస్తున్నాడు

భీష్ముడు

దేవుడు నీకు తోడగుగాక!

గిరిక

ఇశ్ష్! ఎవరునీవు? నిలువు; కదలబోకు. ఇప్పు డాత డెగిరిపోతాడు.

భీష్ముడు

ఎవ డెగిరిపోవు ననెదవు?

గిరిక

నీవు డేగను మాచినావా? ఇప్పుడే.

భీష్ముడు

ఇక్కడ మాడలేదు.

గిరిక

దానికిజుట్టు తలమీదంతా పడిఉంటుంది. కళ్లచుట్టూ ఎఱ్ఱగా బంగా రుంగరముమాదిరి ఉంది. ఎగిరిపోతుంటుందే ఆపాడుపిట్ట.

భీష్ముడు

నీ వెచ్చటికి పోవుచున్నావు.

గిరిక

దేవాలయానికి.

భీష్ముడు

ఓ! అట్లయిన మనము కలిసికొనియే పోవచ్చు.

గిరిక

వల్లగాదు. నే నింకా పైకి పోవలసిఉంటుంది.

భీష్ముడు

(క్రిందివైపుచూపుచు.) అయితే దేవాలయము అచ్చటగదా ఉన్నది?

గిరిక

(అతనివైపుచూచి, తిరస్కారసూచకమగు మందహాసంతో క్రింది వైపు చూపుచు.) అదియా? అక్కడ ఉన్నదే అది.

భీష్ముడు

అవును. నాతో కూడ రమ్ము.

గిరిక

ఆఁ; హాఁ; అది చాలా......అసహ్యం.

భీష్ముడు

ఏల అసహ్యం?

గిరిక

చిన్నదైనందువల్ల.

భీష్ముడు

అయితే అంతకంటె పెద్దదాన్ని నీ వెక్కడ చూచితివి?

గిరిక

ఆ; నీకు చూపించగలను......మంచిది పోయిరా. (ఇంకను పైకి బోవుచున్నది.)

భీష్ముడు

ఏమి, బిడ్డా! ఆదారి యా దేవాలయమునకు పోవునని చెప్పునది? అది నిర్జనములైన పర్వతములకుకదా పోవును!

గిరిక

నాతోగూడ రమ్మి నీవు! దేవాలయమును మంచుతో కట్టి దాన్ని నీకు చూపిస్తా.

భీష్ముడు

ఆహా! యిప్పుడు నీభావము నాకు తెల్లమైనది. చిన్నప్పటికథల్లలో ఒకటి స్ఫురణకు వచ్చుచున్నది అక్కడ, ఆ పైన,ఆ కొండలలో మధ్య ఆ కనుమలో ఒక గుహాయున్నది దానినే మంచుదేవాలయమని అంటూఉండేది. దానినిగురించి ఎన్నోసంగతులు చెప్పుకుంటూ ఉండేవాళ్లు. క్రింద నేల...గడ్డకట్టినమంచు. పైన పందిరివలె వ్రేలాడు మంచు ఆ దక్షిణపుతోటము ఆవలవై పుండుచోటునంతా కప్పుమాదిరి కమ్మియుండేది.

గిరిక

మంచు, కొండ తప్ప మరే మచట కనబడదు కాని అది మాత్రం దేవాలయమే!

భీష్ముడు

అట్లుపోకుము! ఆ వ్రేలాడుమంచు హఠాత్తుగా గాలి కొట్టినా విరగబడుతుంది; చప్పట్లుతట్టినా, తుపాకిశబ్దమైనా, చాలు.

గిరిక

(అతడు చెప్పునది వినకయే) రా, మంచుకొండల్లో చిక్కుకొని వచ్చిన జింకలగుంపులను చూతువుగాని; ఈయేడు మంచు కరిగిపోయిందాక అవి అక్కడఉండే సంగతికూడ యెవ్వరికి తెలియదు.

భీష్ముడు

ఆచోట తప్పించుకొని తిరుగుము. అచ్చట అపాయమున్నది.

గిరిక

(క్రిందివైపు చూపుచు) వద్దు ఆ చోటికి పోవద్దు. అది చాలా అసహ్యంగా ఉన్నది.

భీష్ముడు

అయ్యో, పాపము! దేవుడు నిన్ననుగ్రహించును గాక!

గిరిక

ప్రాకుమంచునది పరుగువారు కొండ
యేరు, సంగీతముల బాడు నెపుడు మంచు
పర్వతమునుండి వాయు వుపన్యసించు
చలిమిరియు కోపమును నిన్ను కలతపరుప.

డేగవచ్చి తొంగిచూచును. కాని ఉండడానికి ధైర్యంచాలదు. ఆనల్ల కొండమీదుగా దిగి అది మా దేవళం గోపురంమీద వచ్చికూర్చుంటుంది. ఈజనానికి కాలము తెలుపు కోడిపుంజు.

భీష్ముడు

పాప మున్మత్తురాలు ఉన్మత్తపథము
తప్పగా వంచియున్న చట్టపుసితార
అనుపయోగంపు బ్రతుకు ఏదినముకైన
సెబ్బరయె మంచియగునట్లు చేయనగునె?

గిరిక

అదిగో బుఱ్ఱుమనివస్తున్నాడు. ఇప్పుడు........నే నీ యింటిలోపల దూరుకోవలెను. పోయివస్తా; పోయివస్తా. దేవాలయమున కేమిభయము లేదు.....భయముగుచున్నది. అబ్బా! ఎంతఅసహ్యాము. చూడు! అక్కడున్నాడు. (అరచును.) నన్ను తాకవద్దు నీవు. రువ్వుటకు రాళ్లున్నవి నాదగ్గర. గోళ్లకు బదులు రాళ్లు. జంకుతా ననుకోకు.
[కొండపైకి పరుగెత్తిపోవును.]

భీష్ముడు

(కొంచెమునే పైనతర్వాత.) ఈమెకూడ దేవాలయమున కనిగదా చెప్పిపోవుచున్నది......వీనిలో ఏమార్గము శ్రేష్ఠము—కొండపైకి బోవు నదియా, క్రిందికిజనునదియా? చిత్తవైకల్యముచే పతితులై గృహములకును, శాంతికిని దూరులై తెన్ను దెలియక సంచరించెడువారు చను మార్గమా? లేక పర్వతకందరములు ఘోరముగ నోరుదెరచియుండ, పైన నిర్భీతితో పూబంతులనెగురవేయుచు దిరుగు చంచలమనస్కులు పోవుదారియా? అలనాటుప్రకారము సరికానీ కాకపోనీ,మామూలుప్రకారము ప్రాకులాడు సోమరిమనుజులా? లేక అత్యున్నత ప్రదేశమం దుండుటచే భ్రమజెంది మంచి చెడ్డగను, తప్పుఒప్పుగను చూచెడు వైకల్యచిత్తులా? ఎవరు శ్రేష్ఠులు? లెమ్ము! యుద్ధసన్నద్ధుడవుగమ్ము! యీ పాపపుమూర్తిత్రయ సంయోగము నిప్పుడే రౌద్రముగ నెదుర్కొనియెదను. కవాటముగుండ నాసందేశమను సూర్యకిరణము దూరమునుండి ప్రవేశించి ప్రకాశించెడిని. ఈ యసురుల మువ్వుర పరిమార్చిన

**భీష్ముడు**

రౌఁడ దుఃఖనిమగ్నమగు నీప్రపంచమున కెంతయో మేలు గలుఁగగలదు. విశ్మశానవాటికపైనుండి పరతెంచు గాలి మారిమొదలగు అంటువ్యాధులు లేకుండఁజేసి మానవలోకము నుద్ధరింపగలదు. లేలెమ్ము! కత్తి దూసి స్వర్గవాస తుల్యాలమగు మనుష్యత్వపునస్సంపాదనమునకై రణభేరి మ్రోగింపుము!! [లోయలోనికి దిగును.]

మొదటి అంకము ముగిసినది.

---

# భీష్ముడు

---

## రెండవ అంకము

---

[వాగుప్రక్క నిట్రముగా కొండలే గోడలుగా గల ప్రదేశము. చేరువనే ఒక తిప్పమీద శిథిలమగుచున్న ప్రాత దేవాలయము గలదు. తుపాను రానున్నది. కర్షకులు—పురుషులు, స్త్రీలు బిడ్డలు—కొందరు ఆ యొడ్డున, కొందరు మిట్టప్రదేశమున గుంపులుగుంపులుగా కూడియున్నారు. వారినడుమ ఒకబండమీద కొత్వాలు కూర్చుండియున్నాడు. ఒక గుమాస్తా అతనికి సాయపడుచున్నాడు. ధాన్యము, ఇతరపదార్థములు పంచిపెట్టుచున్నారు. శరచ్చంద్రుడు, సుధ గుంపునడుమ కొంతదూరములో నిలుచుకొనియున్నారు. సముద్రతీరమున కొన్ని పడవలున్నవి. దేవాలయముందు తిప్పమీదుగా భీష్ముడు రంగమునకు వచ్చును. గుంపు అతనిరాకను గమనించదు.]

ఒకపురుషుడు

(గుంపులో నెట్టుకొనుచు) దారివ్వండి!

ఒక స్త్రీ

నీకంటె నేను ముందుగా వచ్చినా.

పురుషుడు

(ఆమెను ప్రక్కకు నెట్టివైచి) వెనక్కు; (కొత్వాలువద్దకు గుంపును త్రోసికొనివచ్చి) ఇటు చూడు. నాజోలెలో కొంచెము వెయ్యి.

కొత్వాలు

కొంచె ముండు.

పురుషుడు

నీపుణ్య ముంటుంది. కొంచెము చురుకుగా కాని; ఇంటివద్ద నలుగు రాకలితో మాడుచున్నారు—ఐదుగురు.

కొత్వాలు

(పరిహాసముగా) ఎందరైనదికూడ సరిగా చెప్పలేవు! ఏమి?

పురుషుడు

నేను వచ్చేటప్పుడు ఒకరు మృత్యువుతో పోరుతూ వుండిరి.

కొత్వాలు

(ప్రక్కన నిల్చుకో—నీపేరు లెక్కలోనున్నదా? (కాగితములు తిరుగ వేయుచు) లేదు.........ఆఁ; ఉన్నది! నీయదృష్టము. నీవు తప్పి పోలేదు. (గుమాస్తాతో) యిరవైలొమ్మిదవవానికి బత్తెమీ.—ఇప్పుడు —ఇప్పుడు, అయ్యలారా! కొంచెమోర్చుకోండి. వెంకటేసూ!

వెంకటేసు

అయ్యా!

కొత్వాలు

మును పిచ్చినదానికంటె నీకు కొంతతగ్గును. మీలో ఒకరు తగ్గిరిగదా యిప్పుడు.

వెంకటేసు

తమరు చెప్పినది వాస్తవం. స్వామీ! పోయినది...రాత్రి.

కొత్వాలు

(నమూదుచేసికొనుచు) ఒకరుతక్కువ. మిగుల్చుట ఎప్పటికినీ మంచిది. (వెనుకకు బోవుచున్న వేంకటేసునుజూచి) ఇప్పుడే రెండవపెండ్లాన్ని తెచ్చుకొనుటకు పరుగులిడబోకు.

గుమస్తా

[పండ్లికిలించును]

కొత్వాలు

(తీక్ష్ణముగా) ఎందుకు నీవు నవ్వడం? జాగ్రత్త!

గుమస్తా

తమరి...మాటకు... నాకు నవ్వువచ్చింది...తమరు చాలాతమాషాగా మాట్లాడినారు.

కొత్వాలు

ఊరుకో; అది విచారకరమగు విషయము; జాలిగలవారు ఏడువవలయు నని కాదుగాని సాయపడుట శ్రేష్ఠము.

శరచ్చంద్రుడు

(సంపులోనుండి సుధతోగూడ వెల్వడి) నాసంచి కాళీయైనది. జేబులుగూడ కాళీచేయవలసివచ్చింది. ఇక కదలి ఉత్తచేతులతో పడవెక్కి సంచారంచేయవలె. గడియారం, కర్ర కుదవపెట్టవలసివస్తుందేమో!

కొత్వాలు

మంచి అవసరసమయంలో మీరువచ్చినారు—మేము పోగుచేసినదంతా చాలాకొంచెము; సగముకడుపుకతిని ఉండేవాళ్లు, కష్టపడి లుగ చెడ్డవాళ్లు, తమకుండే కొంచెములో కొంత అసలే తిండిలేని వాళ్లకు పెట్టవలసివచ్చినందునసహాయముచేసేవాండ్లకుకరవై పోయింది. (భీష్ముడువచ్చుటనుజూచి, అతనితట్టుచేతులుచాపి) దయచేయండి!...

భీష్ముడు

ఇంకొకరు! మీరు విన్నారుగదా మాకష్టాలు. ఈయేడు ఒకటేవెల్లువలు, తరువాత అనావృష్టి...పండనేలేదు...మీ దగ్గర ఏమైనా డబ్బుంటే బయిటకితీయండి...ఏమిచ్చినా పుచ్చుకొంటాము. మాకు దొరకినమట్టుకు ఖర్చుపెట్టినాము. ఈ కరువుకాలంలో యీ ధైదు తృణాల్లో ఏమి మిగులుతుంది?

భీష్ముడు

భగవంతుని పేరున చేయనియెడల ఐదుకాదు పదివేలైనా ఒకటే.

కొత్వాలు

మాటలుగాదు చేసేడిగినది. ఆకట మాడే కడుపుకు యీమాటలు నోటికి రాతి నందించినట్లు.

శరచ్చంద్రుడు

ఇక్కడ బీదజనులు, పాపము! ఎంతకష్టపడుచున్నారో చెప్పగా వినలేదుకాబోలు. కరువు, కాలం సరిగాలేకుండడము, చీడలు, వీటితో చచ్చిపోవుచున్నారు.

భీష్ముడు

అది కనబడుచునే యున్నది. నల్లటికంఠమట్టూ ఉండు ఊదారంగు వల్ల న్యాయాధిపతి యెవరైనదీ ప్రతివాదూ కనుక్కోవచ్చు.

కొత్వాలు

అట్లుండియు పాషాణహృదయుడవై నిల్చున్నావు!

భీష్ముడు

(గుంపులోనికి ప్రవేశించి స్పష్టస్వరముతో) ఇచ్చట మీకు సోదరులై కష్టించక పొట్టపై ప్రాకు పురుగులవలె మెల్లగా జీవితావసరముల గడపర

ప్రకోనుస్థితి మారిపోయుండినచో, తెంటికొంటకై మీరిదు నెయిరఁటినన తోకు జాలికలిగియుండెడిది. తిర్యగ్జంతువులరీతి ప్రాకుచు— అట్లగుటను మను ష్యుని పశుప్రకృతి అగపడునది. ప్రతిదినము నిద్రమత్తేకాని భీవనీ మియు గాన్పించుటలేదు—శవముపెంట జనువారివలె అడుగు లిడుట; ఇట్టిస్థితిలో మీనామములు దేవుని హృదయఫలకమునుండి తుడిచివేయ బడియున్నవని నమ్మవచ్చును. మీయెడల మాత్రము భగవంతుడు దయ గలిగియే యున్నాడు. మీరక్తమున పిరికిమందు కలిపి మృత్యువనెడి కొరడాతో శిక్షించి ప్రయోజనరహితములగు మీ జీవితముల మరల గైకొనుచున్నాడు.

అనేకులు

(కొట్టబోవునట్లు పైబడి) చూడు మనల నెట్లు తృణీకరిస్తున్నాడో!

కొత్వాలు

మీకాహార మిచ్చినందులకు మమ్ము తిట్టుచున్నాడు.

భీష్ముడు

(తల నాడించుచు) నాహృదయరక్తపూరము మీకుత్తు నుపశమింప జేసి మిమ్ము స్వస్థులజేయజాలియున్నచో యీ నాళసమూహముర క్త శూన్యమై యెండిపోవువరకు ఆప్రవాహము అందులకయియే ప్రవహిం చగలదు. కాని యిచ్చట సహాయమొనర్చుట కడుపాపము. ఊర్ధ్వోన్ము ఖులు కండు. పంకనిమగ్నులగు మిమ్ము సర్వేశ్వరు డుద్ధరింపగలడు! సల గియున్నను, మీలో ప్రాణమున్న యెడల దుర్భరములగు కష్టములచే నెక్కువ జవమునే పొందగలరు. మందబుద్ధిగూడ అత్యున్నత ప్రదే శముజేరి స్వర్గమునుదృష్టిపథమున గాంచగలడు. బలహీనులు సహితము వేరుమార్గమును గానక తెగించి వెనుదిరిగి మరల నెదుర్కొనుటకు

భీష్ముడు

యీపోరాటమున జయమునే నిశ్చయముగా బడయగలరు. కాని అవసరమైనప్పుడు సహిలము ఘనత సంపాదింప నేరని గొఱ్ఱెలమందకుమాత్ర మధోగతియే.

ఒక స్త్రీ

ఇతనిమాట విని కుపితయైనదిపోలె వానగాలి వచ్చుచున్నది.

ఇంకొకడు

దేవుడు తృణీకారమును సైరింపడు. నేను ముందుగనే చెప్పుచున్నా.

భీష్ముడు

మీ భగవంతు డమానుషములగు అద్భుతముల నొనరింపజాలడు.

స్త్రీలు

చూడు! ఆకాశ మెట్లున్నదో.

కొందరు

(గుంపులోనుండి) కొట్టు! ఎముకలువిరగ్గొట్టు! వాడుగో! రాళ్లు కత్తులు పొడువు, పొడువు.

[కర్షకులు భయపెట్టునట్లుగా భీష్ముని చుట్టుకొందురు. కొత్వాలు వారిమధ్య నిలుచుండి నివారించును. ఒక స్త్రీ చెదరియున్న దుస్తులు గలది, అతివ్యాకులచిత్త తిప్పలమీదుగా పరుగెత్తుకొనివచ్చును.]

ఆ స్త్రీ

(గుంపు నుద్దేశించి.) రక్షించండి; అయ్యా! రక్షించండి.

కొత్వాలు

ఏమికావాల? ఏమైనఆపదా?...అవమానమా?—

స్త్రీ

నరకముకంటె ఘోరము.

కొత్వాలు

అది ఏమిటి చెప్పు?

స్త్రీ

నేను చెప్పజాలను. ఎట్లనయినా ఒకగురువును చూపవలెను.

కొత్వాలు

ఈగ్రామంలో యెవ్వరూ లేరు.

స్త్రీ

గతిలేదు. అతనికి సద్గతిలేదు. ఓ సర్వేశా; నీవెంత పాషాణహృదయుడవు.

భీష్ముడు

ఇంతకూ గురువు దగ్గరనే యున్నాడేమో!

స్త్రీ

(భీష్ముని చేయిపట్టుకొని) అయ్యా! ఆయనను రమ్మనండి—త్వరగా రమ్మనండి.

భీష్ముడు

నీయవసరమేమో తెలిపిన అతడు వచ్చును.

స్త్రీ

వాగు కవతలవైపు—నాభర్త—

భీష్ముడు

కానీ—చెప్పు.

స్త్రీ

ముగ్గురు బిడ్డలు. ఆకలి కల్లాడుతున్నారు—అన్న మైపోయింది. ఆయనకు నరకమేనాగతి! కాదనండి; కాదని చెప్పండి.

భీష్ముడు

మొదటిసంగ తేదో చెప్పు.

స్త్రీ

తిండిలేక పాలెండిపోయెను. సహాయముచేసే మనిషే కనబడకుండెను. దేవుడు దయదల్చకపోయె. అందరిలో చిన్నబిడ్డ ఆకలిబాధ కోర్వ లేకయే మృత్యువుతో బోరుచుండెను. ఆదృశ్యము అయన మనసును కలియబెట్టివేసెను. చూడజాలక బిడ్డను కొట్టిచంపెను.

భీష్ముడు

అతడు కొట్టిచంపెను—

గుంపు

(భయకంపితులై) అతని సొంతబిడ్డను?

స్త్రీ

అంతట మాటనిలచిపోయింది. తనక్రూరకర్మముయొక్క భయంకర స్వరూపము నాయల నెరిగి పశ్చాత్తాపతప్తుడై ఆత్మహత్యగావించుకొన నుద్యుక్తుడైయున్నాడు. రండి; ఝంఝామారుతమున జిక్కుకొని యున్న అతని ఆత్మను రక్షించండి. ఆయనకు జీవించుటకు శక్తిలేదు. చచ్చుటకు ధైర్యము చాలదు; ఆశవమునెత్తి ముద్దాడుచు, పొర్లుచు నర కాధిదేవతలనందరి నుద్దేశించి కేకలు వేస్తున్నాడు.

భీష్ముడు

(మెల్లగా) అవును! యిక్కడ సహాయ మవసరము.

శరప్పుద్రుడు

(తెల్లపోయి) ఇట్టివిగూడ ప్రపంచములో జరుగునా!

కొత్వాలు

వా డుండునది మా గ్రామపొలిమేరలో గాదు.

భీష్ముడు

(కర్షకులతో) పడవ!—నన్ను పడవలో ఎక్కించండి.

ఒక పురుషుడు

ఏమిా! యిా గాలివానలో! అంతధైర్యశాలి యెవడు లేడు.

కొత్వాలు

వాగుమట్టుకొని ఒకదారిఉన్నది.

ఆస్త్రీ

లేదు లేదు! ఆదారినపోవుటకు సాధ్యముకాదు. నేనట్లనేవచ్చింది. నేను దాటుతూఉండగనే వంతెనవిరిగిపడి ఏట్లోకొట్టుకొనిపోయింది!

భీష్ముడు

ఒకపడవవిప్పండి!

ఒకడు

సముద్రం పొంగెక్కి యిాకొండ అంచుదాక వచ్చిఉంటే...ఇప్పుడు కాదు.

ఇంకొకడు

అట్లుచూడు! ఆ పైనుంచి వచ్చేగాలిదెబ్బకు ఏరు చూడు ఎట్లా తెల్లగా నురుగుదబ్బలమయమై పోయిందో!

మూడవవాడు

ఎటువంటిసముద్రము! ఎంతఎత్తుఅలలు! నీళ్లు ఎంతదూరము వచ్చి పడు

 ర౯

చున్నవి. అర్చకుడుగూడ యీదినం దేవాలయంలో పూజజరుగదు అనిచెప్పిపంపినాడు.

భీష్ముడు

ఒక దురదృష్టవంతుడు చస్తూవుంటే ఆత్మను రక్షించే దిక్కు లేక మంచి గాలికి అలలకు యెవరు కనిపెట్టుకొని వుంటారు. (ఒకపడవలో ఎక్కి తెరచాప విప్పును.) యీపడవపైన యిచ్చుటకు తెగించెదరా?

సొంతగాడు

అట్లే; కాని నీవు నిలువు!

భీష్ముడు

మంచిది; యిప్పుడు ప్రాణాలకు తెగించేవారు యెవరు?

ఒకడు

నేను పోను.

ఇంకొకడు

ఈదినము నేనుకూడ పోను.

అనేకులు

ఎవరైనా పోయినారంటే వాడిపెండ్లాము ముండమోసేది నిజము

భీష్ముడు

మీ దేవుడు మిమ్ము యీయేరు దాటించలేడుగదా! నాదేవుడు యీ పడవమీద నాతోగూడనే యున్నాడు.

ఆస్త్రీ

(చేతులు పిసికికొనుచు) దిక్కులేకయే ఆయన చనిపోవును.

భీష్ముడు

(పడవలోనుండి అరచుచు)ఒక్కరు ధైర్యస్థుడు తెడ్డువేయుటకు తెర చాప మూచుకొనుటకు సహాయపడినచాలు. ఇప్పటివరకు ధారాళ ముగ నిచ్చుచుంటిరే వారిలో ఒక్కరురండి. ఓజనులారా! మరం దేవత కర్పించండి.

అనేకులు

(భయముతో వెనుకకు తగ్గి) అదిమాత్రము అడుగవద్దు.

ఒకడు

(అదలించినట్లుగా) గట్టుకు వచ్చివేయి. భగవంతునితో నిట్టి చెలగాటము పనికిరాదు.

అనేకులు

చూడు! తుపాను అధికమగుచున్నది.

ఇతరులు

మోకు తెగిపోయింది

భీష్ముడు

(అతికష్టంమీద పడవనుకట్టియుండిన కొక్కెని గట్టిగా పట్టుకొని ఆర్త యగుస్త్రీని జూచి) అయితే నీవైన రా — త్వరగా—నీవు...ఇ క్కడకు వచ్చిచెప్పితివే—ఆనీవు.

ఆస్త్రీ

(వెనుకకు జంకుచు) నేనా? మగవాళ్లే రాలేనప్పుడు—

భీష్ముడు

రా? వాళ్లంటారులే అక్కడనే.

భీష్ముడు

ఆస్త్రీ

నేను రాలేను.

భీష్ముడు

నీవు రాలేవు?

ఆస్త్రీ

కాదు...ఇంటివద్ద చిన్నబిడ్డలున్నారే వారిగతి.

భీష్ముడు

(తిరస్కారసూచకముగా నవ్వి) నీయిల్లు యిసుకపై కట్టబడియున్నది.

సుధ

(చెక్కిళ్లు ఒకవింతకాంతితో ప్రకాశించుచుండ. శరచ్చంద్రునివైపు తిరిగి అతనిని తట్టిచెప్పును.) అంతయు వింటివా?

శరచ్చంద్రుడు

విన్నా...అతను పట్టుదలతోనే యున్నాడు.

సుధ

సర్వేశ్వరుడు నిన్ను ఆశీర్వదించునుగాత! నీపని ఏమో ఎరుగువుదుగదా! (భీష్ముని బిగ్గరగాబిలుచుచు)ఇక్కడ ఒకరు ఆదరిద్రుని ఆత్మోపశమన మొనర్చుటకై నీకు సాయము రా నుద్యుక్తులై యున్నారు.

భీష్ముడు

అటులైన రమ్ము.

శరచ్చంద్రుడు

(తెల్లబోయి) నేను!

సుధ

నీవే; నేను నిన్ను సమర్పించితిని. స్వర్గమే నాకు శరణ్యము. ఈశ్వరుడే నాకు సహాయము.

శరచ్చంద్రుడు

నేను నిన్ను చూడకయే యుండియున్న నిశ్చయముగా ఈపడవ నడుపుటకు తెగించి యుండెడివాడను.

సుధ

(వణకుచు) అయితే యిప్పుడు?

శరచ్చంద్రుడు

తరుణవయస్సు; ప్రాణముపై కాంక్ష మిక్కుటము. నేను పోజాలను.

సుధ

(ఉలికిపడి అతనినుండి దూరముగా పోయి) పోజాలవు?

శరచ్చంద్రుడు

ధైర్యము లేదు

సుధ

(బొబ్బరించుచు)దుర్భర ఝంఝానిలాహతమై, సంక్షుభితమై ఘూర్ణిల్లు సాగరము మధ్య నేర్పడి మనలను వేరుచేసినది. (భీష్మునితో) నేను వచ్చుచున్నాను నీతో.

భీష్ముడు

అటులైన రమ్ము.

స్త్రీలు

(ఆమె పడవలో దూకుటగని భయకంపితాంగులై) అయ్యో! భగవంతుడామెను రక్షించుగాక!

శరచ్చంద్రుడు

(నిస్పృహుడయి ఆమెను గట్టిగా పట్టుకొని) సుధా!

గుంపు

(ముందుకు పరుగెత్తుకొని వచ్చి) నిలువు! తిరుగు వెనక్కు!

భీష్ముడు

ఆయి ల్లుండున దెక్కడ?

ఆ స్త్రీ

(చూపుచు) చక్కగా వాగు కనతలవైపు. ఆనల్లరాతివెనుక; ఆ అగ్రముమీద. [పడవ వడిగా బోవును]

శరచ్చంద్రుడు

(వారివెనుక అరచుచు) నీవు లేకున్న నీతల్లి ఏమగునో యోచింపుము. తిరిగి రమ్ము.

సుధ

ఈపడవమీద మేము ముగ్గుర మున్నాము.

[పడవ పోవుచున్నది. కర్షకులందరు ఆ చిన్న తిప్పలమీదచేరి ఒండొరులనెట్టుకొనుచు చాల ఆత్రముతో దానివైపు చూచుచుందురు.]

ఒకడు

మొన దాటినాడు.

మరియొకడు

లేదు.

మొదటివాడు

అవును చూడు! అదిగో మైదానాన్ని గూడ వెనకతొక్కేసినాడు.

ఇంకొకడు

కొండగాలి! దానిలో చిక్కుకొన్నారు.

కొత్వాలు

చూడు! అతనిశిరోవేష్టనము కొట్టుకొని పోతున్నది.

ఒకస్త్రీ

ఈహోరుగాలివానలో తడిసి తుమ్మెదరెక్కలవంటి నల్లనెండ్రుకలెట్లె గురుచున్నవి?

మొదటివాడు

ఏరంతా ఉడుకుచున్నట్లున్నది!

శరచ్చంద్రుడు

ఈతుంపానును జీల్చుకొని ఆర్తనాద మొకటి వినవచ్చుచున్నది.

ఒకస్త్రీ

అది ఆకొండతట్టునుంచి వస్తున్నది.

ఇంకొకడు

(పైనజూపుచు) అదిగో! అక్కడ గిరికనిల్చుకొని నవ్వుచున్నది. వారిని కూతవేస్తున్నది.

మొదటిస్త్రీ

ఒకకొమ్ము ఊదుచున్నది. రాళ్లు రువ్వుతున్నది.

రెండవస్త్రీ

కొమ్ము పారవేసింది. చూడు ఎట్లునిల్చున్నదో! చేతుల నిట్లు గుండ్రంగా పెట్టి ఊదుచున్నది.

ఒకడు

ఆ; అరువు నీ యిష్టమువచ్చినట్టు, గీపెట్టు, దేవుడేమో అతన్ని దయ తోనే రక్షిస్తాడు.

ఇంకొకడు

ఇంకొకసారి పనిబడితే, ఇంకాపోరు తుపానులోనైనా, ఈ యేటి మీద సంతోషంగా పోతా అతనుగాన కూడావుంటే.

మొదటివాడు

(శరచ్చంద్రునితో) ఆయన యెవరు?

శరచ్చంద్రుడు

పరివ్రాజకుడు.

రెండవవాడు

ఒకటిమాత్రం మనకే కనబడుచున్నది. ఆయన మగవాడు. తెలివి తేటలు, బలము, పట్టుదల, అన్నీ ఉన్నవి.

మొదటివాడు

ఇప్పటికి మనకు గురువు దొరకినాడు.

అనేకులు

అవును. ఇప్పటికి మనకు గురువు దొరికినాడు.

[కొండదిగి తలా ఒకదిక్కునకు బోవుదురు.]

కొత్వాలు

ఇది నిజంగా చాల అక్రమం. తగినకారణములు లేకయే ఇతరుల పనులలో ప్రవేశించి అదంత కలియపెట్టి కష్టాలు తెచ్చిపెట్టడం. నేనూ నాపని చేస్తూనేయున్నామ. కాని నాఅధికారంలో ఉండేచోటనే ఏమిచేసినా.

[ప్రస్థానము:]

[సముద్రములోనికి జొచ్చియుండు ప్రదేశము. గృహ పురోభాగము. కొంత ప్రొద్దెక్కియున్నది. ఏరు అలలేమియు లేక నిశ్శబ్దముగ ప్రవహించుచున్నది. సుఖ పడవలు నిల్చెడురేవులో నుపవిష్టులైయున్నది. భీష్ముడు ద్వారమునుండి వెలుపలకువచ్చును.]

భీష్ముడు

అదీ మృత్యువు. భీతిని కళంకమును సంపూర్ణముగ కడిగివైచినది. ఆ వేదనాభారధూర్వహణమునుండి విడిపింపబడినదై ఆతని ముఖము శాంతిప్రసన్నతలతో తేజరిల్లుచున్నది.........భ్రాంతి కింతటి వంచనాసామర్థ్యము గలదా!—కాళరాత్రిని పట్టపగలుగ మార్చగలదా? తానుజేసిన ఘోరకృత్యపరిభాగమునుమాత్రమే అతడు చూడ గలిగెను. దేనినిగూర్చి పలుకగలమో, దేనిని చేతితో తాకగలమో, దేనివలన అతని నామాక్షరములు కళంకితములయ్యెనో అట్టి స్వపుత్రవధను మాత్రమే అత డెరుంగును. కాని పాప మాయిద్దఱుబిడ్డలు భయకంపితులై పాశాబద్ధములై మూలదురిగిన పక్షిద్వయమువోలె నొదుగుకొని కూర్చుండి, కండ్లు తెఱచుకొని నివ్వెరపాటుతో నూరక చూచుచుండిరి. యేమి చూచుచుండినదియు యెఱుగరు పాపము!—వారిఆత్మలలోనికి నమలుచు దారిచేసికొని ప్రవేశించు ఆమచ్చను ఎంత కష్టపడినను కాలము తుడిచివేయజాలదుగదా! వారు ముదుసలులై కృశించి వంగిపోయినప్పటికి సహితము కళంకరహితులు కాజాలరుగదా—వీని నేరమును మరువజాలకయే వారిజీవితప్రవాహము లింకిపోగలవు. భీతావహమగునాటి నిశీథపుకృత్యమనెడు రుధిరవర్ణదీపకాంతిలోనే వారు పెరుగవలసియుండును. వీరు తమచింతయొక్క పాడు కళేబరమును దహనమొనర్పజాలరుగదా!—అయ్యో! భగవంతుని

భీష్ముడు

సాన్నిధ్యమున యిందులకు ఫల మనుభవింపవలసినది తన పుత్రులనువిష యముగూడ చూడజాలక పోయెనే! మీ రనుభవింప నవశిష్టమైనకలు షలేశము పారంపర్యముగా వారిసంతతికిగూడ సంక్రమించునేమో! ఇట్లుండనేల? —శూన్యమైన యీ అగాధము ప్రత్యుత్తరమొసగు చున్నది:...వినుడు...వారు తమతండ్రికి తనయులగుటచే!...కరు ణాసింధువు యీ లెక్కను కొట్టి వేయజాలడా? అధోగతిపాల్సేయ నీపత్క్రని ఎరుగనట్లు విడువలేడా? మనబంధువులు మన కిచ్చిపోయిన యీ అపారఋణమునకు మొదలెచట? ఆమహాన్యాయసభ సమ్ముఖ మున జేరినప్పుడు దానిని కొలతవేయువా రెవరు? ఒక్కరును నిరపరా ధులు లేనప్పుడు రుజువుపఱుచుటకుగాని, కాదనుటకుగాని ఎవరర్హులు? చాలచేతులనుండి మారినందున ధూళిధూసరితమైయున్న తనపత్రము జూప నెవడు సాహసించును? మాతండ్రి యీఋణమును చేసినది. అనుసాకువలన ఉపయోగముండునా? ధ్వాంతమురీతి నగాధమగు సమస్యా! రసాతలసదృశమైన నీలోతును మనసు వ్యర్థముగా పరిశో ధించునుగదా! ఇట్లుండియు జను లిదంతయు మరచి అపాయకరము లగు పర్వతతటాగ్రముల నాడుచున్నారు! —మోకాళ్లమీదబడి దేవుని ప్రార్థించవలసియుండగా—వేయిమందిలో నొక్కడైనను తమరిక్త జీవితమును మహోన్నతమగు నపరాధపర్వత మని ఎరుగడే!

[ఇంటి వెనుకతట్టునుండి కొందరు కర్షకులు పైకివచ్చి భీష్ముని సమీ పింతురు.]

ఒకడు

మనము మరల కలసికొంటిమి.

భీష్ముడు

మీరు సాయపడుస్థితి దాటిపోయినది.

ఒక

అతడు

అవును. అతనికి మంచిసాయము దొరికినది. అతనికి శుభమే. కాని ఇంట్లోమాత్రము ముగ్గురిని వదలి పెట్టిపోయినాడు.

భీష్ముడు

అందువల్ల!

అతడు

మాదగ్గరనుండిన తృణమో పణమో కలిపి కొంచెముచేసి——

భీష్ముడు

మీరు దొరకినదంతయు యిచ్చియు ప్రాణము సమర్పింపజాలనిచో నేమియు నివ్వనట్లే

అతడు

అక్కడ చనిపోయెనే, ఆతడేయిప్పుడు మరణవేదనకు జిక్కి కష్టపడు చుండి సహాయము నర్థించినయెడల నేను ప్రాణము నర్పించుటకుగూడ సిద్ధముగ నున్నాను.

భీష్ముడు

అది సరియేకాని ఆత్మకు గలిగియున్న అపాయమో——అది యెగతాళి అనుకొన్నారా యేమి?

అతడు

మేము సామాన్యపాటక ప్రజనులమను విషయముజ్ఞాపకముంచుకొనుము.

భీష్ముడు

అట్లయిన పర్వతముపైనుండి ప్రవేశించు ఆకాంతివైపు చూడవద్దు. మెడమీద కాడివైచికొని యధోముఖులై భూమిపై దిరుగుచు మెల్ల కంటితో స్వర్గముతట్టు చూడవద్దు.

భీష్ముడు

అతడు

ఇంకా లేచి కాడిపారవేయండి అని చెప్తారనుకొంటిని.

భీష్ముడు

అట్లే చేయండి చేయగలిగితే.

అతడు

ఆపని చేయించుట నీలో నున్నది.

భీష్ముడు

నాకట్టిశక్తి గలదా?

అతడు

ఇప్పటివరకు చాలామంది దారిఎక్కడకుపోవలసినదీ చెప్పియున్నారు. నీవుమాత్రం చూపినదారినే కడదాక నడిచితివి. చేసి చూపిన పని ఒక్కటి మనస్సుకు నాటినట్లు చెప్పెడిమాటలు వెయ్యి అయినను ఎక్కువు. మాకు కావలసినవాడవు నీవున్నావని యెరిగి యీగ్రామం తరపున నీకొరకై వచ్చితిమి.

భీష్ముడు

(కష్టముగా) నావలన మీకేమికావలయును?

అతడు

మాకు గురువుగా నుండుము.

భీష్ముడు

నేనా? యిక్కడనా?

అతడు

ఈగ్రామానికి గురువు లేడని చదివియుందురు...వినియైనాయుందురు.

భీష్ముడు

ఔను!...............

అతడు

ఇది యింకా పెద్దదిగా నుండినది; కష్టకాలంవచ్చింది; పైర్లునశించినవి; జనులు గుంపులుగుంపులుగా జబ్బు పడడంతో ఆకటికి అల్లాడిపోయి ఎవరైనా ఏమైనా పెడితే కాలక్షేపం చేసుకొనేది. మనస్సు మొద్దు బారిపోయింది; ఆహారపదార్థాలు చాలాప్రియమైనవి— గురువులు గూడా అరుదైపోయినారు.

భీష్ముడు

ఎంతైనా అడుగుముగాని దీనినిమాత్ర మడుగకుము. ఇంతకం టెను మహాత్కార్యములనే చేయవలసియున్నది. ఈవిశాలప్రపంచము నకు కర్ణపేయముగా పూర్ణరాగపరిచితములైన జీవితముల మేల్కొలుప యత్నింపనగునుగాని యిచట జిక్కుకొని ఎంతకొట్టుకొన్నను ఏమైన ఫలముండునా?

అతడు

నోరార పలికినమాటలకు గుహాలు ప్రత్యుత్తర మొసగుచుండ నీకొండలలో చాలసేపు వినబడుచుండును.

భీష్ముడు

పచ్చపచ్చికబయళు లాహ్వాన మొసగ
నెవడు చీకటి గుహాలలోనే వసించు
చవిటిపట్టుల ఔనేల నెవడు దున్ను
చేతి నిండుగ సత్తువచేలె యున్న?

భీష్ముడు.

కల్లునాటి పండింపగ కష్టపడునె
స్వాంతతరువులు ఫలము లొసంగుచుండ
స్వల్పవిషయాలకై చింతపడు నెవండు
విశ్వమయుడౌచు దా బ్రజ్వలించు నపుడు.

అతడు

(తలనాడించుచు.) నీవుచేసినపని బాగుగా అర్థమైనది. నీమాటలుమాత్రము అట్లు లేవు

భీష్ముడు

ఎక్కువ నన్నడుగకుము. నేను సముద్రతీరమునకు బోవలయును.

[క్రిందికిబోవ మొదలిడును.]

అతడు

(ఎదురుగావచ్చినిలిచి) దేనిని విడువజాలక యిట్లు కష్టపడుచున్నావో అట్టి నీవిధాయకకృత్యమగు ఈపవిత్రసమరము నీకు ప్రియమైనదేనా?

భీష్ముడు

నాప్రాణము! అది నాకు ప్రాణతుల్యము.

అతడు

అట్లైన నిజువు. (స్పష్టస్వరముతో) సర్వస్వము నర్పించియూ ప్రాణము సమర్పింపనియెడల నేమియు యివ్వనివాడవే! జ్ఞాపక ముంచుకొనుము.

భీష్ముడు

ఒక్కవస్తువునుమాత్ర మితరుల కొప్పగించజాలము. ఒక్కటియున్నది దానిని మాత్రము తనదగ్గరనే యుంచుకొనవలయును. అది తనఅంత

రాత్మ. ఏమైన సంభవింపనీ తనకర్తవ్యమునుమాత్రము బంధింపజాలదు—నిరోధింపజాలదు. అతీవ్రప్రవాహము మహార్ణవమును జేరవలసినదే.

అతడు

ఒకవేళ రొంపినేలలు దానిని అవరోధించి కప్పి కనబడకుండజేసినను కడకు మంచురూపమునసైనను సముద్రమును జేరగలదు.

భీష్ముడు

(అతనిని తదేకదృష్టితో జూచుచు) ఇట్టిభావ నీ కెవరు నేర్పిరి.

అతడు

నీవు—ఆమహాకార్యమును జేసితివే ఆసమయమున ఝంఝామారుతాహతమై సముద్రము ఘూర్ణిల్లుచుండ వాటినన్నిటిని లక్ష్యపెట్టకనైకల్యచిత్తుడవు నొకదురితాత్మునకు నీసాయ మావశ్యకమైయుండుట నీప్రాణమునకుగూడ తెగిలించి ఒకఓటిచెక్కమీద పోసాహసించితివి. అప్పుడేదోభావ మనేకులహృదయముల కలియబెట్టివైచినది. భావిఫల మాచకమగు పెద్దగంటవలె కొట్టసాగినది. (హీనస్వరముతో) రేపు యిదియంతయు మరచిపోవచ్చు. అప్పుడు నీవెత్తినఉన్నతాళయములపతాకము మరల వ్రాలి ధూళిదూసరితము కాగలదు.

భీష్ముడు

శక్తిలేనిచోట నేను చేయవలసినకార్య మేమియు లేదు. (కఠినమగు స్వరముతో) మీ రెట్లుండుట శ్రేష్ఠమో అట్లుండ నేరనిచో అచ్ఛముగ మీ రుండగలిగిన విధముగనైన నుండుడు. పంకనిమగ్నులై యిట్లే యుండుడు.

అతడు

(కొంచెముసే పతనిని అట్టేచూచి) మాజ్యోతి నార్పి నీ వేమి సుఖించెదవు? అంధులమైయున్న మాకు తళుక్కుమని క్షణకాలముమాత్రమే దృష్టినొసంగి దుఃఖపెట్టితివి.

[అతడు పోవును. ఇతరులునిశ్శబ్దముతో నతని ననుసరింతురు.]

భీష్ముడు

(కొంతసేపు వారు పోయినవైపు చూచుచు) ఒకరొకరుగా రొమ్ములపై తలలనాల్చి దీనవదనములతో తడబడుపాదములతో నెట్లో గృహోన్ముఖులై యరుగుచున్నారు. ప్రతిమనుజుడును తన యవసానదశనే తలపోయుచుండి కొరడా దెబ్బలకు భయపడుచున్నట్లున్నాడు. 'ఆదాము' గూడ ఆదివ్యోద్యానవనము అంచున యిట్లే తిరిగియుండనోపు. మాతి బిగించుకొని సిగ్గులేక తప్పులెన్నక అంధకారబంధురములగు లోకముల వెదకదలచుచున్నారు......కష్టపడి ఆర్జించిన జ్ఞానసంపద గలవారై, అజ్ఞానమును పోగొట్టుకొనుటచే పేదలైయున్నారు. నేను వీరిని బాగుపరచెదను—నేనుచేయగలనా?—నిష్కళంకులగు సత్పురుషులయ్యును ఎట్లుపోవుచున్నారో చూడుము! ఆయపరాధదేవతనుజూడు శిరములపై నెట్లు తాల్చియున్నారో? వీరినా నేను దైవతుల్యులుగ నొనర్పదలచినది? ఇచ్చటనుండుట పాడిగాదు. విశాలపర్వతక్షేత్రములకు తరలవలసినదే. ఇచ్చట కదలుటకు గూడ సందులేదు. (పోవుచు కూర్చుండియుండిన సుధను జూచి నిల్చుండి) ఏదియో వినుచు అచ్చటనే కూర్చుండియున్నది! శూన్యవాయువునుండి వచ్చుపాట యెద్దియో ఆమెకు వినవచ్చుచున్నట్లున్నది. అలలు పైకెగసి పడవ నతలకుతలము గావించినపుడు సైతము అట్లేవినదిపోలె కూర్చుండియుండెను. వినుచునే చుక్కానిచెక్కను గట్టిగా

కరచుకొనియుండెను. వినుచునే స్వచ్ఛమగు ఫాలతలముపైబడి ప్రకాశించుచుండిన శీకరచయమును దుడిచివైచెను.....కర్ణేంద్రియముల శక్తిగైకొని, యామె కండ్లతో వినుచుండినట్లు కనబడెను—(ఆమెను సమీపించి) బాలా! చెప్పుము; ఏటి కాయేటిదీర్ఘములగు మలకలపై ఊరక చూచెదవు?

సుధ

(అటనిట్టు తిరుగకయే)

నదియును భూమియు నంతంబు నొంది
అదృశ్యమైనటు లగుపించుపొగతో ;
చదలుకడ్డముగ విస్పష్టపంక్తులను
నవ్యమౌ జగమొండు నాకండ్లబడెడు;
నదులు సముద్రాలు నాకగుపడెడు;
మంచులో లేయెండ మలసాడుచుండు;
చలియించు నునుకాంతి సౌందర్యమహిమ
నీరదావృతములౌ నీలాలగిరులు;
తుదిమొద ల్గానుపించదు పెద్దబయలు;
కలవందు పొడవైన ఖర్జూరతరులు;
వెదకెడుగాలికి వెనుకకు నూగు;
నేలపై నల్లనినీడలు గనుము;
జీవులు నివసించు చిహ్నమే లేదు!
వ్యక్తమౌచున్న ప్రపంచమదేమొ;—

భీష్ముడు

ధ్వనివచ్చె నిశ్శబ్దమును జీల్చుకొనుచు
పెక్కుధ్వనులె అయిన నొక్కటే ధ్వనియె
"స్వర్గమో నరకమో వరియింపు మొకటి!
కర్తవ్య మొనరించి కర్మ గైకొనుము!
నీవ యేజగమును నిర్మింపగలవు!"

భీష్ముడు

(ఉత్సాహముతో) చెప్పు, ఇంకా ఏమి కనబడుచున్నదో!

శుక

(హృదయముపై చేతినుంచి)

రాజేడు శక్తులు రగిలెడు లోన
మదికి గన్పడు పొర్లి పారెడు నదులు;
దిక్కుల నుదయసందీప్తులు పర్వె;
హృదయమై శాల్యము పెరిగి నల్గడల
బలవీర్యయుతమూ ప్రపంచమై యొప్పి
మరల నాశబ్దంబు మారుమ్రోగెడిని
"నీవీజగంబునే నిర్మింపవలయు"
యోచింపదగియున్న యోచనలన్ని
గమనింపదగియున్న కార్యములన్ని
పలుకుము లెమ్ము నీమౌనంబు మాను

జననంబు నొందెడి సమయ మేతెంచె
కనజాల భావవీథిని గనజాల
నన్ను నావారల మన్నించుదివ్య
వ్యసనవిలీన కృపార్ద్రవీక్షణము
నామహాత్ముని రూప మగపడ దిపుడు
అరుణు తేఁజాయ ప్రసన్నత గలిగి
ఖేదసంతృప్తుడై క్షమియించియుండె
మఱియొకసారి యాధ్వని వినబడియె
"సృజియింపు మిప్పుడు సృజియింపబడుము
నరకమో స్వర్గమో వరియింపు మొకటి
కర్తవ్య మొనరించి కర్మ గైకొనుము."

భీష్ముడు

ఔను. లోపల! నేనునూ ఆమాటవింటిని; మార్గవచ్చట నున్నది. అదీ సరియైనదారి. నాహృదయమే భగవంతునికొరకు నూతనముగ సృజియింపబడి సిద్ధముగనున్న క్షేత్రము. అచ్చటనే అభినవపురుషుడు పురాతనమగు ఇచ్ఛాగృధ్రమును మడియింపగలడు. ఈప్రపంచమును అదిపోవుమార్గముననే బానిసరీతిపాడుచు ఇష్టమువచ్చినట్లు పోవనిమ్ము. నాకు విరోధియై నన్ను మార్కొనెనా! ఈప్రపంచము నాకార్యములకు నభ్యంతరముల కలిగింపజూచెనా! తరువాత నేమైనగానిమ్ము. నాముష్టిఘాతముల వర్షింపజేసెద. ఈవిశాలప్రపంచమున ఒక్కరు "తత్త్వమసి" అను సిద్ధాంతమునెరిగి వర్తించుటకు స్థలము దొరకదా! నే గోరున

దంతయు మానవుని ఒక్కహృక్కు మాత్రమే. (నిశ్శబ్దముగ నొక్క క్షణ మాలోచించి) "తత్త్వమసి"! పెద్దలవలన తనకు సంక్రమించిన ఋణభారము!

[నిలిచి మరియొకవైపు చూచును.]

ఆకొండ నెక్కలే కమితకష్టమున
వంగి ప్రాకుచు వచ్చు వ్యక్తి ఎవ్వరొకో!.........
సొక్కుచు నిముసము సోలుచు నిలుచు;
వదలిన మేనును వ్రాల్చు నొకింత
పీలచేతులవ్రేలు పీనుగవ్రేళ్లు
పెట్టుకయున్నది పెద్దసంచులలో
దానిలో నేమైన ద్రవ్యమున్నదియొ?
తనయాస్తి యంతయు దాన నున్నదియొ!
ఈకలు రాల్చిన గృధ్రంపుతోలు
వలెనున్న యామె పైవస్త్రంబుచూడు!
ఉరిసిపోయిన యొంటి నొరసి వ్రేలాడు
కరములు రెండును గాలాలరీతి
గోడకుగొట్టిన గూళిరూపంబె.

(తటాలున భయముతో) నాబాల్యపు నిలయమగు యీయేటినుండి యేమిది!......స్మృతియన, చలిగాలి యిట్లు కొట్టుచున్నది. ఈ శుష్కించిన స్త్రీ చుట్టును తుషారమును జల్లుచున్నది. నాయాత్మకు

భీష్ముడు

ఛతిని గలిగించునట్లున్నదే! చలి మిక్కుటమై ఊపిరిఆడకుండనే చేయుచున్నట్లున్నదే! దయామయా! ఈమె నాతల్లియే!

[భీష్ముని తల్లి అతని వెనుక వైపునుంచి రంగమునకు వచ్చుచున్నది; కొండ కొంతయెక్కి నిలబడును. పగముమాత్రము కాన్పించుచుండగనే చేతిని నొసట వెలుతురు కడ్డముగా బెట్టి చుట్టునూ బరిశీలించును.]

తల్లి

ఇక్కడ—ఇక్కడె వాళ్లు చెప్పింది వాడున్నాడని. (సమీపించి) పాపపు ఎండ! దీనితో కండ్లు పోతున్నవి. నాయనా, నీవా?

భీష్ముడు

ఔను.

తల్లి

(కండ్లు పులుముకొనుచూ) అబ్బా! ఈఎండ కళ్లనుగూడ కాల్చుక తినేటట్టున్నది, మనిషికి మనిషి భేదమే తెలియనీకుండా?

భీష్ముడు

ఇంటివద్ద ఆంధకారాలుదినాలు మొదలు కోవిలకూత వినబడువరకు సూర్యుని మాడనే లేదు.

తల్లి

(మెల్లగా నవ్వుచు) అవును; అక్కడ చాలా చల్లగా హాయిగా జలపాతములో మంచిమనిషి యున్నట్లుంటుంది; నీవు దిట్టంగా నున్నందువల్ల చేయవలెననుకొన్న పనులన్నీ చేయడానికి సాహసిస్తున్నా అపాయమేమిలేక సుఖంగా నున్నావు.

భీష్ముడు

నాకు వ్యాధి చాలకొంచెము. మంచిది; ఇక పో.

తల్లి

అవును. నీవు పుట్టినప్పటినుండి తొందరగాడివే. ఇంతేందుకు! పిల్లవాడి విగా నున్నప్పుడుకూడ తప్పించుకొనిపోయి అంతా తిరుగుచుండే వాడివి.

భీష్ముడు

నీవేకదా నన్ను యిల్లువదలి పెట్టునట్లు చేసినదానవు.

తల్లి

అది మంచిపని కాదంటావా? అందువల్ల నిన్ను పరివ్రాజకునిగా చేయు టైన సంభవించినది. (అతనిని బాగుగాచూచి తనలో) పొడుగుగా లావుగా బాగా పెరిగినాడు. (అతనితో) కాని చెప్పబొయ్యేమాట ఒక్కటైనా విను; ప్రాణమును జాగ్రత్తగా కాపాడుకో.

భీష్ముడు

అంతేకదా!

తల్లి

ప్రాణమా! అవును. బ్రతుకుటకంటే మనకేమి కావాలి?

భీష్ముడు

నీవొసగు హితమంతయు యిదియేనా?

తల్లి

ఇంకేమి కావాలి, ప్రాణముదప్ప! దానిని నేను నీకొసగితిని. రక్షించు కొనుమని యిప్పు డాజ్ఞాపించుచున్నాను. (కోపముతో) నీవుచేసిన ఘన

కార్యములగురించి జనులు చెప్పుకొనేకథలు వింటేనే నాకు దడపుట్టు మన్నది. ప్రాణము పోగొట్టుకొని యుండేవాడివే. ఏమైనా గాని దాన్ని కాపాడుకోవలెను. నాకోసరమైనా నంశానికి కడపటివాడవు. నీకే నారక్తమాంసములు; నేనునిర్మించిన వ్యూహ్యగృహమునకు అలం కారప్రాయమైన ప్రాకారం నీవు. ప్రాణాలు గట్టిగా బట్టుకో; వదల బోకు. లట్టాలు పెట్టుకోకు. పడిపోకుండా బ్రతికుంటే చాలు. పుత్రు డైనవాడు చేయవలసినపనిఅంతా యింతే; నావాడి వవుతావు కడ పట యేనాటికైనా!

భీష్ముడు

ఆమాట చెప్పటకైనా అంతంతిలావుసంచులతో నన్ను వెదుకుకొంటూ వచ్చినావు!

తల్లి

నాయనా! నీకేమైనా పిచ్చా? (వెనుకకు తగ్గుచు) నన్ను తాకేవు. నా చేత కర్రఉన్నది. జాగ్రత్త! (ఇంకా మెల్లగా) అట్లంటే యేమను కొన్నావు? చూడిక్కడ; ఏటికేటికి కాటికి సిద్ధమగుచున్నా; ఎంతుం డినా కొద్ది సంవత్సరాలే; తర్వాత నావద్ద ఉండేఎంతా నీకు వస్తుంది! అంతా అక్కడవున్నది. లెక్కగిక్కపెట్టి—రూపాయలుగా—ఆం, హాం! ఇప్పుడు నాదగ్గర ఒక్కదమ్మిడీయైనా లేదు; అంతా యింటిదగ్గర ఉన్నది. చాలా లేదుగాని, దానిని అనుభవించేవాడు కష్టపడకుండా జరుపుకోవచ్చు...నీవుండేచోటునే నిలువు! నాదగ్గరకు రాకు! ఒక్క తృణంగూడా నీకు కనబడకుండా గోడల్లోగాని, యెవరికి తెలియ కుండా భూమిలోగాని, కొయ్యలక్రిందగాని, రాళ్ళక్రిందగాని, ఇంక నెక్కడైనాగాని, దాచిపెట్టబోవని ప్రమాణంచేస్తా. అంతయూ నా

భీష్ముడు

కుమారుడే, నా వారసే అనుభవింపగలడు. మొత్తమంతా నీకే చెందును.

భీష్ముడు

కొన్ని నిబంధనలకు లోబడి?

తల్లి

ఒక్కటిమాత్రం నీప్రాణముతో నీవు వాడుకుండవలసినది; ఆమొత్తము నీచేతిమీదుగా నీకొడుకుకు; ఇట్లు వంశపారంపర్యంగా చెందునట్లుచేసి నచో నాకు పూర్తిగా తృప్తిగలుగును.........మరిన్నీ అందులో నుంచిమాత్రం యేమిన్నీ కర్చుపెట్టకుండా దానిని పంచకుండా యెవరి కైన ఇచ్చివేయకుండా మూచుకుంటేచాలు. వృద్ధిచేస్తే చేయలేక పోతే పోనీ. నీకు వచ్చేమొత్తం మాత్రం కూడబెట్టు; ఊరికే కూడబెట్టు.

భీష్ముడు

(కొంచెంనే పూరకుండి) ఒక్కవిషయమునుగూర్చిమాత్రం నిజం తేల వలె. బాల్యమునుండియు నేను నీకు వ్యతిరేకుడుగనే యుంటిని. నీవు ముసలిదానవై నేను యెదిగివచ్చువరకు నీవు నాకు తల్లిగను నేను కుమా రుడుగను ఉండలేదు.

తల్లి

నన్నేమి తట్టి బుజ్జగింపవనిలేదు; నాకేమి అట్లాంటి లోపాలు లేవులే; కానీ; కఠినంగానే ఉండు—మూర్ఖం వదలకుండానే యుం డు; నేనేమిఅనుకోను; మంచువలె నుండు—నారొమ్ము ఉక్కుడి; అయితే కూడబెట్టు! వృద్ధికాకపోయినా డబ్బుమాత్రం ఇంటినుంచి బయటకు పోనీకు!

భీష్ముడు

(ఒక అడుగు దగ్గరకు వచ్చి) అట్లుగాక డబ్బునంతా గాలికి వెదచల్లవలెనని నాకు బుద్ధిపుట్టినయెడల?

తల్లి

(తూలి వెనుకకుపడి) దీనిని సంపాదించుటకు నేను పడ్డకష్టముతోనే నావీపు వంగి వెంట్రుకలు తెల్లబడ్డవి. ఆడబ్బు వెదచల్లుటయా?

భీష్ముడు

(మెల్లగా తలయూచి) ఔను! వెదచల్లెదను.

తల్లి

అయ్యో! కొడకా! ఆపనే నీవు చేసినావంటే నాప్రాణమునే వెదచల్లినట్లు!

భీష్ముడు

అ దేమంతగొప్పవిషయమని అనుకోకపోతే? నీతలగడదగ్గర దీపము వెలుగుచుండ—నీవు భగవద్గీత చేతబెట్టుకొని మృత్యురాజ్యమున, తొలినాడు నిద్రించువారివలె నిద్రించుచుండ రాత్రివేళ నీపడక ప్రక్క నిలుచుకొని మూలమూలలుతడివి వస్తువులనన్నిటిని కలియబెట్టి గంట్లుగంట్లుగా నీవు దాచియుంచినదంతయు బయటదీసి దీపము వెలిగించి తగులబెట్టినయెడల?

తల్లి

(తత్తరపాటుతో వతని సమీపించి) ఇట్టి భావముల నెచట నేర్చుకొంటివి?

భీష్ముడు

ఆ. కనుక్కో!...... లేక నేను చెప్పవలయునా?

లిల్లి

అవును. చెప్పు కొంచెము!

భీష్ముడు

ఎన్నడో పూర్వము నా పసితనమున జరిగినవిషయ మొకటి మనసుకు చాలగాటముగా నాటి నన్ను మిగుల నొప్పించినది. నా ఆత్మపైగల ఆ పెద్దమచ్చ మాయనే లేదు—శరదృతువులో నొక నాటిసాయంకాలము; నాయన చనిపోయియుండెను నీవు జబ్బుతో పండుకొనియుంటివి. నేను మెల్లగా చప్పుడుచేయక ఆయన ఉండుచోటుకు పోతిని. దీపాలు వెలుగుచుండెను; ఒకమూల ఊరకచూచుచు నిలబడితిని. నాయనచేతులలో భగవద్గీతయుండెను. "ఎంతిగాఢముగ నిద్రించుచున్నాడు! చేతులెంత సన్నగా నున్నవి." అని ఆశ్చర్యపడితిని!...... చల్లగా కొత్తగుడ్డల గంజివాసన కొట్టింది కొంచెంగా...అప్పుడు ఎవరో మెల్లగా నిశ్శబ్దంగా నడుచుచున్న అడుగుల చప్పుడయ్యెను; ఒక స్త్రీ లోపల ప్రవేశించెను—నన్ను చూడలేదు—చక్కగా పడకవద్దకు పోయెను; త్వరత్వరగా నడవసాగను...... మొదట ఆశీవము తలను ప్రక్కకు జరిపి ఒకకట్టను పైకి దీసెను—మూడో నాలుగో—తీసి లెక్కబెట్టింది—"ఉండవలె ఇంకా వుండవలె!" అని గొణుక్కొన్నది. దిండు పెరికింది—వాటిక్రింద దేవులాడి, ఇంకొకకట్టను గట్టిగా కట్టి పైన ముడివేసినదానిని తీసెను; క్షణంలో చుట్టిఉన్న గుడ్డ చించినది. అత్రపు పండ్లతో ముల్లుకొరికింది; ఇంకా తవిడింది. మళ్లీ ఏమో చిక్కింది. లెక్కపెట్టి "ఇంకా ఉండవలె" అని గొణి

గించి.....ఏడ్చింది; మ్రొక్కింది; ప్రార్థించినది; ఏమేమో చేసింది. దాచిపెట్టియున్న గంటుసెట్లో పసిపట్టినది—కనుక్కొని డేగవలె తూటి ఆచోటు చేరింది. మధ్యమధ్య ఏడుస్తూ, నవ్వుతూ అక్కడ ఉండినదానినంతా తీసికొన్నది: కడపట కలుసులు, బొత్తాలు అన్నీ గాలించి ఏడుపుముఖంతో పతితురాలివలె గదినుండి వెల్వడినది. చిక్కినదానినంతా కుప్పగా వేసి చూచుకొని హీనస్వరంతో "అయితే, అంతా యిదే!" అని మూల్గినది.

తల్లి

నే ననుకొనియుండిన దానికీ, నాకు దొరికినడబ్బు చాలా కొద్ది. అదిన్నీ ప్రియంకంటె ప్రియంగా కొన్నట్లయినది.

భీష్ముడు

అంతేకాదు. దానివలన నీ కింకా ఎక్కువ నష్టం గలిగినది. అది నా ప్రాణమును, నా ప్రేమను నీదగ్గఱనుండి దొంగిలించుకొని పోయినది.

తల్లి

అదియుండనీ; స్వర్ణమునకు మానవాత్మనమ్ముట; అది చాలాపాతికథ— నేను మొదట భార్యనైనప్పుడు, నేనునూ త్యాగమొనర్చితిని...... నాజీవితనౌక భగ్నమగుటకు నిష్టపడితిని. ఇప్పటికి అందరు మరచి పోయియుందురు; కాని ఎగురుటకు రెక్కలుకలిగి ప్రకాశించుచుండిన ఒకవస్తువును నేను త్యజించితిని; ముద్దులు మూటగట్టునట్లుండినది. అది వేక మేమో?......ఎట్లుండునో; యిప్పుడు నే నెరుగను. అప్పుడుమాత్రం ఎరిగియుంటిని......జనులు దానికి ప్రణయమని పేరుపెట్టిరి— అప్పుడు నేను పడినశ్రమ దేవునికే ఎరుక. ఇప్పటికిని ఆమాటలు చెవులలో ప్రతిధ్వనిస్తున్నవి. "ఆ పూరింటిపిల్లవానిని మరచి

పొమ్మని; ఆరెండవవానిని నైకొమ్మని" అని నాలెంద్రిడిచెప్పెను. "ఎండి పోవుచున్నాడు గాని తెలివిమాత్రం ఉన్నది; పట్టిందంతా బంగారగుచున్నది." అనిచెప్పిరి—నేను అతని నంగీకరించితిని. అతనితో గూడ అవమానమునకుగూడ అంగీకరించితిని; పట్టినది బంగారూ గాలేదు అప్పటినుండి సకలచాకిరీచేసి అష్టకష్టాలుపడితే యిప్పటికి రెండింతలకు దగ్గిరిలోకి వచ్చింది.

భీష్ముడు

చావబోవుచున్నావు. నీయాత్మను ద్రవ్యమునకై అమ్మివేయుట నీ కిప్పుడు జ్ఞాపకమునకు వచ్చుచున్నదా?

గ్లాని

అందుకోసమేగా జాగ్రత్తపడి నిన్ను పరివ్రాజకునిగా జేయడం— నేను వదలిపెట్టేదాన్ని సంపాదించుకొనుటకై నా అవసానకాలము వచ్చినప్పుడు తగుజాగ్రత్తతో నాకు కావలసినవన్నీ జరుపుతావనైనా; నావద్ద బంగారు, భూములు, నగా, నట్రా అంతా ఉన్నది నన్ను సుఖంగా అవతలికి పంపడానికి శక్తి నీవద్ద నున్నది

భీష్ముడు

నీకు తెలివితేటలుండియు ద్రవ్యమనెడి కొలపాత్రతో నన్ను కొలువనెంచి పొరబడితివి. ఇచ్చట నివసించుజనులలో అనేకులకు నీకుగల యట్టి పుత్రవాత్సల్యమే కలదు—అంతే; మీరేమైనా వదలిపెట్టిపోయిన దానినంతా కాపాడుట మీబిడ్డలు మీరుపెట్టిన నౌకర్లని తలచుచున్నారు. మరణానంతరజీవితదృశ్యము మెరపువలె క్షణకాలము మీస్మృతిపథమునకు వచ్చినప్పుడుమాత్రం మీచిత్తం కొంచెం బెదరును; మీద్రవ్యమును, మీకుటుంబమును ఒక్కమూటగానే కట్టి

యుంచియున్నను దీనిని బట్టుకొన్నంతమాత్రమున తడవుకొంచున్నైన కడ కెట్లో గమ్యస్థానసామీప్యమును జేరగలుగుదుమని నమ్మియు న్నారు. ఇట్లు జీవితమునకు మృత్యువునకును గలభేదమును హ్రాస్వము చేసి సంవత్సరములన్నియు గడిపి వానిమొత్తం అనంతమునకు సరి పోవున ట్లొనర్చెదరు.

తల్లి

నీతల్లి మనస్సులోనికి తొంగిచూడబోకు; డబ్బుమాత్రం నీకు వచ్చి నప్పుడు తీసికో.

భీష్ముడు

నీవు చేసిపోవుఋణములన్నీ కూడ?

తల్లి

ఋణాలు! ఏమిఋణాలు! నే నెవరికి బాకీ లేదు.

భీష్ముడు

ఉంటే!—ప్రతిపత్రం నే నొప్పుకోవలసియుండును. తల్లి చనిపోయిన తర్వాత ఆమెబాధ్యతలన్నియూ చెల్లించక ఒక్కటి మిగిల్చినా ఆ అవమానము కుమారునిదే కదా! నీవల్ల నాకు సంక్రమించునది రిక్తమగు గృహముమాత్రమేయైనను దానితోగూడ నీఋణపత్రములు నెత్తిపై బడగలవు.

తల్లి

ఏచట్టమున్నా అట్లా చెప్పదు.

భీష్ముడు

తెల్లకాగితంమీద నల్లక్షరములతో అట్ల లేనిమాట వాస్తవమే. కాని ప్రతిసత్పుత్రుని మానసఫలకముసమాత్రము స్ఫుటాక్షరములతో

భీష్ముడు

లిఖియింపబడియున్నది. దానినే నేను నిర్వహింపబోవునది—అంధురాలా! చూడదలంచినచో ఇంకను వ్యవధిగలదు. నీలోనిదివ్యప్రకృతిని బంధించి, సర్వేశ్వరుడు నీకొసగిన పావనాత్మను వమ్ముచేసితివి. భగవత్స్వరూపమగు నీరూపము పంకనిర్మగ్నము కావించి పూడ్చివైచితివి. నీయాత్మకు రెక్కలుండెను. గుంపులో జారి వానిని కత్తిరింపజేసికొంటివి. ఇది నీఋణము. భగవంతుడు తనచాయను మరల నడిగినయెడల ఎక్కడనుండి తెచ్చియివ్వగలవు?

తల్లి

(కంపముతో) ఎక్కడ తెచ్చియివ్వగలను?......

భీష్ముడు

నీనందనుడు నీయప్పులన్నియు తీర్చివేయగలడు. భయపడకుము. నీవు మలిన మొనర్పదలచిన దైవప్రతిమ నాసంకల్పమున పరిశుభ్రము కాగలదు. నీ విక శాంతితో మరణింపవచ్చు; నీఋణములు నావి; ఋణములలో నాతల్లి మునిగి నిద్రించునట్లు నేనొనర్పను.

తల్లి

నాపాపముగూడ?

భీష్ముడు

ఋణాలు మాత్రమే; భయపడు; వ్యతిరేకంగా మాట్లాడకు—నీయాత్మఋణములనుమాత్రమే నీకుమారుడు భరింపగలడు. దానిపాపము నీవే అనుభవించితీరవలయు. నీమనస్సు పంకనిర్మగ్నమై యుండియుండుటచే నీయందు వ్యర్థమైన మానవసేవాఋణమును మాత్రము ఒక్కచిల్లిగవ్వ మిగులకుండా నేను సేవచేసి తీర్చుకొనగలను.

కాని ఆత్మను చంపుకొనినందులకుమాత్రము పశ్చాత్తాపమో—మర ణామోతక్క వేరుశరణ్యమే లేదని భగవంతుని ఆదేశము.

తల్లి

(కలతచెందినమనస్సుతో) ఇంటకైనబోయి మంచుకొండలనీడలలో నైన కూర్చోవలెను. ఇక్కడనుండిన ఈఎండకు, ఉక్కకు విమ ఫుటూ పాలు కుప్పలుకుప్పలుగా లేస్తున్నవి. వాటి ఆవిరివల్లనేమో కండ్లు ముఖము తిరుగుచున్నవి

భీష్ముడు

అః! పో; నీడలు వెదకుకొనుము. నేను చేరువనే యుండెద. నీవు పర లోకమునకేగ సిద్ధమై నేను రానలసినసమయము వచ్చినప్పుడు చెప్పం పు; వస్తాను.

తల్లి

మృత్యువని, శత్రుని నన్ను భయపెట్టడానికా?

భీష్ముడు

కాదు; అందుల కవసరము తీరిపోయినతోడనే పుత్రప్రేమతో, పరి వ్రాజకుని అవ్యాజానురాగముతో నేను వచ్చి నీమంచము ప్రక్కన నిల్చి నీకు మృత్యువువలన గలుగు ఘోరవేదనల పోగొట్టి, ప్రార్థనలు సల్పిజ్వరపీడితములగు నీనాళముల గలుగుబాధల వెడలగొట్టెదను. వెడలగొట్టి నిన్ను శాంతింప జేసెదను.

తల్లి

మాట చెప్పిపంపగనే వచ్చెదవని ప్రమాణము చేసెదవా?

భీష్ముడు

నీవు పశ్చాత్తాపపడిన యుత్తరక్షణముననే వచ్చెదను (ఆమెను సమీపించి) కొన్నినిబంధనలనుమాత్ర మేర్పరచెదను. నిన్నీపంకమునకు బంధించుసర్పమును ధారాళహృదయముతో పారవైచి రిక్తహస్తములతో మరణము నంగీకరించవలసియుండు నని నాప్రార్థన.

తల్లి

(కళ్ళతో అటుఇటు తిప్పుచూ) మహానలజ్వాలలను తమతీక్ష్ణతను మరచి సౌమ్యతని చెప్పుము. హిమమునకు శైత్యమును, పాథోరాశి కార్ద్రతయు లేకుండజేయుము! నీధర తగ్గించు. దేవుడు తక్కువతో సమ్మతించునట్లుచేయుము.

భీష్ముడు

పుట్టుబిడ్డను నట్టేటిలో పారవైచి ఆఘనకార్యానికి ఆశీర్వదించుమని దేవుని ప్రార్థించు.

తల్లి

ఇంకే ప్రాయశ్చిత్తమైనా కోరు—అన్నం లేకుండాగాని, నీళ్లు లేకుండాగాని;—ఇదివిప్ప ఎంతపెద్దది! ఎంతకఠినము!

భీష్ముడు

దీనికి వెనుదీసినయెడల తక్కినవన్నియుగూడ మీన్యాయాధిపతిని దయార్ద్రహృదయునిగ జేయజాలవు.

తల్లి

నాబంగారు. బీదలకు దానముచేసినయెడల?—

భీష్ముడు

అంతా!

తల్లి

ఓ! చాలా యిస్తే చాలదా!

భీష్ముడు

సర్వమును త్యజింపనియెడల నంతయు నిష్ఫలమే.

తల్లి

(చేతులునలుపుకొనుచు.) నాజీవితము వ్యర్థమా! ఆత్మకు గతిలేదా! నాధనమును నాకొడు కిప్పుడే వెదచల్లడమా!......ఇంటికిపోయి నా సొత్తంతా గట్టిగా కట్టుకొని ముడుక్కుంటూ......నాకడుపు కాల్చా పుట్టితివే నాయనా! స్వర్ణమా! నీకొరకై నారొమ్ముర క్తం స్రవించెనే. ఇంటికిపోయి చనిపోయెడుబిడ్డ నొడిలో నుంచుకొన్నతల్లివలె నేడ్చెదను—దేహమునకుగల కామేచ్ఛయే జీవిని బంధించు వలయైన యెడల నాఆత్మ దేహము నేల ధరించవలసివచ్చెను!......నాకు భయమగుచున్నది. నాయనా, నాదగ్గరనే యుండుము! అవసానకాలమున నాకు చాలభయము కలుగునేమో! నాధనము పోవలసియేయున్నచో కట్టకడపటి నిమిషమువరకైనా అట్లు జరుగనీయను. [ప్రస్థానము.]

భీష్ముడు

(ఆమె పోయినదిక్కుచూచుచు) నీపుత్రుడు నీసమీపముననే నీసందేశముకొరకు వేచియుండగలడు. చల్లబడిన నీముసలిచేతిని చూచుచుండగనే ఒక్కపరుగున వచ్చి నిన్ను ఓదార్చగలడు.

[క్రిందికి సుధ వద్దకు పోవును.]

భీష్ముడు

సాయంకాలము ప్రాతఃకాలమువలె లేదు. అప్పుడు నా హృదయము సమరాయత్తమై యుండెను. దవ్వులనుండి యేతెంచు యుద్ధనాదముల నాలకించెను. రోమకరవాలమును ధరించి, ఘోరావ్యాయామముల హాత మొనర్చి, భయంకరముగా ధిక్కరించి ప్రపంచము నన్నివైపులబోదువ బ్రజ్వరించెను

సుధ

(వెనుకకు తిరిగి ప్రసన్నతతో అతనిని జూచుచు) ఈ సాయంసమయ మువలెగాక నేటియుదయము చాలకళావిహీనమైయుండెను. అప్పుడు ఆడుచు యెగురుచు ఇతరుల వంచించుట నాకు సంతోషదాయకముగ నుండెను. దేనిని సంపాదించుట వ్యర్థమేకాక నీచముగూడ నగునో అట్టి దాని నార్జించుటకు చాలప్రయత్నించితిని.

భీష్ముడు

సౌందర్యస్వప్నాలు శౌర్యస్వప్నాలు
వన్యహంసంబులు వడి నేగుదెంచె
పరచిన రెక్కల పైకెత్తె నన్ను
చరియించినాడ విశాలక్షేత్రముల
జలము లెచ్చో చాల శబ్దంబుచేయు
నచట జేరితి భూమినంతయు దిరిగి
వైరులందర ద్రోచి పారనైచితిని
ఉత్సవసంభ్రమ ముత్సిక్తమయ్యె
ధూపవాసన నాల్గువైపుల బర్వె

సిల్కు జెండాలు దేశీయకీర్తనలు
ప్రజలు గుంపుగఁబాడు భజనకీర్తనలు
కర్తవ్యకార్యంబు క్రమ్మె నల్దెసల
అన్నియు కరసంజ్ఞ నాహ్వాన మొసగె!
విద్యుల్లతా కాంతి వీక్షింపజాలు
క్షణములోననె తళుక్కున నవ్యకాంత్య
లంకృతంబై మాయు నడవివిధాన
సర్వము శూన్యదుస్స్వప్నమే యయ్యె.

మరి యిప్పుడు నేను నిల్చియుండునది,

దివసావసాన మేతెంచుట కెంతొ పూ
ర్వమె యంధకారంబు బడెడుచోటు
అఖిలజగంబున కవ్వల పర్వత
పంక్తులచే వెన్కబడినస్థలము
రవికాంతి శిరముపై లవమైనబడని యీ
కాల్వకుచెంత వాగర్త భూమి

అయినను యీస్థలము నాయింటివలెనే యున్నది.

శృతిగామి నావిపంచిక పల్కజాలదు
జవనహయంబుపై రవుతు లేదు
శౌర్యనై పుణ్యముల జూప నలుపు రణము

**భీష్ముడు**

కంటె ఘనతరగమ్యంబు గానుపించు
అతి నికృష్ట సేవాజీవనంబె యిప్పుడు
బోధనీయము శ్రేష్ఠము పూజ్యతమము.

సుధ

పతితుడు కావలసిన యీ దేవుడు!.........

భీష్ముడు

ఎన్ని యభ్యంతరములు కలిగినను అతడు పడియే తీరవలయును. కాని చీకటిలో నే, రహస్యముగనే ప్రపంచమంతయు చూడ గల్గుచోటగాదు. మనవారికి శ్రేయస్కరమగు మార్గమును గూర్చి నేను పొరపడితి నని ఒప్పుకొనక తప్పదు. కాహళము లూది, ధ్వజము లెత్తినంతమాత్రమున నే లోకము నుద్ధరింపజాలము; మార్చజాలము; ఓదార్చజాలము ఒకవేళ ప్రజ్ఞాశక్తుల మేల్కొల్పనగునేమో—ఆత్మ మాత్రము భగ్నముగనే నిల్చియుండగలదు......కాదు. ఇందులకు ముఖ్యమైనది చిత్తమే. స్వాతంత్ర్యము గల్గినను, పాతిత్యము సంభవించినను దానివలననే చుట్టునున్న సర్వమును ధ్వంసమైనప్పుడును సూర్యకాంతిలోనైనను యీదరగాలిలోనైనను దృఢముగ నిలువగలుగునది అది యొక్కటియే. [గ్రామమువైపు తిరుగును. ఆ గ్రామవృక్షాగ్రములపై సాంధ్యరాగములు పడబోవుచున్నవి.]

నాయీ సన్నలోయయింటియందు చరించు మందమతులారా! ఇపుడు రండి. మనము ముఖాముఖిని మాట్లాడుకొని మనపని బలాబలములు చూచుకొందము. అబద్ధముల, నగంఅబద్ధములను నాశముచేసి ఇచ్చ అనుహార్యతకు కోరమును మేల్కొల్పెదము.

భీష్ముడు

అవును,

సకలపృథ్విదళించు హాలికుని చేయి
వీరకరవాలము ఝళిపించు కరము
ధార్ష్ట్యమొక్కటె; రెంటియాదర్శ మొకటె:
ప్రభువు లిఖియింపదగు శుభ్రఫలక మగుటె.

[పోవ వెనుకకు దిరుగును. శరచ్చంద్రుడు కలుసుకొనును.]

శరచ్చంద్రుడు

నిలువు! నీవు గైకొనినదానిని మరల నాకిమ్ము!

భీష్ముడు

ఆ బాలిక అచ్చటనే కూర్చునియున్నది చూడు!

శరచ్చంద్రుడు

(సుధతో) పచ్చికబయళులకు వచ్చెదవా? ఈ నరకకూపముననే యుండెదవా?

సుధ

నేను కోరుకొనవలసిన అవసరము తప్పినది.

శరచ్చంద్రుడు

సుధా! సుధా! నే జెప్పునది వినుము; "ఎత్తుట కెంత తేలికయో భరించుట కంత బరువు." అను పెద్దలమాటయైన బాటింపుము; జాగ్రత్తపడుము.

సుధ

నేను క్రుంగిపోవువరకును పట్టుకొనెదను. సౌమ్యుడా! నాకు బోధింపనెంచక పొమ్ము; నీకు శుభమగుగాక!

భీష్ముడు

శరచ్చంద్రుడు

నీకు కావలసినవారి నందరినిగూర్చి యోచింపుకొనుము.

సుధ

మాతల్లికి భక్తితో నమస్కరించితి ననుము. మాటలు చిక్కగనే ఉత్తరము వ్రాసెదను.

శరచ్చంద్రుడు

అలలపయి కెరలు శశికళల కలధౌతమయ
జలధిసలిలముల ద్రుల్లోలయ విహరింపగ
వలపుగొని తరలుసితకలములవె; విరహులబొ
మలపయి నెపుడు పగటికలలె చరియించుగ
పలువగలరతనములు చిలికినటు సుభగమగు
తలలఘనతరణు లవె నిలయుముల జేరగ
అలయకయె పరుగులిడు చెలియ కడుదడవు సిరి
వెలయు నికటముల నుత్కలిక దరిసింపగ.

సుధ

పడమటికిపో, తూర్పుకుపో,—నేను చనిపోతి ననుకొనుము; అదియే శ్రేష్ఠము.

శరచ్చంద్రుడు

చెల్లెలుగా నాతో రమ్ము.

సుధ

సుధ

(తలవాడించుచు.) మనయిద్దరినడుమ ఒకసముద్రము ఘూర్ణిల్లుచున్నది.

శరచ్చంద్రుడు

ఓ! అట్లైన ఇంటికి నీతల్లియొద్దకైన బొమ్ము.

సుధ

(మెల్లగా) గురువును, స్నేహితుని, అనుజుని వదలి!......కాదు.

భీష్ముడు

(ఒకఅడుగు ముందుకువచ్చి.) బాలా! జాగ్రత! బాగుగ యోచించుకొనుము. కొండలనడుమ చిక్కుకొని, అంధకారబంధురమై శిలాకంటకపరిస్తృతమై, పర్వతతటముల సాంధ్యరాగములలోనే నాజీవితప్రవాహము ఇకముందు శరత్కాలావసానమువలె నంతరింపగలదు.

సుధ

అంధకారము నన్నిక భయపెట్టజాలదు. నక్షత్రములు మిక్కుటమగు కాంతితో తళతళమని మెరయుచున్నవి.

భీష్ముడు

వాంఛలలోనే నతికఠినుడను. నాకు వలయునది సర్వమో, సర్వశూన్యమో; ఆమార్గమున నొకసారి జారిపడితివా నీ జీవితము ఏటిపాలు కాగలదు; భయపడినయెడ దాగుకొనుట కందు తావు చిక్కదు; భగ్నజీవులపై కరుణించువా రందుండరు; మార్గాంతమువరకు చనుట కాయువు చాలనియెడల మనఃపూర్వకముగ మరణమును స్వీకరింప వలసియుండును!

శరచ్చంద్రుడు

ఈమాయావాగురనుండి తప్పించుకొని పారిపొమ్ము ఈ కఠినాత్ముని, యీవిపరీతపు మానిసిని వదలుము. నీ కనువగువిధముననే జీవింప బొమ్ము—

భీష్ముడు

దారులు చీలుచోట నున్నావు. ఎటుపోవునది నిశ్చయించుకొనుము—

[ప్రస్థానము.]

శరచ్చంద్రుడు

శాంతిసమరములలో దేని వరించెదవు? సుఖదుఃఖములలో దేని గైకొందువు? జ్యోతి స్తమస్సులలో దేని ప్రవేశించెదవు? అమృతమృత్యువులలో దేని నపేక్షించెదవు?

సుధ

(లేచి మెల్లగా) తమస్సులోనికే! మృత్యుమార్గముననే!......చాల దూరమునుండి అరుణోదయకాంతులు ప్రసరించుచున్నవి.

[భీష్ముడు పోయిన దిక్కు ననుసరించి పోవును. శరచ్చంద్రుడు నిర్విణ్ణుడై యామె పోయినదిక్కు క్షణముసేపు చూచును. తలను గౌగ వసూచకముగా వంచును. నదీముఖుడై నిష్క్రమించును.]

రెండవ అంకము ముగిసినది.

---

# భీష్మ దు

## మూడవ అంకము

[మూడు సంవత్సరములు గడచినవి. ఇంటివద్ద చిన్నతోట; దానివెనుక ఉన్నతమైన పర్వతశిఖరము; తోటచుట్టును ఒకచిన్నరాతిగోడ; వెనుక చాలదూరమున యేరు చాలచిన్నదిగ గాన్పించును. తోటవైపునుండు ద్వారమువరకు తోటలోనుండి మెట్లున్నవి. మధ్యాహ్నం దాటినది. భీష్ముడు మెట్లపై నిలుచుండియున్నాడు. ఒకమెట్టుక్రిందుగా సుధ ఉపవిష్టయై యున్నది.]

సుధ

ప్రాణనాథా! మరల యేటివైపు దృష్టు లూరక సారించెదరేల?......

భీష్ముడు

ఒకసందేశమునకై యెదురుచూచుచున్నాను.

సుధ

మీకు భయము.

భీష్ముడు

మాతల్లిమాటకొరకు నేను వేచియుండుట యిప్పటికి మూడు దీర్ఘసంవత్సరము లాయెను. ఇంతవఱకు రాలేదు. ఆమె అవసానకాలము చాల సమీపించియుండునని యీదినము నాకేదియో చెప్పుచున్నది.

భీష్ముడు

సుధ

(మెల్లగా (క్షేమపూర్వకముగా) భీష్మా! మాటరాకున్నను మీరు పోవలయు.

భీష్ముడు

ఆమె పశ్చాత్తప్తురాలై భగవంతుని శరణుచొచ్చినచేతప్ప నేనామెకు సాయపడజాలను. బధిరుడను.

సుధ

ఆమె మీతల్లిగదా!

భీష్ముడు

నాభగవంతుడు గాదు. తనసొంతహస్తువులతో జేయబడిన విగ్రహములకు మ్రొక్కుశిరముల నతడు దండింపగలడు.

సుధ

భీష్మా! మీరు చాలాకఠినులు.

భీష్ముడు

నీకు?

సుధ

లేదు.

భీష్ముడు

నేను ముందుగనే చెప్పలేదా; ఇది చాలాగడుసుదారి యని.

సుధ

(మందస్మితముతో) మీమాటే అబద్ధమైపోయింది; ఇది అట్లులేదే!

భీష్ముడు

ఇక్కడ చలి విస్తారం; చలివలన నీముఖము కళావిహీనమై వెల్లపారింది. నీకోమలహృదయము ఈచలికి సహింపజాలదు. గుండ్లు రాళ్లుకొర్లుచూ

భీష్ముడు

మంచుకొండలు పడుచుండుయీప్రదేశము నీకు నివాసయోగ్యము కాదు.

సుధ

ఇంత లోపల తట్టుండుటవలన అపాయం మనకు తక్కువ; ఆకొండ అంతముందుకు వచ్చియుండుటవల్ల చెట్లు చిగిరించుకాలం వచ్చినప్పటికి మంచుపదులు ఆ రాళ్లమీద పారి దూరంగా పోయి క్రిందపడుచుండును. అందువల్లఆకాశగంగ వెనుకతట్టునున్న దానివలె మనయిల్లు ఎప్పుడూ భద్రంగా ఉండును.

భీష్ముడు

సూర్యకాంతి ఇచ్చటికి చేరనే చేరదు.

సుధ

కాని, ఆఎత్తున పర్వతభుజముపై నెంతయుల్లాసముగ నృత్యము చేయుచున్నది !

భీష్ముడు

ఎండకాలమున......అవును...మూడువారములుమాత్రమే. మొదటికి మాత్రం ఎప్పుడూ దగ్గరకుగూడ రాదు

సుధ

(వానిని తదేకదృష్టితో జూచి లేచి) భీష్మా! మీమాటల్లో కొంచెము భయము స్ఫురించుచున్నది!

భీష్ముడు

నీమాటలలో!

సుధ

కాదు. మీమాటలు!

భీష్ముడు

నీవు చెప్పవుగాని; నీవు భయము పోషించుచున్నావు.

సుధ

భీష్మా! మీరు కూడా.

భీష్ముడు

చాలయున్నతప్రదేశమున నిల్చుటచే కండ్లు తిరిగి పడబోవుచున్నావు—చెప్పుము! అంతయు చెప్పుము!

సుధ

కొన్ని వేళలలో నే ననుకొంటాను......నాకు వణకుపుట్టుచున్నది—
[నిలుపును]

భీష్ముడు

ఆః; హాః! ఎవరికొరకు?

సుధ

పిల్లవాడు.

భీష్ముడు

నరేంద్రునికొరకా?

సుధ

మీరుగూడ.

భీష్ముడు

ఎప్పుడైన ఒకసారి......ఆః! వలదు. మన దేవుడు మనుజులయెడ దయగలవాడు; మన ఆనందమును అతడు కొనిపోడు—నాచిన్నిబిడ్డ దినదినప్రవర్ధమానుడై అందరికంటెను బలిష్ఠుడు కాగలడు—ఇప్పు డెక్కడున్నాడు?

సుధ

నిద్రించుచున్నాడు.

భీష్ముడు

(తలుపువగ్గరకు పోయి లోపల తొంగిచూచి) కలలో నేమియు వాని బాధించునవి యున్నట్లగపడదు; చిన్నచేయి లావుగా గుండ్రముగా ఉన్నది

సుధ

కాని పాలిపోయియున్నది.

భీష్ముడు

అవును. పాలిపోయియున్నది.........అది పోతుందిలే.

సుధ

ఎంతబాగా, యెంతహాయిగా నిదురించుచున్నాడు!

భీష్ముడు

దేవుడు నిన్ను దీవించుగాత! నిద్రించి పూర్ణారోగ్యముతో లెమ్ము. (తలుపు మూయును) మీ యిరువురివలన నా కొకభాగ్యము కలిగినది. శాంతియు తేజము నాజీవితమును ధన్యముగ నొనర్చినవి. దుర్భరము లగు వ్యసనములు చేయనలవిగాని కార్యములు మీయిద్దరిసాయము వలన చాల తేలిక యయ్యెను. నీతోనున్నపుడు నాధైర్యసాహసములు తగ్గజాలవు. నరేంద్రుని పిల్లయాటలవలన నాయుత్సాహము మిక్కిలి యగుచున్నది. మొదట నే నీపని తలదాల్చినపుడు నన్నే బలియిచ్చు కొనవలసియుండునని యెంచితినిగాని అంతయు ఎట్లు మారిపోయెను! నామార్గముచుట్టును విజయమే ప్రకాశించుచున్నది.

సుధ

ఔను. కాని మీరు జయము నార్జించితిరి. యెట్లుకష్టపడి యెట్లు

భీష్ముడు

యుష్టను వేసితిరి! సమరమువలని యొత్తిడికిగూడ ఓర్చుకొంటిరి. లో లోపలనే గర్తాశ్రువులు పొరలిపారుచుండుటగూడ నాకు తెలియును.

భీష్ముడు

నీవు నీ ప్రేమామృతము వర్షింపజేయుచుండ నంతయు సులభమే. తుషార తుల్యమగు నా యాత్మయుట్టును వసంతవేళలందలి సూర్యకాంతిని బరపి తివి? నే నెన్నడును ప్రేమయనుదాని నెరిగియుండకపోతిని: తండ్రి వలనగాని తల్లివలనగాని అది యుదయించదాయెను. ఎప్పుడైన ఒకవే శబూదిలోనుండి, అయగ్నికణ మొకటి పైకెగిరిన దానిని చల్లార్ప జూచుటయే వారిపనిగా నుండెను. నా హృదయాంతరాళమున దాగి యుండిన సౌమ్యసౌహార్దగుణములమొత్తము, అర్ధాంగీ! నీయుట్టును మన బిడ్డలయుట్టును నొకపరిపేషముగ వినియోగపడుటకై రక్షింపబడెనో అన్నట్లున్నది.

సుధ

మాకుమాత్రమే కాదు. మనగృహచక్రములోనికి వచ్చువారందరికిగూడ —దుఃఖభారమువలన పుత్రులుగ మారినవారును, అవసరమువలన అను జులుగనైనవారును, ఏడ్చెడుప్రతిబిడ్డయు, కష్టపడుచుండుప్రతిత ల్లియు మీహృదయకల్పకమునీడ విశ్రమించి సేదదీర్చుకొనకుండ వెడ లిపోవ నగత్యమే లేదు.

భీష్ముడు

మీయిద్దరివలననేకదా! మీరు సౌహార్దస్వర్గవారిధి వైచితిరి. మీరిద్దరు ......తాను మొదటఒక్కరినైనను ప్రేమించకముందు ఎవడైనను పర్వమానవులను తనకౌగిటిలో నిముడ్చుకొనజాలునా? ఊరక అపించి

౧౦౮

ఎంతఆత్రపడినను నాహృదయము రాతివలె కఠినమై పోయియుండవల సినదేకాని ఏమైన లాభముండియుండునే?

సుధ

అట్లుండియు—మీ ప్రేమ కఠినతరమనియు ఎవ్వరిని లాలింతురో వారినే హతమొనర్తురనియు పలుకుచుందురు.

భీష్ముడు

సుధా! నిన్నా?

సుధ

నన్నా! ఆఁ; హా! లేదు; నావలన మీరు కోరినదంతయు బహుస్వల్పమే. అయినను, సర్వమో లేక సర్వప్రాజ్యమో నీసాంకేతికపథము నెదుటికి అనేకులు రాజాలకున్నారు.

భీష్ముడు

ఈమానకారిప్రపంచము దేనిని ప్రేమ యనునో దానిని నేనెరుగను. దానిగూర్చి మాట్లాడజాలను. పైనుండి మనల నేలుభగవంతుని ప్రేమ మాత్రము నాకు తెలియును. ఆయనప్రేమ బలహీనముగ నుండదు. సౌమ్యముగగూడ నుండదు. మరణపర్యంతము కఠోరమును, ఘోర చుంబనములచేతనే హతమొనర్చునదిగను నుండును. 'ఆలివు'వనములో అమితమగువేదనతో, తనస్వపుత్రుడు ఇకనైనను యీపాత్ర గైకొనుమని దీనముగ మొరయిడినపుడు భగవంతునిప్రేమ ఏమనియుత్తరమొసంగెను! అతనినుండి పాత్రమును గైకొనియెనా? బాలా! లేదు; అతనికుమారుడు దానినంతయు త్రాగియే తీరవలయును.

సు॥

అట్లు పరీక్షించినయెడల భూమిపైగల ప్రతిజీవియు, జననమొందిన నాడే సద్గతికి దూరమైనట్లే.

భీష్ముడు

మన మెరుగము......కాని, ఈశ్వరునిశాసనములు శాశ్వతములగు జ్వాలాక్షరములతో లిఖింపబడి చాటుచునే యున్నవి. అంత్యనిమిషమువఱకు పోరున కదలక నిలువుము; జీవితావధికై బేరము వలదు. శుష్కపరివేదనాస్వేదములు స్వర్గమును గూర్పజాలవు; మీమతములకై, నమ్మకములకై, అగ్నిచొరుకుటకు సంసిద్ధులై యుండవలయును. శక్తిచాలమి మన్నింపబడవచ్చునుగాని సంకల్పశూన్యత ఎన్నిటికిని క్షంతవ్యము గానేరదు.

సు॥

అవును. మీరు చెప్పినదియే నిజముగా నుండవలయును!—మీరు చనెడి యున్నతప్రదేశములకు నన్నెత్తుము! మీస్వర్గము మహోన్నతము. నామనస్సు దిటవుగనున్నను శక్తి వెనుకజిక్కుచున్నది; భయముచే నాతల తిరుగుచున్నది. నాయలసినపాదములు కదలనేరక యీడిగిలబడుచున్నవి.

భీష్ముడు

సుధా! అందరకును ఒక్కటే స్వరము వినవచ్చుచున్నది ......... నీచమగు సమాధానము వలదు. ప్రతివిషయమునను సగముసగముగ కష్టించి పూర్ణతకు ఎవడు భంగము కలిగించునో అతడు తానొనర్చు సమస్తకార్యములందును పతితుడే. మనయుపదేశముల ఘనతను కోరక బోధించుమాటలయందే కాక మన ప్రవర్తనలందు, మన జీవితములయందుగూడ ప్రయోజనకారి యని చూపవలయును.

కా

సుధ

(అతని మెడ కౌగలించుకొని) మీ రెక్కలు అడుగు పెట్టినను నేను మి మ్మనుసరించెద.

భీష్ముడు

ఎట్టిపర్వతమును ఇప్డ రెక్కలజాలనంత నిబ్బరముగ నుండదు.

వైద్యుడు

(రస్తాపైననే వచ్చి తోటగోడ వెలుపలప్రక్కనే నిలుచుండి) ఓహో! ఈపట్టకుగూడా సరసాలతో యేంపనివచ్చింది చెప్పుమా!

సుధ

ఓహో! మామసలిధన్వంతరి; రండి. లోనికిరండి.

[పరుగెత్తుకొనివచ్చి తోటతలుపు తీయును.]

వైద్యుడు

వద్దు వద్దు! జొత్తుగా సయతిప్పింది......ఇటువంటిస్థలములోనే కదల కుండా యెప్పుడూ ఉండడం చాలాఅన్యాయం. ఈపోటుగాలి, కొండ గాలి, ఒళ్లు ప్రాణం రెంటిని తెగ్గోసుకొనిపోతున్నది.

భీష్ముడు

అట్లను గాదు.

వైద్యుడు

అంతగా లేదనియా అనుకొనెదవు! నీవు చెప్పునది సరియేయేని నేనొప్పు కొందును. నీ వంతనమ్మకంతో యేసత్యమునుగూర్చి బోధించుచుంటివో అది చాలాదిట్టంగానేయున్నట్లు కనబడుచున్నది. "తేలికగా చేసినది తేలికగానే పరిణమించును" అను సామెత చప్పగనేయున్నది—అని కొందరు తలచినను—

సుఖ

ఒకచిన్నగంట మ్రోతవలనగాని సూర్యునికిరణములు తనపైబడి ఆడుటవలనగాని మనుజుడు మేల్కొని ప్రొద్దయినదని యెరుగనగును.

వైద్యుడు

పోయివచ్చెదను; ఒకరోగికి చాలజబ్బుగా నున్నది.........

భీష్ముడు

మాతల్లిగారా?

వైద్యుడు

అవును. నాతోగూడ వచ్చెదరా?

భీష్ముడు

ఇప్పుడు గాదు.

వైద్యుడు

ఇంతకుముందే అక్కడికి పోయియుంటిరేమో!

భీష్ముడు

లేదు.

వైద్యుడు

గుణవర్యా! మీరు చాలకఠినులు. ఆమె యిన్నబోవునది చాలా స్వల్పమే యని తెలిసియు వడగండ్లలో పరుగెత్తుకొనివచ్చినా; పోతూవున్నా.

భీష్ముడు

నీశక్తిసామర్థ్యములను భగవంతుడు పోషించుగాక! నీకు సాధ్యమైన యెడల ఆమెకష్టమును నివారింపుము.

వైద్యుడు

వినియు వినకముందే పరుగెత్తుకొని వచ్చినందులకు నాసుగుణమును ఆశీర్వదింపు మనుము.

భీష్ముడు

నీ కామె చెప్పినపంపెను; అతి వ్యాకులహృదయంతో వేది ఎదురుచూచువానిని మాత్రము మరచినది.

వైద్యుడు

మాటయేల? రండి.

భీష్ముడు

మాట వినువరకు నేను పోవలసినచోటు లేదు. చేయవలసినకార్యము లేదు.

వైద్యుడు

(సుధతో) అయ్యో! బిడ్డా! నీకు అదృష్టము చాలదు. ఇట్టికఠినాత్ముని చేతులలో బడితివి.

భీష్ముడు

నేను కఠినుడను గాను.

సుధ

ఆమె ఆత్మను నిష్కళంకముగ నొనర్పగల్గునెడల తమహృదయరక్తమును సర్వము నొసంగ సంసిద్ధులుగ నున్నారు.

భీష్ముడు

చాలాకాలము క్రిందటనే కొడుకునై, వారసుడనై యుండినందుకు మనఃపూర్తిగ ఆమె అపూపత్రాలు గైకొంటిని.

వైద్యుడు

నీసొంతఅప్పులను ముందు తీర్చివేయుము.

భీష్ముడు

దేవునియెదుట ఒక్కడు అనేకుల దురితదూరులుగ నొనర్పగలడు.

వైద్యుడు

దవాలాకోరై తలమునకలుగా ఋణాల్లోబడి ఉండువతడు గాదు అట్లుచేయగలుగునది.

భీష్ముడు

దవాలాగానీ, భాగ్యమునుండనీ; తీర్చుటకే పూర్తిగ నిశ్చయించితిని. ఆవిషయ మొక్కటియే అన్నిటికి చాలును.

వైద్యుడు

(వానిని తదేకదృష్టితో కొంతసేపు చూచి) ఔను మనుజాలసంకల్పములలో కలిగినమార్పు చాలసంతృప్తికరముగనే యున్నది అది మీ వలననే జరిగినదనికూడ నేను ఒప్పుకొనెదను. కాని గురువర్యా! మీ స్వీయచరిత్రమాత్ర మింకను వెల్లనికన్నె కాగితమే,

[ప్రస్థానము.]

భీష్ముడు

(అతడు పోయినవైపుననే కొంచెముసేపు దృష్టి సారించి) ఈ ప్రేమ యనుమాటవలె ఏమాటయు అనృతమొనర్పబడి అన్నివైపుల ధూళిధూసరితమై కళంకితముగ లేదు. నరకలోకమున కనువారు స్వంత చిత్తులతో తమమనస్సులలోని లోపములు గండెలు దానిచే మాయ జేసెదరు. మరియు ఎప్పుడూ పరిపక్వముగ నున్న మోసముతో హాస్య

భాజనములగు తమజీవితముల కప్పి పెట్ట యత్నించెదరు......మార్గము చక్కగా అనిశ్చయముగా నిశ్రమగా నున్నదా?—ప్రేమలో నిద్రించుటకు ప్రక్కను తిరుగుదుగు; విశాలమగు పాపపథమునే వరించిరా?—ప్రేమ అప్పుడుకూడ స్వర్గము చేరగలుగుదురను ఆశను గల్పించును; వారు ప్రయత్నించకపోయినను పరవాలేదు. ప్రేమవలన వారు విజయము నార్జింపగలరు; తెలిసియు మనఃపూర్తిగా పాపము నొనర్చిరా—ప్రేమ వారికి ఆశ్రయమిచ్చి రక్షించగలదు!

సు॥

అవును, అది అబద్ధము......అయినను ఒక్కొక్కసారి నేనే ప్రశ్నించుకొంటా—'ఇదియంతయు కల్లయేనా?'—అని.

భీష్ముడు

దీనిని వారు మరతురు.

ప్రథమమున నిచ్చరీతి స్థాపన మొనర్ప
నార్పగావలె శాసనోదగ్రతృష్ణ
అల్పమో శ్రేష్ఠమో సాధ్యమో నిదంచు
మనము తలపోయు కార్యాలుమటుకె కాదు.
పూని చేయంగదగునవి వానివలన
సంభవించు దుర్బాధలు సర్వకష్ట
ముల భరించిన చాల దపూర్వస్థైర్య
కవచము ధరించి దీర్ఘమౌ కంపనిగళ
కంఠమున దూరి వెల్వడ గడగవలయు.

భీష్ముడు

సిలువమీద అతివేదనతో ప్రాణము వదులుట మహాత్యాగము కాదు. మరి యిది సిలువపానీయమునకై సంకల్పించుట; మాంసము ఊపిరి వదలునప్పుడుకూడ సంకల్పించుట; ఆత్మ నిర్విణ్ణమై పడిపోయినప్పుడు సహితము సంకల్పించుట అప్పుడు మోక్షము మన అరచేత జిక్కినది.

సుధ

(అతనిని గట్టిగా కౌగిలించుకొని) ఆయాజ్ఞకు నేను భయపడి నాముఖము రక్తహీనమైనప్పుడు కూరుచునవు ఓనాథా! నాకూరట గలుగ బలుకుము

భీష్ముడు

అట్టిపోరువ సంకల్పము విజయముగాంచినయెడల పిమ్మట ప్రేమకు సమయ మేతెంచును. అప్పుడది పావురమురీతి ప్రాణమును ముక్కున గరుచుకొని భూమిపై వ్రాలగలదు. కాని ఇప్పు స్వార్థముగా చెడిపోవుచున్న యీకాలము నెడల మానవుని ప్రేమయంతయు ద్వేషమువలె గాన్పించును. (కంపముతో) ద్వేషము—ఆఒక్క చిన్నమాట యీవిశాల ప్రపంచమునంతటియెడల తృణీకరణభావమును క్రమ్మరించుచున్నది. [త్వరగా ఇంట్లోకి బోవును.]

సుధ

(తెరచియున్న తలుపుసందు చూచి) తనవృద్ధకుమారునియొద్ద మోకాళ్ల మీద నిల్చుకొన్నాడు—దుఃఖ మాపుకొనలేనివానిపగిది తల నూరక యూగించుచున్నాడు. ఏమియుదోచక నిస్సహాయుడైన దుఃఖార్తుని భంగి ఉన్మత్తుడై పడక నానుకొని నిల్చి ఊరక బిడ్డ నడుముకొను చున్నాడు.

ఖల కాఠిన్య పౌరుషావాసమగు వీరిహృదయముకూడ ప్రేమభాగ్యము ఎంత సమృద్ధిగ ననుభవింపగలిగియున్నది! నరేంద్రుని ప్రేమింప సాహసించిరి.

ఆమడిను యింకను అన్యాయకాలసర్పదష్టపరిచితము కాలేదు. (భీతితో శేకలీడుచు) చేతులు పిసుకుకొనుచున్నారు. భయపడునట్లు లిటాలున లేచి—ఏమిది? బూడిదవలె తెల్లగ అయిరి!

భీష్ముడు

(మెట్లమీదికివచ్చి) సందేశ మేమియు రాలేదా?

సుధ

ఏమియు తీసికొనిరాలేదు.

భీష్ముడు

(వెనుకకు మళ్లీ ఇంటిలోనికి చూచుచు) నరేంద్రుని ఒడలు కాలుచున్నది—సరిగా ఊపిరాడుటలేదు—కణతలవద్ద హెచ్చుగా కొట్టుకొనుచున్నది. నాడి నిలుకడగా లేదు;—సుధా! ఏమియు భయము వలదు.

సుధ

సర్వేశ్వరా! ఏమి యోచన.

భీష్ముడు

భయపడవద్దు—(రస్తావైపు చూచి పిలుచుచు) సందేశహారుడు అగపడుచున్నాడు.

ఒకపురుషుడు

(తోటకరకవతలివైపున) ఇప్పుడు స్వామీ! తమరు రావలయును.

భీష్ముడు

(తొందరతో) త్వరగా చెప్పు—ఏమని నీసందేశము.

ఆపురుషుడు

అది ఏమంత స్పష్టముగ నుండలేదు. పడకలోనుండి తానే లేచి వెను కకు అనుకొని "పో, గురువును తీసుకొనిరా; నాసొత్తులో సగం సంస్కారమునకు యిస్తా" అని చెప్పినది.

భీష్ముడు

(వెనుకకు పడుచు) సగముకాదు! అట్లు చెప్పలేదనుము.

పురుషుడు

(తలవాడించుచు) అట్లు చేసినచో ఆజ్ఞాపింపబడినట్లు చెప్పినవాడను గాకపోదును.

భీష్ముడు

సగము! సగము!......సర్వము అని ఆమెభావము.

పురుషుడు

ఉండవచ్చును. కాని బాగుగనే చాలస్పష్టముగనే వినిపించినది. ఒక సారి వినినదానిని నేను జారిపోనియ్యను.

భీష్ముడు

(వానిహస్తమును గట్టిగా పట్టుకొని.) కడపటిదినమున భగవంతుని పేరోలగమున అట్లే సాక్ష్యమొసంగగలవా?

పురుషుడు

ఆ!

భీష్ముడు

పో, పోయి నే నీయుత్తరను బంపితినని చెప్పుము—'గురువుగాని సంస్కారముగాని నచ్చుటలేదు.'

పురుషుడు

(సందేహసూచకముగా భీష్ముని చూచుచు) ఆఁ, మీరు పేరు సరిగా వినలేదు. మీతల్లిదగ్గర నుంచి నేను వచ్చినది.

భీష్ముడు

స్వజనులకని, అన్యులకని నాకు వేరువేరు చట్టములు లేవు.

పురుషుడు

అది చాలకఠినమైన మాట

భీష్ముడు

నా కెట్టిసందేశము పంపవలయునో ఆమె ఎరుగును. ఆఁతయు యిచ్చెదననియైనను, లేక ఏమియు ఇవ్వననియైనను మాట రావలయును.

పురుషుడు

అయితే గురువర్యా!

భీష్ముడు

బంగారు ప్రతిమ సగముగా చీల్చబడినను విగ్రహమే అనిచెప్పుము.

పురుషుడు

మంచిది. మీ ఉత్తరమను దెబ్బ ఒక్కసారిగ తగులనీక సాధ్యమైనంత మెల్లగా ఆమెకు తెలియజేసెదను. తనకుమారునికంటె భగవంతుడే తక్కువ కఠినుడనునమ్మకమే ఆమె నూరడిల్ల జేయుగలదు. [ప్రస్థానము]

భీష్ముడు

ఊరటయా! ఔను. మలీమసమైనదానియూపిరియే వ్యాధులు, మృత్యువు వీటిరూపమున మానవలోకమును వేటాడుచుండును. అక్కర

భీష్ముడు

అమితముగ నున్నపుడు దీనమగు పాటలతోను, మొఱ్ఱలతోనూ న్యాయాధీశునోటిని మూయజూచుట చాలసులభమే అగును. ఈమతము చాలవరకు సరిగానే యున్నదనుకొనవచ్చును; ఈజనులు వారిపురాతనపురుషుని బాగుగ నెరుగుదురు. వృద్ధుడైన ఆతనిమనస్సు వచ్చుచేరమునకు వ్యతిరేకముగా లేదని ఆతనికృత్యములన్నియూ తెలుపుచునే యున్నవి.

[ఆపురుషుడు మరియొకరిని దారిలో కలుసుకొనును. ఇద్దరు కలసి వెనుకకు వత్తురు.]

భీష్ముడు

ఎక్కువ సంగతులు?

మొదటిపురుషుడు

అవును.

భీష్ముడు

ఓయీ! నీసందేశమును చెప్పుము.

రెండవపురుషుడు

పదింట దొమ్మిదిపాళ్లు యీతడవ యిస్తా నన్నది.

భీష్ముడు

సర్వమూకాదు!

రెండవపురుషుడు

అంతాకాదు.

భీష్ముడు

వాయుత్తరమిది "గురువు రాదు, సంస్కారము లేదు."

రెండవపురుషుడు

కష్టపడి గడ్డితిని మీకుగా అనంతయు సంపాదించెనే.

మొదటిపురుషుడు

గురువర్యా! మిమ్ము గని పెంచినది ఆమెయని జ్ఞప్తియందుంచుకొనుడు.

భీష్ముడు

(ముష్టిబిగియబట్టి) నేను ప్రేమపాత్రులకని, ద్వేషార్హులకని రెండురకములతూనికగుండ్ల నుపయోగింప సాహసింపను.

రెండవపురుషుడు

ఆమె అక్కర మిక్కుటము. ఆత్మ కలవరపడియున్నది; రండి, రాని యెడ మంచిమాటైనా చెప్పిపంపండి.

భీష్ముడు

(మొదటివానితో)పోయి రోగితో నేనుచెప్పితినని యిట్లు చెప్పుము. కరుణాగ్రహాయునకు హృదయపాత్ర నిర్మలముగ నుండవలయును.

[వారు పోవుదురు.]

సు॥

(అతనినిఃకరముకొని) నాథా! కొన్నివేళలందు మీరు సర్వేశ్వరునిచేతిలో ఖడ్గమువలె ప్రజ్వలించుట చూడ నాకు కష్టము గలుగుచుండును.

భీష్ముడు

(గద్గదకంఠముతో) ఒరనుండి పెరికిన కరవాలములు తొడలనుండి వ్రేలాడుచుండ నీప్రపంచము నాపై గవిసి విజృంభించుటలేదా? దీని

భీష్ముడు

మూర్ఖపు మొండిపట్టుచే నాహృదయము రక్తమును స్రవించుచుండుట లేదా?

సుధ

మీనిబంధనలు అతికఠినములు; ఏమియు సడలించకపోతిరి.

భీష్ముడు

నీకు ధైర్యమున్నచో అంతకంటె సౌమ్యము లగువానిని ఒసగుము.

సుధ

ఈకాలముతో జనులను పరిశీలించినయెడల వారిలో ఒక్కరైనను నీపరీక్షకు ఆగగలరో చూడము.

భీష్ముడు

ఆవాక్యములో ఘోరమగుసత్యము గలదు. మానజీవితాదర్శములన్నియు శూన్యములై, నైచ్యములై తుచ్ఛముగ చప్పగ అయిపోయినవి. తన భోషాణములోని ద్రవ్యమునంతయు నొసగి దాతపేరుమాత్రము ఎరుకపరచకొనకయే యుండునాతడు ఘనుడుగ పరిగణింపబడుచున్నాడు; కాని తనపేరు దాచివేయుంచి కలిగినవిజయముతోమాత్రమే తృప్తి చెంది యుండుమని వీరునితో చెప్పిచూడుము—రాజులను, చక్రవర్తులను అట్లువేయుఁగనుము—అప్పుడు ఒక్కఘనకార్యమునైన చూడగలవా?......అనామిప కవిని సహితము పాటయు, దానియింపు సొంపులును అతనివేయగ ఇతరు లెరుగకుండులాగున ఏకాకిగ కూర్చుండి తనగానపుపులుగును హృదయపంజరమునుండి వదలిపెట్టుమని వచియింపుము ......ఎండి మోడైయున్న చెట్లలోగాని పచ్చగ పల్లవయుతముగ నున్నవానిలోగాని వెదకుము. స్వార్థత్యాగ మెచ్చట

భీష్ముడు

నున్నదో కనుగొనుము. ప్రతివిషయమునను భౌతికగాఁగమే...ప్రబలి యున్నది; మృత్యుదేవత భీకరదంష్ట్రాకరాళవదనమును దెరచుకొని వేచియుండ ప్రతిమానుజుడును నిర్భాగ్యుడును, ధూళిధూసరితమును అగు జీవితలతను పట్టుకొని వదలజాలకున్నాడు. అది తెగినయెడల చేతికి దొరకిన ప్రతిరెమ్మను ఆత్మాతురమున గోళ్లతో పట్టుకొని రక్షించు కొన జూచుచున్నాడు.

సుధ

అట్లు నిస్సహాయులై పతితులగుచున్నారు. మీ సర్వస్వమో సర్వ పూజ్యమో అనుసందేశమును మీరు వారితో పలుకుచుందురు.

భీష్ముడు

సమరమున జయించువాడు ఏమైనను లొంగడు. ఎంత అధఃపతితుడై నను ఉన్నతస్థానము నధిష్ఠింపగలడు (ఒకనిముస మూరకుండును. ఎలు గుమారును.) ఎవరో మహాత్ముని ఎదుట నిలుచుకొని యీయున్నతసందేశమును నేను బలుకునపుడు ఝంఝామారుతహతి జిక్కి కొట్టుకొని పోవుచున్న ఒక చిన్న ఓటికొయ్యపై దిక్కులేక పడియున్నవానివలె నేను ఉండునట్లు తోచెడు

బలహీనులయెడ కఠినరీతి వర్తించినందులకై నానా ...కను కరముకొని
ఒంటరిగా నుండునపుడు దుఃఖముతో ... విడుచుచుందును.
హతముచేయుటకునై నాచేతిని పైకెత్తినపుడము నాకు సాధ్యమైన
యెడల మద్దికొనజాలుదును! ... దిక్

సుధా! నిద్రపోవుబాలుని కనిపెట్టుకొని యుండుము; ప్రేమ్మ. మనోహరములగు స్వప్నములు గలుగునట్లు జోలలు పాడుము.

భీష్ముడు

చైత్రభానునికరముల సరసిరీతి
స్వచ్ఛసౌహార్దమహా పసిపాపయాత్మ
దానిపైనని చరియించు తల్లిమనసు
చదల నిశ్శబ్దముగ పక్షి చనెడువేళ
జలధిగర్భాన నాడెడు ఛాయభాతి.

సుధ

(విహ్వలయై) మీయాలోచనల నెచ్చటికిబంపినను అవి మరల నరేంద్రుని వైపే తిరుగుచున్నవి.

భీష్ముడు

కాదుగాని వానిని జాగరూకతతో జూచుచుండుము

సుధ

నా శోకసాంకేతికపద మనుగ్రహింపుడు.

భీష్ముడు

కర్కశమా!

సుధ

కాదు. శాప్యమ్మును—

భీష్ముడు

(ఆమెను కాగ్రహించి శాపగ్రహీతుడగువాడు వర్ధిల్లగలడు.

సుధ

(వికాసముతో అతనిని జూచుచు) ఒక్కనిధినిమాత్రము భగవంతుడు కోర సాహసించడు. [ఇంటిలోనికి పోవును.]

భీష్ముడు

(నిశ్శబ్దముతో తనముందువైపు చూచుచు) అతడు ఘోరసాహసించిన యెడల యేకార్యమునకు మనపూర్వుల సంసిద్ధులుగ నుండుడని యాజ్ఞాపించెనో అందులకు భగవంతుడు సాహసింపగలడు. ...... (మఱచి పోవ యత్నించును.) కాదు కాదు! నాకర్తవ్యమిది యని నే నెప్పుడు నిశ్చయించుకొంటినో ఆనాడే త్యాగమొనర్చుటగూడనిర్దిష్టమయ్యెను. ఈప్రపంచమున నిద్రితుల మేల్కొల్పుటకు పర్జన్యగర్జనము ననుసరించు భగవన్నిర్మితాశనినై యుండుటకు .....అబద్ధము; అబద్ధము. అందు త్యాగమేమియును లేదు. స్వప్నముతోగూడ నదియు నిష్ఫలమయ్యెను. మఱి వారల నన్ను జేసి—నా కష్టముల రహస్యముగ నే పంచుకొని నాతోగూడి యనుభవించుట కేతెంచెను. (రస్తామీదుగా చూచుచు) ఇంకను, ఇంకను ఆలస్యమగుచున్నది. మాతల్లి పాపమును కూకటివ్రేళ్లతో గూడ ఒక్కపీకైన మిగులకుండ పెరికివేయగల ఆ చిన్నవాక్యము—'సర్వస్వము త్యజించి పశ్చాత్తప్తురాలనై యున్నా' ననువాక్యము—ఇంకను రాకున్నది.

అదిగో—కాదు అదిమన కొత్వాలువిగ్రహము; మంచివాడు; సౌమ్యుడు. లాఠైనను హంగారుగా నుంచును. మర్యాద మనిషి. జేబులలో చేతులంతా దూర్చుకొని—

కొత్వాలు

(తోటవాకిలి కావలవైపు) నమస్కారము; మనము కలసేది చాలా అరుదు. అయినాకాని నేను వచ్చినవేళ మంచిదికాదేమో!

భీష్ముడు

(యింటిలోకి రమ్మని సైగజేయుచు) లోపలికి రండి.

కౌశ్యాలు

వద్దులెండి; పర్వాలేదు. ఇక్కడ బాగానే వున్నది. ఇంకను, నాపని గూడా యిక్లే బాగా అయితే అందరికి లాభకరముగానే వుండుగల దని నాకు నిశ్చయముగా నమ్మకమున్నది.

భీష్ముఁడు

అదేమిటో చెప్పండి.

కౌశ్యాలు

నేను విన్నా——కాలయాపనయెందుకుగాని——మీ తల్లి జ్వరపీడితయై మరణావస్థలోనున్నట్లు వింటిని. నాకు విచారముగా నున్నది.

భీష్ముఁడు

నేను సందేహించుటలేదు.

కౌశ్యాలు

నాకు చాలవిచారముగా నున్నది.

భీష్ముఁడు

మంచిది; చెప్పండి.

కౌశ్యాలు

మరి నరి! ఆమె కడుముదుసలి; మనమందఱముగూడ ఒకనాటికి మట్టి అయ్యేవాళ్ళమే......అందువల్ల యిప్పుడు నేనిట్లుపోవుచూ ఉండి 'వెన్నముద్దను రెండుసార్లు కొరకవలెనా'అని యనుకొంటిని; ఇదంతా యెందుకు? టూకీగా ఇక్కడంతా చాలా పుకారుగా ఉన్నది. మీ రిక్కడ చేరినదిమొదలుకొని మీయిద్దరిమధ్య యేదో కొంత నటన——యేదో కుటుంబవ్యవహారము——జరుగుతూ ఉన్నదనీ——

భీష్ముడు

ఏమని మీ భావము?

కొత్వాలు

ఆమె పబ్బా నగా నట్రా అంతా దగ్గరపెట్టుకొనియున్నదే. అది మీ కొరకు అని చెప్తారు. అందు కేమిసందేహము పనిలేదు. తన సంగతి తన లాభనష్టాలుగూడ చూచుకోవలెగదా—అందుకనే అంతా, నీకు చిక్కనీకుండా, తనవద్దనే ఉంచుకొనియున్నది. మీ తండ్రి ఆస్తి యింటికిసంబంధించినసొత్తు యావత్తు.

భీష్ముడు

అంతయూ తనవద్దనే ఉంచుకొని యున్నది. అది నిజము.

కొత్వాలు

అందువల్ల త్వరగలోనే మట్టాల కయిష్టము కలుగతుంది; అందువల్లమీరు శాంతచిత్తముతో ఆమె యవసానము కొరకు ఎదురు చూచు చుందురు. అందువల్ల మీరేమి కోపపడకుండా వినేయెడల చెప్తా—ఇది అందుకు తగినసమాయముకూడ కానిమాట నిజమే.

భీష్ముడు

ఇప్పుడైనను ఇంకొకసారియైనను అంతా ఒకటే

కొత్వాలు

అట్లయిన ఇకను ఆలస్యము చేయక కార్యానికుపక్రమింతము. త్వరలోనే మీతల్లి చనిపోతుంది. దహనసంస్కారములు పూర్తియగుటతోనే మీరు భాగ్యవంతు లయ్యెదరు.

భీష్ముడు

అట్లగునని తలచేవు?

కొత్వాలు

తలచుట? నాకు బాగా తెలుసును. ఈనిశాల ప్రదేశము కంటికగపడు నదంతా. చుట్టూ ఆమె భూములే. దగ్గర వద్దనుఅంటారా? నిశ్చయముగా అంతా యింతా?

భీష్ముడు

వ్యాయస్థాన మొకటియుండలేదా?

కొత్వాలు

ఉండేదేమి? ఇద్దరు వాళ్ళు—దాగులుంటే వారిమధ్య తగాదాలు పరిష్కరించడమే దానిపని దీనిని పంచుకోవచ్చేవాడు లేనేలేడు.

భీష్ముడు

ఒకవేళ నాన్నగారైనా 'ఈఆస్తికి అప్పుడు వారసుడు నేను కాబట్టి నాకు రావలె' నని చెప్పినయెడల?

కొత్వాలు

అవునయ్యా మేమైనావస్తే రావసినదే! అవును; మీరు నమ్మకుండా అట్లు చూపినమ్మనుగాని యిది మాత్రము నిశ్చయము. ఎవ్వరుగాని యిక్కడ త్రవేలెత్తి ఒక్కమాటగూడ అనలేరు; నన్ను నమ్మండి; నాకు మార్గమంతా తెలుసును—మంచిది తర్వాత: మీ రదృష్టవంతులు; చాల భాగ్యవంతులవుతారు. అప్పుడు ఈపాడుచోట, యీమూలకొంప లలోనుండి కష్టపడ నిష్టపడరు. దేశమంతటికి మే లొనరూర్చుట మీకు లేకయగును.

భీష్ముడు

ఒకవిషయము, మీమనస్సునందలి భావము టూకీగా చెప్పితే 'ఇక్కడ మంచిదా' అనియేకదా!

కౌశల్యలు

ఇంచుమించుగా నే ననుకుంటాను. మీరుగాన అక్కడ నేస్తే యిక్కడ అన్నిపక్షాలవారికి క్షేమము గలుగుతుంది అని. మీ వారికి మీసందేశము నొసగుచున్నారో అజములగుంపును బాగ పరిశీలనదృష్టితో చూడండి. కోళ్లు, బాతులు ఉండే సంపుటాలో జొరబడిన తోడేళ్లవలె మీ రున్నారని యొప్పుకొనక తప్పదు—మీరు విపరీతముగ వస్త్రముల గప్పించుకొనువారలు గాదు: అనగా నేను చెప్పుచున్నదేమనగా మీకుగలజ్ఞానము, శక్తి, మీప్రతిభలను అన్యాయము నవకాశముల గ్రంపకలయున్నచో మీరు విశాలదేశములలో ప్రచారము సేయవలసియుండును. ఈకొండరాళ్లలోని యిరుకుసందుల పిత్రార్జితము నాస్తిగాగలిగి యీగుట్టలు జన్మభూమిగా గలిగినందులకే యుబ్బిపోవుచున్న యీదరిద్రపు పాటకపుజనమునకు మీబోధనల్లకేడేకాని మేలెన్నటికి గలుగబోదు.

భీష్ముడు

జన్మభూమియందె జను డెప్పుడభిరుచి
రాతినేల కేకుమ్రాను రీతి
అతనిచేత గొంతు లచట పీఠకయున్న
వ్యర్థగానమెకద వానిబ్రదుకు.

కొత్వాలు

ఘనకార్యము లొనర్ప నెంచుపురుషుడు తనదేశమున కేవి ముఖ్యావ సరములో వాటిపైన మొదట దృష్టి నుంచవలయును.

భీష్ముడు

కొండలనడిమిలోయ మారుమూలలలో నుండి చూచుటకన్న మహో న్నతపర్వతశిఖరములపై నిల్చి వీక్షించుట శ్రేష్ఠముగదా!

కొత్వాలు

పెద్దపెద్దదేశాలలో, నాగరకప్రపంచములో ఆకథ చెప్పండి. ఈచి ద్రులకొంపను మాత్రము వదలిపెట్టండి.

భీష్ముడు

ఆహా, మీరు పర్వతములకు పల్లపుభూములకు మధ్య ఎట్టిగోడలు కట్టారయ్యా! సామ్రాజ్యముల కగ్రాములకు హక్కులు కావలయు నను దురు. అల్పములైనను, ఘనములైనను సంఘసంబంధములకు మీకర్తవ్య ములమాట వచ్చినప్పుడుమాత్రము 'మా దేమున్నదండి దరిద్రులము' అని యేదయిస్తా తప్పించుకొని స్వేచ్ఛగా తిరుగజూతురు.

కొత్వాలు

ప్రతి విషయమునకు సమయము రావలెను. ప్రతిపరమునను జనులకు వారివారికి నువగు ప్రత్యేకకృత్తులుండనేయున్నవి. ఈప్రపంచ మొన ర్చిన మహాఘనకార్యములనెడి భోషాణములలో మాయీగ్రామముకూడ యథోచితమగు మొత్తమును వేసియే యున్నది—(ఏ మంతతక్కువ మొత్తముమాత్రము కాదు—) చాలా పెద్దమొత్తమును—చాలాయేం డ్లక్రిందటనే లెండి—ఈకాలానికిది యిట్టి చిన్నపల్లెకొంప అయి

వదిగాని దీనిపురాతనపు కీర్తిమాత్రము శాశ్వతముగా గాథలలో నిలిచి యుండగలదు. విస్మృతమైయున్న దీనికీర్తి అజాతశత్రునినాటి సత్య కాలములో విశేషముగ విస్తరిల్లెను. అప్పటికథలు ఎన్నో వినోద ముగా చెప్పుకొనుచూ ఉంటారు రాముడు, కృష్ణుడు అను యిద్ద రన్నదమ్ములు, మాంచి దిట్టమైనవాళ్లు, యింకా యెందరో గుంపులు గుంపులుగా బయలుదేరి పోయి పడి చోళదేశాన్ని యిష్టమువచ్చినట్లు కొల్లగొట్టేవాళ్లు, ఆనక్షీణాగా న్లు, వణకిపోయి ‘భగవంతుడా, ఈ మోటుముండాకొడుకుల కత్తిదెబ్బనుండి రక్షించండి స్వామీ’ అని మొరబెట్టుకొనేవారు దీనముగా. ఈ ‘మోటుకిరాతులు’ ఎవరనుకున్నా రు?—అంతా యీమట్టుప్రక్కలజనమే, సందేహము లేకుండ! ఆ గ్రామ్య స్వామీ! కసిదీర్చుకోవడానికి మనుష్యులంటే, వాళ్లు. అనుగుబెట్టిన ప్రతిచోట నరకడం, తగులబెట్టడం కసలుచేస్తారు. ఎవరో ఒకమహా వీరు డుండినాడని ఆయన దైవకార్యమునకై (మతప్రచారమునకై) యుద్ధముచేయ సమకట్టెననియు; ఇంకా ఏమేమో! దీని నారంభిం చినదాయన అని మాత్రము చెప్పలేము

భీష్ముడు

స్వర్గీయుడగు నీమహాపురుషునివంశీయు లున్నారుగదా!

కొత్వాలు

చిత్తము. మీమాట సత్యము. వారికి సంతతి కలదు. కాని దీనిని యూ రెల్లరుగ గ్గిరి?

భీష్ముడు

ఓ, అదియా? ఈకాలమున కొందరి ఘనాశయములు, వారొనర్చు ఘన కార్యములు, ఆ మహామహుని కృత్యములవంటివే కావున్నను ఆ రక

ములో చేరునవియే యని తెలిసికొనగలుగుట అంతకష్టమైన పనిమాత్రము కాదు.

కౌత్స్యులు

అవును; అవును. ఆవంశరక్తము మాలో నిప్పటికిని కలగు. ...... మేము అజాతశత్రుని మార్గముల ననుసరించితిమి మొదట అప్పుడు దూర దేశతీరాలలోకి పోయి పడ్డాము. తర్వాత గండ్రగొడ్డళ్ల వాదరలతో యిరుగుపొరుగువాళ్లని-మన దేశములో వాళ్ల భూములను ధ్వంసము చేసినాము. వారి పైరుపంటల నాశనమొనర్చి యెన్నో యిండ్లకు దేవాలకు నిప్పుపెట్టినాము. ఇంకా యిటువంటి మహత్కార్యములొనర్చి కీర్తికాంతా మనోహరుల మైతిమి ఇందువలన గలిగిన రక్తపాతమును గూర్చి యితరులు చాల యెక్కువగా చెప్పుకొని యుండవచ్చును; వాని నన్నిటిని విశ్వసింపకున్నను ఈవిషయములగూర్చిమాత్రము మన పూర్వుల మహోత్తరచరిత్రను ప్రేడిచూపి ఈగ్రామము, అంతయు నశించి నామావశిష్టమైయున్న మన యీకుగ్రామము, ఒకప్పుడు మానవజాతి పురోభివృద్ధికొరకై ఖడ్గాస్త్రబలమున తనకర్తవ్యమును నిర్వహించెనని తెలుపుటకు కావలసిన సాక్ష్యమంతయు నచటనే కలవని నిశ్చయముగా చెప్పగలను.

భీష్ముడు

'మనపూర్వులు ఘనులు అనుటలో వారికి మనము ఋణపడియుండుట యిమిడియున్నది' అనుమాత్రమును మీరు మరచినట్లున్నది. మహారాజా! అజాతశత్రుని కాలమును, ఆబాణములను, బల్లెములను మీరు మీ నాగటిచాళ్లక్రింద పూడ్చిపెట్టితిరి.

## కావ్యాలు

ఏంపామాత్రము లేదు. తమరు కొంచెము శ్రమనొసికొని వీరి యిండ్లను విందునకు పోయిడి భోజనము చేయునపుడు వీరు అజాతశత్రు మహారాజుగారిని మరచిపోలేదనియు వారికీర్తిని స్మరించుచుందురనియు యెరుగగలను నేనును అట్టిమనస్సొరిగిన ఉత్సాహ సమయములలో నా భావపుష్పములతో వారినామము నలంకరించి అచటి ప్రజాసంఘాన్నుత్సాహనకు ప్రయత్నించుచుందును. కవిత్వమంటే నాకు చాల ప్రీతి అని ఒప్పుకొనెదను; మా గ్రామాలుకూడ అందులో నాతో నేకీభవించును.—అయితే అంతటికి హద్దుండవలె: అది (కవిత్వము) మనజీవితమున మార్గదర్శి కాజాలదు. రాత్రి భోజనము చేసినతర్వాత ఏడుమొదలు పదిగంటలలోపల యిరుగుపొరుగువారంతా పనులు ముగించుకొని పగటికష్టముచే నలసియున్న దేహముల విశ్రాంతికొఱకును, మనస్సున కుల్లాసముగానుండుటకు అరుబయట విశ్రమించినపుడుమాత్రము దానికి తగిన సమయము—చూచితిరా? ఇది మనయిద్దరిలో నుండు భేదము: మీమనన్నడము, యుద్ధము చేయడము ఒక్కటిగానే కావలెనందురు—రెంటిలోను మీ ప్రాణశక్తిని ఒక్కసారే ఉపయోగించవలెనందురు. నేను మీ ఉక్తులను సరిగా అర్థము చేసుకొనియుంటే—జీవితమును, ఆదర్శమును ఒకటిగా మేళవింపవలయునని మీ యభిప్రాయము; మీరు జరుపుమన్న యీమతయుద్ధమును, వరిపైరుతో కలిపి పెంచవలయునని మీ భావము; పొడిసేసి గంపకము వెల్లుప్పును కలిపినట్లు పూర్తిగా—ఇంకా పరిపూర్ణముగా కాబోలు!

భీష్ముడు

బహుళశః.

కొత్వాలు

మంచిది. ఇక్కడ అది కానిమాట. ఈరాతినేల దున్నుటకు మమ్ము వదలి యింకను విశాలములగు దేశముల జూచుకొండి. అక్కడ యీ సూచన ఉపయోగపడవచ్చునేమో!

భీష్మకుడు

మొదట సముద్రములోనికి లోతుగా దున్ని మీ పూర్వీకుల గూర్చిన పొగరు, డంబపుమాటలు పూడ్చి పెట్టండి; తన ముత్తాత మిగులదీర్ఘకాయుండై నంతమాత్రమున మరుగుజ్జువా డెన్నటికిని సామాన్యపురుషునియంత పొడు గెదుగజాలడు.

కొత్వాలు

పూర్వచరిత్రస్మరణమున నభివృద్ధిబీజము లిమిడియున్నవి.

భీష్మకుడు

ఇట్టిస్మరణలవలననే కార్యసాఫల్యము కలుగునట్లైనచో! మీరు మీసర్వనాశనకరమగు సోమరితనము గప్పిపుచ్చుటకై మీతాతలచాటున దాగుకొనెదరు.

కొత్వాలు

నేను మొదలు పెట్టినట్లే ముగించెదను; ఇచ్చటనుండి వెళ్లిపోవుటయే మీకు సర్వవిధముల శ్రేష్ఠము అని చెప్పుచున్నాను. ఇచ్చట మీకృషి వలన మంచిఫలితమేమియు గలుగబోదు. మీయుద్దేశము లిచ్చట అర్థము కావు. అప్పుడప్పుడు యీకర్షకులు చేయగలస్వల్పకార్యములు, వారికి కావలసిన కొలదిపాటి యౌన్నత్యము, మీరు భద్రముగా నాకు వదలి పెట్టవచ్చును. నాయుద్యోగార్హత నాకుగల కార్యోత్సాహమును

ధ్రువపఱుచగలసాక్ష్యము (లెక్క) నావద్ద గలదు. ఇప్పటిజనసంఖ్య రెండింతలు—మూడింతలు—అయినది భోజనమునకు నూతనమగు వసతుల నేర్పరచుటకు నాకు వీలైనందున. ప్రకృతి యెన్నియో అంతరాయములు గలిగించుచున్నను యత్నమున జయముగాంచి చాలవరకు ముందుకు సాగిపోతిమి—వంతెనలు రస్తాలు, దూరము తగ్గించుటకు—

భీష్ముడు

వ్యావహారిక పారమార్థికములనడుమ నొక్కటే లేదు.

కొత్వాలు

పీటియొద్దనుండి పర్వతశిఖరము దగ్గరవరకు

భీష్ముడు

కాని దేహమునకును ఆత్మకును మస్య కాదు.

కొత్వాలు

మొదట ఇంటింటికి సంచారమును సుకర మొనర్చుటకు మార్గములు. అంతమట్టుకుమాత్రము అభివృద్ధియే యని మేమందఱ మనుకొని యుంటిమి మీ రిప్పటికి గురువులుగా వచ్చేవరకు ఇప్పుడు తమరు వీనినన్నిటిని కలవరపెట్టివైచితిరి; మాచిన్నిదీపములు ఉత్తరదేశపుకాంతి ననుకరించి భంగపడుచున్నవి. ఇట్టి మాయాగ్నిజ్వాలలలో నిదితప్పు, ఇది ఒప్పు అని యెవ రేర్పరచగలరు! ఇది సహజము, ఇది అభ్యంతరము, అని యెవరు విడదీయగలరు! అనుకూలవాతావరణమునంతయు కలచివైచితిరి. ప్రేమకు దిగువక్కై ఒకటిగావలసిన వీరిని—నీ మందను—భేదించి ఒకరితోనొకరు పోరాడున ట్లొనర్చితిరి.

భీష్ముడు

నావర్తలకు మీ శౌర్యము కొనవలసి యుండునని నామనవి. కూలిపని చేయువాండు తనకిష్టమువచ్చినకార్యమును మాత్రమే చేయుచుండజాలడు. ఉన్నతాశయసంశోభితుడగు ప్రతిమనుజునకును స్వల్పమగు వర్ణ్యకృత్యములలో లిఖింపబడియున్న "నీనిర్దిష్టపథ మిద్యటు" అను భగవంతునివాక్యార్థము తెలిసియే యుండును.

కౌత్వాలు

ఆఁ; నిలవండి. సరేకాని క్రమమైన హద్దు నొకదాని నుంచుకొండి. ఇన్నాట కనబడు ప్రతి నేరమును, పాపమును లోపమును పెరికి పారవేయుండి. అందులకు నాకాక్షేపణ మేమియు నుండదు. ఆమార్గమున నెంతయో అవకాశమున్నది. దేవుడే యెరుగును......కాని పనిచేయవలసిన మున్నాట అకవై దినాలు పండుగదినాలు చేయబోకండి. ఏటిలోబోవు ప్రతిఒటి తెప్పమీద మీతోగూడ దేవుడున్నట్లు జండాలు కట్టుచూ ఉండకండి.

భీష్ముడు

మీయుపదేశము ప్రకారము జరుగవలయునన్నచో నాయాత్మయే వేరు రూపముదాల్చవలయును. గమ్యమునుగూడ మార్చుకొనవలసియుండును. మానవుని అవధి తన్నుతా నెరిగియుండుట; తన యంతరాత్మకు న్యాయమగురీతిని వర్తించుట; తనసందేశమునకు విజయము నొనగూర్చుట; నా వద్దనుండి వెడలు యీ(జ్ఞాన)తేజమును నాస్వదేశపరిసర ప్రదేశముల ప్రకాశింపజేసెదను. మీబోటి నాయకులు జోలలుపాడి నిద్రపుచ్చిన జనుల మానసముల మేల్కొల్పెదను. నశింపక యింకను వారిలో నిలిచియున్న పర్వతప్రకృతిలేశమును మీ యిరుకుబోనులో చాలకా

లము బంధించియుంచితిరి. వారి గాత్రములు అరిగి దీనములై మీరిచ్చు కించిదాహారమువలన ఆకలి తీరక కడుపుకాలి చచ్చిపోవుచున్నవి. వారి రక్తములోని శ్రేష్ఠతరమగు పదార్థమునంతటిని గుంజివేసితిరి. వారి దార్ఢ్యమును, అందలి సారముతో గూడ; ఇనుపచిట్టెములతో సరియగు వారిహృదయములను తునుకలుగ నలగగొట్టిచూరి పొడిచేసితిరి ..... కాని శీఘ్రకాలముననే ఒకస్వరము—ప్రస్తుతము చాలదూరము నుండి కొంచెముగా వినవచ్చుచుండునది—మేఘగర్జనమువలె మీ చెవులకు వినిపించగలదు. యుద్ధము.

కొత్వాలు

యుద్ధము?

భీష్ముడు

యుద్ధము!

కొత్వాలు

మంచిది, మీరణభేరి మ్రోయింపుడు. మొట్టమొదట ఆహుతి కాబోవునది తమరే.

భీష్ముడు

ఏనాటికైన భగవంతుడు పూర్ణముగ ధ్రువపరచగలడులెండి, 'అత్యున్నతమగు విజయము పరాజయమే' అని.

కొత్వాలు

మీరు దారులు చీలుచోట నిలుచుకొనియున్నారు; గట్టిగా నాలోచించుకొనుడు. ఒక్క కాగితమును నమ్మి మీసర్వస్వమును ఒడ్డబోకండి

భీష్ముడు

నేను చేసియే తీరెదను!

కౌశల్యాలు

అప్పుడు పందెమున నోడినయెడల స్వర్గమైనమీజీవితమే దానికి కాపులి కాగలదు. ప్రపంచ మొసగగల సర్వసౌఖ్యానందముల గలిగియుండి, అమితమగునైశ్వర్యమునకు వారసులైయున్నారు. మీముద్దుల బిడ్డను జూచియైనను, మీప్రేమపాత్రమగు భార్యకొరకైనను మీరు జీవింప వలసియుండును. కరుణార్ద్రహస్తములు ఆశీర్వచనముపై నాశీర్వాదముల మీపై కురిపింపుమన్నట్లున్నది

భీష్ముడు

మీరు చెప్పు సర్వసౌఖ్యములయెడ నేను విముఖుడనైననేమి? విముఖుడు కావలసియున్ననేమి!

కౌశల్యాలు

సర్వనాశనము అయ్యో! ఇచ్చట ఈమారుమూల సర్వతోముఖమగు నీ యుద్ధమారంభించినచో...... ఉర్వరయగు దక్షిణతీరములకుపొండి. చాలదూరము పొండి. స్వర్గమువైపునకు శిరములనెత్తగలిగియున్నవారి దేశములకు పొండి. వారిని పురికొల్పినను. సమావేశముల నొనగూర్పుగు. అచటివారి నందరను రక్తబిందానమునకు సయితము సిద్ధులుగ జేయుడు. మేమొసగజాలునది రక్తముకాదు; ఈ మొండిబండలను సైతము మాహారముగ మార్చజాలు చెమటనుమాత్రమే.

భీష్ముడు

నే నిచ్చటనే నిలిచెదను. ఇచ్చటనే నాయావాసము గలదు. ఇచ్చటనే యుద్ధమొసర్చి జయించెదను.

కొత్వాలు

అందువలన నెంతజారిపోవునో మొదట యోచించుకొనుడు. మీరోడి పోయినచో నెంతనష్టమో ఆలోచించండి.

భీష్ముడు

నేను లొంగిపోవలసియున్న యెడల నేనే నశింతును

కొత్వాలు

గురువర్యా! ఏకాకియగు మనుష్యుడెట్లు రంగమున నిలిచియుండ గలడు?

భీష్ముడు

మనవారిలో శ్రేష్ఠులు నాతో నున్నారు.

కొత్వాలు

(మందస్మితముతో) అధికసంఖ్యాకులు నాతో నున్నారు.

[పోవును]

భీష్ముడు

(వానివైపు చూచుచు) పోవుచున్నాడు. బాగా తరిఫీదయిన ప్రజానాయకుడు. న్యాయమనస్కుడు; ఆర్ద్రహృదయుడు. సుగుణుడు. కపటశూన్యుడు. తనకు మంచిదని తోచినరీతినే వర్తించువాడు.— కాని తనజన్మభూమికిమాత్రము తెగులువంటివాడు. ఏవెల్లువలు, ఉప్పెనలు, పోరుగాడ్పులు, చీడలు, ఏక్షామాలు, వ్యాధులు, మంచు యివి యేవిగాని ఇతడు దాదాపు ప్రతిదినము చేసే చెడుపులో సగభాగము గూడ యిన్నియేండ్లకు చేసియుండవు. అవి యన్నియు ప్రాణములు మాత్రమే హరియింపగలవు.

భీష్ముడు

ఇతడన్ననో—కొంగరలు పోయియున్న యితనిసంకుచితాత్మనే— ఎంతెంతరిభావములు నిర్మూలింపబడినవి! ఎన్ని నూత్న మనోనిశ్చయములు అంగద్రొక్కబడినవి! ఎట్టి వృథాసంగీతములు నిద్రపుచ్చబడినవి! ప్రజల పెదవులపై తాండవమాడు ఏమందహాసమును, ప్రజలహృదయాంతరాళముల ప్రజ్వలించు ఏజ్యోతిని, క్రమ్మిచేయుట కితడు పరుగిడలేదు! ఇతడురక్తరహితముగ తనకిరాతకృత్యమును, హత్యను నెరవేర్చియుండబట్టి కాని లేనిచో నెట్టిమహోన్నతమగు సేవము, అంధివేయబడనిద్దై, కార్యసాఫల్యరూపమున వికసించియుండెడిదో కదా !

(తటాలున ఆతురతతో) వర్తమానము! ఇంకను వర్తమానమేమియు రాలేదే! ఆ; వీడుగో మనవైద్యుడు. (వానిని కలియుటకు పరుగెత్తుచు) చెప్పుము! మాతల్లి?

వైద్యుడు

న్యాయాన్యాయము లెంచకుము. ఆమె వేరొకరిసమ్ముఖమున నిలిచియున్నది.

భీష్ముడు

చనిపోయెనా! పశ్చాత్తప్తయే కదా?

వైద్యుడు

ఆమాట యనకూడదు. మనస్సంతయు ప్రాపంచికద్రవ్యముపై నుంచి పట్టుకొనియుండెను సమయ మాసన్నమగువరకు...అంతట వారు వీడిపోయిరి.

భీష్ముడు

(చకితమనస్కుడై నిశ్శబ్దముతో ఎదుటివైపు చూచుచు) దుష్ప్రథానువర్తియగు నాపాపినియాత్మ కడ కిల్లు దిక్కులేక పోవలసివచ్చెగా!

వైద్యుడు

శాపకములవల్ల నగ్నురాలు గాకున్నను తనజ్ఞానములవల్లనైన నామె సర్వేశ్వరుని సముఖమున న్యాయమునే పొందవచ్చును.

భీష్ముడు

(హీనస్వరముతో) ఆమె తనయంత్యకాలమున నేమనెను?

వైద్యుడు

ఒక్కసారి గొణిగెను: 'నాకొడుకుచేతికంటె భగవంతునిహస్తమే లఘువైనది' అని.

భీష్ముడు

(బల్లపై నిమగ్నహృదయుడై కూలబడి) పాపములవలనను, మృత్యువువలనను కలిగిన ఆయంత్యవేదనలోగూడ నాయబద్ధమే ఆమెగొంతు పిసికి ఊపిరాడకుండ జేసెనా!

[ముఖమును చేతులలో దాచుకొనును]

వైద్యుడు

(దగ్గఱకుపోయి వానినిచూచి తలనాడించును) (ప్రాతబడియున్న యీ కాలమును తమరు పూర్ణముగా నుద్ధరించెదరు! మనుజునితో భగవంతుడు చేసినఖరారు యింకను నిలిచియున్నదనిగూడ తలచెదరు! ప్రతితరమును తనపూర్వకాలమును నిస్సారమని యనుమంచగా, పసిబిడ్డలకు చెప్పినట్లు 'బూచి' కథలతోను, సలసలక్రాగు నూనె కళాయిలతోను మాకాలమును భయపెట్టజాలరు. "మొదట కరుణాగ్రస్తవుగ నుండుము" అని యిప్పటినీతి.

భీష్ముడు

(తల పైకెత్తి) కరుణా! ఆమాటయొక్క విరుపుపడినమూలాలుగే యిప్పుడు సర్వప్రపంచమునకును శివగర్భమువలె నున్నది. దుర్బలుల (యొక్క) సంకల్పపరిత్యాగము కాన్పింపకుండజేయుట కిది ఉపయోగపడుచున్నది. అందరిమెప్పును బడయజాలని సోమరిపోతు నిజపాపమును యీపచ్ఛదములో చుట్టిపెట్టుచున్నాడు.

దానిని చిహ్నముగా గొని, ఉత్తరువుగా నంగీకరించి అల్పులు తమ మాటల తేలికగా నుల్లంఘించుచున్నారు. ఓ బ్రాహ్మస్వామ్యులారా! మానవత్వమనిన సౌహార్దతమాత్రమే యని మీ భావము.

భగవంతుడు యేసుక్రీస్తునెడల పక్షాగ్రహియైయుండెనా? మీ దేవుడే రాజ్య మొనర్చుచున్నచో మోక్షము చాలచౌకరకే లభియింపగలదు. సిలువపై బాధ ననుభవించుచు నతడు దయజూడుమని భగవంతుని ప్రార్థించెను గాని స్వర్గమునుండి రాజకీయములందువలె బహుచాకచక్యముతో ప్రత్యుత్తర మొసగబడెను.

[అతడు తనతలను దాచుకొని వచింపరానిదుఃఖముతో కూర్చుండును]

వైద్యుడు

(సౌమ్యముగా) ఆఁ; ఘుంఝూమారుతహతసాగరమా! నీతోపానలమును వ్యయ మొనర్పుము. నీ వేద్వేగ్నియయుండిన శ్రేష్ఠముగ నుండెడిది.

సుధ

(మెట్లమీద బయటికివచ్చి భయకంపితయై, విషణ్ణయై వైద్యునితో మెల్లగా) రండి; నాతోగూడ లోపలికిరండి.

వైద్యుడు

అదురుకొంటిని. ఏమిసంగతి బిడ్డా?

సుధ

భీతిసర్పము నాహృదయము చుట్టును చుట్టుకొని జల్లుమనిపించు చున్నది.

వైద్యుడు

ఏమిభయము!

సుధ

(అతనిని తనతో గూడలాగుచు) భగవంతుడు రక్షించును, ఇట్లురండి!

[వారుయింటిలోని కేగుదురు. భీష్ముడిది గమనించడు]

భీష్ముడు

(పరధ్యానముగా) పోయెను. పశ్చాత్తాపురాలుగాకయే పోయెను, తన ప్రభువునొద్దకు! భగవంతునిహస్తము స్పష్టముగా సంజ్ఞచేయుచుండుట లేదా! ఇప్పుడు ఆమె పోగొట్టుకొనిన నిధికై నాసర్వస్వము నర్పించియైన విముక్తికలుగునట్లు చూడవలయును. ఇప్పుడు నేను 'వోయి దొలగిన యెడల నాజీవితము దుఃఖభాజనమే యగును. ధర్మబద్ధుడను, విధేయుడను అగుపుత్రుడను గాన ఈనిముసమునుండి నూతనముగ దృఢ సంకల్పుడనై ఈనాగృహపరిసర ప్రదేశములందే ఈపవిత్రసమరమును ప్రారంభించెదను. దేహముపై నాత్మకు సంపూర్ణవిజయము లభించు వరకు సాగించెదను!

పర్వేశ్వరుని సెగలులు నాలోనే ప్రజ్వలించుచున్నవి. నానాలుకయే వారికృపాణముగా నుండగలదు. ఇప్పుడు నాబలమువలనను సంకల్పవి

భీష్ముడు

ద్విసహాయమునను ఈపర్వతముల నన్నిటిని నే నొక్కడనే అంగద్రొక్కివేయగలనను నమ్మకము కలుగుచున్నది.

వైద్యుడు

(అతిశీఘ్రముగా సుఖలోఁగూడ వెలుపలకు వచ్చి పెద్దగా అరచును) పోండి! ముల్లెమూటకట్టుకొని యిక్కడినుండిపోండి. ఎందు కన్యాయంగా చెడిపోతారు.

భీష్ముడు

నాక్రింద భూకంపము గలిగినను అట్లుచేయను.

వైద్యుడు

అట్లయితే ఉండి మీబిడ్డను చంపుకోండి!

భీష్ముడు

(చకితమనస్కుడై) ఏమి! నరేంద్రుడు! పిల్లవాడు! ఘోరతరమగు ఆపద యేమిరానున్నది? నాబిడ్డ! నాబిడ్డ!

[ఇంటిలోనికిపోవ యత్నించును.]

వైద్యుడు

(పట్టుకొని నిలిపి) నిలవండి! ఎండమొగ మెరుగని యీచీకటికోవలో గాలి ఉత్తరధ్రువమునం దున్నట్లున్నది. దట్టమైన జిగటమంచు ఎప్పుడు క్రమ్ముకొని ఊపిరాడకుండ జేయుచున్నది. ఈకలుగలో ఈచలికాలమంతా ఉంటిరా మీబిడ్డకోమలజీవ మెండిపోవుట నిశ్చయము. ప్రయాణమునలన మీకే దుఃఖము తప్పిపోగలదు. అయితే చాలత్వరగా బయలుదేరవలె—సాధ్యమైతే రేపే.

భీష్మకుడు

ఈదినం—ఈక్షణం—పోతాను. ఓ, పొడవుగా బలిష్ఠుడుగా వాడు పెరుగవలయును. సముద్రముమీదనుండిగాని ప్రాలేయస్రవంతులపైనుండిగాని వచ్చు చలిగాలి యీనరేంద్రుని చిన్నహృదయమును ఘనీభవింపజేయరాదు!—రా, సుధా! రా నిద్రలోనే వస్త్రములగప్పి యెత్తుకొనుము. మనము వెళ్లుదము... ఈవాగు, ఈజలసంధి దాటిఅడ్డదారినైనా! ఓసుధా, సుధా! మృత్యువు (దేవత) తనగూటిని మనచిన్నిబిడ్డచుట్టును అల్లుచున్నది.

సుధ

నేను నాహృదయాగారాంతరాళమున నొకదయాగాథమును భయమును పోషించుచుంటిని, కాని దానియారంభమునుమాత్రమే నేను చూడగలిగినది

భీష్మకుడు

(వైద్యునితో) మేము పరుగెత్తిపోయినయెడల అతనికి బాగగునా? అట్లు ప్రమాణము చేయగలరా?

వైద్యుడు

తండ్రి శ్రద్ధతో దివారాత్రములు చూచుకొనుచుండు ప్రాణము యెట్టియపాయములనైన కేరగలదు. త్వరలోనే అతనివృద్ధసత్త్వునిగ గాంచగల్గుదువు. అతనికి అన్నియు నివై యుండును. భయపడ నవసరముండదు.

భీష్మకుడు

కృతజ్ఞుడ! కృతజ్ఞుడను! (సుధతో) ఉన్నివస్త్రమును నరేంద్రునకు బాగుగా కప్పుము. సాయంత్రపుగాలి తీరమును ముంచివేయుచున్నది.

[సుధ యింటిలోనికి పోవును]

వైద్యుడు

(మాట్లాడక యోచనానిమగ్నుడై భీష్ముని చూచుచుండును. భీష్ముడు నిశ్చలుడై వాకిలిగుండ లోపలచూచుచున్నాడు; కొంతసేపటికతని వద్దకుపోయి భుజముపై తట్టుచు) యేమి! నీమందయెడల నెంత నిర్దయ! ఎంతకరుణాశూన్యతి! స్వకీయవిషయమైనపుడుమాత్ర మెంత త్యాగా హృదయము నీరగుచున్నది. ఆజనులకుమాత్రము తక్కువ, యెక్కువ, అనుమాటే లేదు. శాసనమేక;తినశాసనమే; పూర్ణమో;పూజ్యమో, అను నావాక్యమే-మీవంతువచ్చినపుడుమాత్రము ఒక్క అరనిమిషములో-క్షణములో మీధైర్యము మాయమగును; యజ్ఞమృగముయితరులదిగాక తమదే అయినప్పుడు!

భీష్ముడు

ఏమంటిరి?

వైద్యుడు

కఠినశాసనపు బెట్టినపుటులివునుమాత్రమే మీతల్లికి వినిపించితిరి— "ఒక్కతృణము మిగుల్చుకొన్నయెడల నధోగతియే. రిక్తహస్తముల తోనే మరణమును స్వీకరింపవలయును" అని ......... ఈ జనుల ఘోరవిపత్తులలోగూడ నీమాట లేగంభీరముగ మారుమ్రోగెను. ఇప్పుడు మీజీవితనావ భగ్నమగుటచే తలక్రిందయినదాని పురోభాగము 'విధి' యను ఝంఝామారుత హతమగుటచే ఒక్కనిమిషములో శిక్షను గూర్చిన మీనిశ్చితాభిప్రాయములు గాలికి అలలపరమయ్యెను. అనే కులదెబ్బలుతిన్నరొమ్ములపై బరువులోపడి ఊపిరాడకుండ జేయుచుండిన ఆపుస్తకమునుదూరముగ పారవైచిరి. ఈపోరుగాలితో పోరాట మికజాలును. మీసంతతి ప్రాణమునిలుపుకున్న జాలును. వేరులేదు; కొండలేదు. అడ్డదారిన వెళ్లండి. మీతల్లి శవము అట్లే పడియుండ

గలదు. వెళ్లండి; వెళ్లండి. మీ కర్తవ్యమును ఒక మూలలో దురగండి. ఇప్పుడు అర్చకుడు దేవాలయమును మూయుచున్నాడు.

భీష్ముడు

(తనభావముల కుదుటబరచుకొనుటకై యేమియు తోచనట్లు తలను రెండుచేతులతో గట్టిగా బట్టుకొని) నే నిప్పు డంధుడనా? అప్పుడేమైన వట్లుంటినా......

వైద్యుడు

లేదు. తండ్రీ గాన యితరులవలెనే యున్నారు. మీరు దయార్ద్ర హృదయులైనందులకు మిమ్ముల నాక్షేపింతునని తలచకుడు. అట్లు ప్రాస్వీకరింపబడియున్నప్పుడే సంపూర్ణశక్తియుతులుగా నుందునప్పటికంటె ఘనులుగా నాకుగాన్పించుచుందుగ—మీచేతికి అద్దమునిచ్చితిని—సెలవుతీసికొనెదను. దానిలో మిమ్ముల జూచుకొని 'స్వర్గమును సంతోషముతో డీకొనగెంచునత డిట్లేనా యుండవలయును' అని నిట్టూర్పులు విడుచుచుండుడు.

[నిష్క్రమించును]

భీష్ముడు

(ఊరక క్షణముసేపు ముందువైపు చూచుచు తటాలున బిగ్గరగా) అక్కడగాక పతన మిక్కడనే యున్నదో!

[సుధ బిడ్డను చేతులతో నెత్తుకొని పచ్చడముకప్పుకొని ద్వారముగుండ వెలుపలకు వచ్చును. భీష్ము డామెను చూడడు. ఆమె మాట్లాడబోవుచున్నదిగాని అతని ముఖవైఖరిగాంచి భయవిహ్వలయై నిలుచును. అక్షణముననే ఒక పురుషుడు అతిత్వరితముగా లోటకరగుండా పరుగెత్తుకొనివచ్చును. సూర్యు డస్తమించుచున్నాడు.]

పురుషుడు

మీకొక విరోధి ఉన్నాడు. జాగ్రత్త!

భీష్ముడు

(పిడికిటిని గట్టిగాబట్టి రొమ్మువైపు చూపుచు) అవును. ఇచ్చట!

పురుషుడు

అందుకు కొత్వాలు! అన్ని ప్రక్కలను మీ ఉపదేశబీజములు మొలకలెత్తి వృద్ధిపొందుచుండెను. కొత్వాలు అసంబద్ధప్రలాపములు తెగులు వలె వచ్చి వానిపచ్చనిచిగుళ్లు నాశనము చేసివేసెను. నీగివార్తలు కల్పించి దేశమంతా పరిచి పెట్టినాడు, గ్రామంలో గురుపీఠం ఖాళీఅవుతుంది అని. భాగ్యవంతురాలగు మీతల్లి కర్మ పూర్తికాగానే మమ్ముల వదలి పెట్టి మీరు పోతారు అని అతను చెప్తాడు.

భీష్ముడు

అది నిజమే యైనయెడల!

పురుషుడు

స్వామీ! మిమ్ముల నేను బాగా యెరుగుదును. ఈఅపనింద అనేకలుప్త మొక్కలెక్కడినుంచి పెరిగేది నాకు తెలుసును; అతనికి వ్యతిరేకముగా మీరు నిలుచబడితిరి. మీరొక్కరే; మీతో పట్లు పట్టినాడు. మిమ్ము తొయ్యలేకపోయినాడు. ఆగుర్రు మీమీద నెప్పటికి పెట్టుకొనే ఉంటాడు.

భీష్ముడు

(సంకోచించుచు) దానిలో వాస్తవముండవచ్చు.... అతడు కల్పించిన దానిలో.........

పురుషుడు

అట్లయితే మాయందరిముందర అబద్ధము చెప్పినారు.

భీష్ముడు

నేను, అబద్ధము చెప్పితిని?...

పురుషుడు

ఎన్నివాగ్లు మాతో చెప్పినారు. భగవంతుడు ఈకార్య మొనరించుటకే మిమ్ము లేపినాడనీ, ఇక్కడ మాతోనే మీయిల్లున్నదనీ మీరుజయించవలసినది యిక్కటనే అనీ, మనుజుడు తనకర్తవ్యమను క్షేత్రమునువదలరాదనీ, గ్రుద్దుమీదగ్రుద్దు తగిలించవలసినదేకాని లొంగిపోకూడదనీ, ఇంకెన్నో!... మీది యీకార్యము; మీఅగ్ని అనేకులహృదయములలో మండుచు జనమును తేజమును ఇచ్చుచున్నది.

భీష్ముడు

ఓయీ! ఇక్కట జనులు బధిరులు; అంధులు. ప్రతివారిమనస్సు చల్లారిపోయి మొద్దుబారియున్నది.

పురుషుడు

లేదు. మీకే చాలబాగా తెలుసును. అనేకులు స్వర్గమును, సూర్యునిఒక్కసారియైనా క్షణమునేపైనా చూడగలిగిరి.

భీష్ముడు

అంతకు పదింతలమంది హృదయములను నిబిడాంధకార మలముకొనియున్నది.

పురుషుడు

అచీకటిని బోగొట్టగలవెలుతురు దీపము తమరు. పోనీండి; ఇదంతా యెందుకు? లెక్కబెట్టనవసరమే లేదు. నేనుచెప్పేదిది: నేను ఒక్కడినే

భీష్ముడు

యిక్కడ నిలుచుకొని యున్నా. నన్ను పరిత్యజించి పొండి మీవల్ల యితే. నాకుగూడఆత్మఉన్నది. భగవద్గీతచదువుటకు నాకుసహాయము చేస్తారని మిమ్మే నమ్ముకొనున్నా; నన్ను నరకములోనుండి పైకి లాగినవారు మీరు, ఇప్పుడు జారవదలుటకు ధైర్యముంటే చూడండి. మీవల్ల కాదు. జెలగవలె గట్టిగా కరచుకొని యుండగలను. ఈ పట్టు దూసిపోయినదంటే నాఆత్మకు పాతిత్యమే—ధన్యోస్మి; మాస్వాముల వారు నన్ను మాభగవంతుని వదలిపెట్టిపోవుట చూడవలసి యుండదని నే నెరుగుదును.

[నిష్క్రమించును]

సుధ

(జంకుచు) మీచెక్కులు తెల్లగా నున్నవి. మీపెదవులువివర్ణమై పోయి నవి. మీలో నున్నహృదయము ఏడ్చుచున్నదో అన్నట్లున్నది.

భీష్ముడు

అతడు పైకి విసరివైచిన ప్రతిమాటయు పదిప్రతిధ్వనులబలముతో నన్ను వర్ధించుచున్నది.

సుధ

(ఒకఅడుగుముందుకువచ్చి) నేను సంసిద్ధురాలను.

భీష్ముడు

ఎందులకు!

సుధ

(గాంభీర్యముతో) తల్లినైన నాకర్తవ్యము నిర్వహించుటకు.

[గిరిక బైట రస్తామీద ఎడిగా పరుగెత్తుచు ద్వారమువద్ద నిలిచి చేతులు తట్టుచు పిచ్చిసంబరముతో అరచును]

గిరిక

వినియుంటిరె స్వామి బ్రతుకన్
చనుచున్నాడదో, కొండనుండి బం
డలనుండియు నీటిగుబ్బిముల్
పలుగాకుల్ గుమిగూడిరందఱున్
చెనటుల్ ఘనులైనవారు స
ల్లనివారున్ కుటిలాంగు లమ్మయో
గుఱితప్పని పాడుదయ్యముల్
కనులదృష్టవశాన నిల్చె నా
పగమాత్మహరించి రెన్నడో
పగమాత్మ ధరియించి తిర్గెదన్
సరి! అర్థమె నాకు సర్వమూ.

భీష్ముడు

నీయోచనలు విచ్చలవిడిగా సంచరించుచున్నవి. బిడ్డా! చూడుము. నీ యెదుటనే నిలిచియున్నానే.

గిరిక

నీవు! ఆ; నీవు; కాని స్వాములవారు గాదు;

అదె రిప్పున నల్లకొండ నుం
డిదిగెన్ నాశపు పోరుగాలిపై

భీష్ముడు

రొదబెట్టుచు రుద్రమూర్తియై
కదలెన్ కొండలుదాటి డేగయున్
బిగియించిరి జీను వీపుకున్
తగిలించారు లగాము నోటికిన్
మనిషొక్కడు పైన గూరుచుం
డెను వాడెవ్వడు? స్వామి; స్వాములే.

గుడితల్పులు మూసి తాళముల్
గడియల్ వైచిరి బిర్రుగా సరే
కడునీచపుకొంప దాని సూ
ర్యుడుగూడన్ ఇపుడస్తమించె పో
ఇక నామురిపెంపుదేవళా
నికి మర్యాదలు గల్గు స్వాములున్
చలిదుప్పటి గప్పి ధీరుడై
నిలుచున్నాడటుచూడు నవ్వుచున్
చలికాలము నేసె చూడగా
వలెనా? మార్గము తేలికైనదే
మరి...గ్రామపు దేవళాన్ని మూ
సిరి మాస్వాములధీరవాక్యముల్
జగమంతటిపైన మారుమ్రోగగ రువ్విరి.

భీష్ముడు

బిడ్డా! ఎవరు నిన్నిటను బంపిరి నీపిచ్చిబొమ్మలతో మమ్ము కలవర పెట్టుమని?

గిరిక

(తోటకు లోపలి వైపునకు వచ్చి) బొమ్మలా? దేనిని నీవుబొమ్మ పిల్చెగి? ఆ; నా కర్థమాయినది. ఒకప్పుడు పెద్ద, ఒకప్పుడు చిన్న, ఎప్పుడు వైభవము. ఎప్పుడు తళతళ—బొమ్మలా! ఆమెనుజూడు.మా ట్లాడితివే ఆనీవు. కనబడడంలేదా? బిడ్డపాదాలు, పసిబిడ్డ చెయ్యి, ఆమె కప్పినవస్త్రం కింద, ఏదో మడతలలో మసలుచున్నది నిద్ర పొయ్యేబిడ్డగా నుండవచ్చును. చూడు! దాచిపెట్టుచున్నది ఆమెభయ పడి...బొమ్మలు. మన్నీ! ఒకటి కనబడుచున్నది.

సుధ

(భీష్మునితో) ధ్యానము. అశ్రువులు మీకు దొరకినవా? నావానివి భయము మాడ్చి యింక జేయుచున్నది.

భీష్ముడు

సుధా! అర్ధాంగీ! ......ఆహా! ఒకమహాత్ముడామె నిచటికి బంపి నాడనుట స్పష్టము.

గిరిక

విను! గంటలన్నీ కొట్టుకొనుచున్నవి అడవిలో కొండలలోగూడా! దేవళానికి పొయ్యేదారిన గుంపులుగుంపులుగా నడుస్తున్నారు. నీవు చూడు ఏరు పొర్లివచ్చినట్లు వస్తున్నారు. నీవు చూడగలవా? వెయ్యి మందిపలుగాకులు, ధనపిశాచాలు, అట్లాంటివే యింకెన్నోపిట్టలు.

భీష్ముడు

స్వాములవారు వాటిని అలలలో ముంచివేసినాడు. ఆలోతులో ముని గే చాలానాళ్లుండినవి. ఆయన ముద్ర వాటికి కావలి కాస్తూ ఉండి నది. ఇప్పుడు వాటిసమాధులు పగులదీసుకొని బైటి కురుకుతున్నవి. చల్లగా జిగటవాసనకొట్టుకుంటూ గుంపులు గూడుతున్నవి. ఆయన పలుగాకులబిడ్డలనుమాత్రము తేలికగా వదలిపెట్టినాడు. ఇప్పుడు పం డ్లికిలిస్తూ పెద్దపెద్దబండ లెత్తుకుంటూ ఉన్నవి విను. 'అమ్మా! అబ్బా!' అని అరుస్తున్నవి. మగవాళ్లు ఆడవాళ్లు జవాబుచెప్తారు. ఈగ్రామస్థు డొకడు కొడుకుల సముదాయించేతండ్రివలె పరుగిస్తూ ఉన్నాడు. ఒకఆడమనిషి తనచచ్చినబిడ్డల నెత్తుకొని తనరొమ్ముల పాలిచ్చి పెంచుతున్నది— నామకరణంనా డున్నట్లు మహోత్సవములో ఉన్నది— ఇక్కడికి ప్రాణము ప్రవేశించింది స్వాములవారు పోతుం డగానే.

భీష్ముడు

ఇదిప్రారంభము! వీని ననుసరించి యింకను ఘోరమగుదృశ్యములు కాన్పించుచున్నవి.

గిరిక

నవ్వుతున్నాడు విను. రస్తాకొండవైపు కునిదిరుగుతుందే, అక్కడ కూర్చునియున్నాడే వాడినవ్వు. తన పుస్తకములో వ్రాయడానికి తొందరపడుతున్నాడు. అటుప్రక్కపోయ్యే ప్రతిమనిషిని, ఆఁ ఇప్పటికందరిని వ్రాసుకున్నాడు.

గుడితల్పులుమూసి తాళముల్
గడియల్ వైచిరి బిర్రుగా సరే

వినియుంటిరె స్వామి బుద్ధునర్క
చనుచున్నాడదో డేగ వీపుపై.

[పెండెయులు ఒక్కదూకున దాటి వెనుకనున్న చెట్లలో నదృశ్యమగుదు
నిశ్శబ్దము.]

సుధ

(భీష్ముని సమీపించి అతిహీనమగు స్వరముతో)మనము పోవనగు. కాల
మమూల్యము.

భీష్ముడు

(ఆమెను తేరిచూచుచు) సరేకాని యెచటికి! (మొదటతోట పెండె
మును తర్వాత యింటితలుపును చూపి) ఇటా? ఇటా?

సుధ

(నివ్వెరపోయి వెనుకకుజంకి) భీష్మా! మీబిడ్డ—

భీష్ముడు

(ఆమెను సమీపించి) మొదట ప్రత్యుత్తరము నొసగుము. తండ్రినగు
టకు పూర్వము పరివ్రాజకుడనుగ నుంటినా?

సుధ

(ఇంకా వెనుకకు తగ్గుచు) ఆమాట ఘనాఘోషములలో నుండి విని
పించినను నే నిప్పుడు ప్రత్యుత్తర మొసగజాలను.

భీష్ముడు

(ఆమెను మరల సమీపించి) కాని నీ వొసగియే తీరవలయును! నీవు.
తల్లివి. నీవే యిచ్చట కడపటివాక్యము నుచ్చరింపవలయును. ఇతరులకు
కాదు.

భీష్ముడు

సుధ

నేను సహాయురాలనుమాత్రమే. మీ రామాటనుచ్చరించ సాహసించిన చో నేను విధేయురాలనై వర్తించెదను.

భీష్ముడు

(ఆమె చేతిని బట్టుకొన యత్నించుచు) నిర్ణయము (కోర్కె) అను పాత్రను నావద్దనుండి గైకొనుము.

సుధ

(వెనుకకు పోయి ఒకచెట్టువెనుక దాగుకొని) అట్లయిన నాది తల్లికంఠ స్వరము కాజాలదు.

భీష్ముడు

నీయభిప్రాయము బహుకఠినప్రయత్నముతో వెల్వడెను.

సుధ

(ధైర్యముతో) కోరుకొనుటకు మీకు అర్హత గలదో యోచింపుడు.

భీష్ముడు

మునుపటికంటె పూర్ణమగు ప్రాణముతో వచియింపబడెను!

సుధ

సర్వేశ్వరునిపిలుపునందే పూర్ణవిశ్వాస ముంచెదరా?

భీష్ముడు

(ఆమెచేతి నొడిసిపట్టుకొని) ఆఁ; ఇప్పుడు నీయొద్దనుండిరావలసినది ఆ ఒక్కమాట-అమృతమో, మృత్యువో!

సుధ

మీయీశ్వరు నడుగుడు.....వారు చెప్పినచోటికి పొండు.

[విరామము]

భీష్ముడు

మనము పోవుదము మార్గము స్పష్టముగనే యున్నది.

సుధ

(ప్రాణవిహీనమగుస్వరముతో) అ దెన్నటికి పోవును.

భీష్ముడు

[పలుకకుండును]

సుధ

(తోటతెలుపు చూపుచు) అచటికా?

భీష్ముడు

(యింటితెలుపుచూపుచు) కాదు; ఇచటికి?

సుధ

(బిడ్డను తనచేతులలో నెత్తుగా రెత్తి) సర్వేశా! ఏది నీ నడుగసాహసిం తువో దానిని నీస్వర్గమువై పెత్త నేనును సాహసింతును! భీతికరముగు జీవితకాళరాత్రిఖండ నాకు మార్గముజూపుము. [ఇంటిలోనికిబోవును]

భీష్ముడు

(ఊరక ఒక క్షణము తనముందు జూచి కండ్లనిండ బాష్పములు గ్రమ్మ తన రెండుచేతులను శిరస్సునుపైన గట్టిగా బిగించుకొని క్రింద మెట్లపై పడిపోయి దుఃఖార్తుడై విలపించుచు) సర్వేశ్వరా! కరుణా నిధీ! నాకు వెలుతురును ప్రసాదింపుము.

మూడవ అంకము ముగిసినది.

# భీష్మ ము

## నాల్గవ అంకము

[సంక్రాంతి ముందుదినము. భీష్మునిగృహము; గది చీకటిగానున్నది. వెనుకనున్నగోడలో ఇంటిద్వారము ఉన్నది; ఒకప్రక్కగోడలో కిటికి, ఇంకొకప్రక్క తలుపు. సుధ దుఃఖసూచకమగువస్త్రములతో కిటికీవద్దనిలచి అంధకారమువైపు ఊరక చూచుచున్నది.]

సుధ

ఇంకనూ వారుతిరిగివచ్చు చిహ్నమే లేదు; అబ్బా! వేచియుండడం —ఊరకే లేచియుండడం ఎంతప్రయాస—పరితాపసంయుతము లగు వాంఛలను, ఆక్రందనముల ఒకదానిపై నొకటి పంపుటయేకాని— మరల పొందుటకు ప్రత్యుత్తరమే లేదు!......మంచు అధికముగను సాంద్రముగను పడుచున్నది; ప్రాతదేవాలయ శిఖరమును స్వచ్ఛతమమైన తెల్లనివస్త్రములో గప్పివైచినది—(వినుటనభినయించి) అదేమి! తోటపెంటెము తీసినట్లున్నది!......అడుగులు! ఎవరో మగవారి అడుగుల స్ఫుటమైనచప్పుడే నే! (ద్వారముకడకు వడిగాబోయి తలుపు తీసి) ఓ! లోపలికిరండి! మీరేనా, మీరేనా.

[భీష్ముడు ప్రయాణపుదుస్తులతో లోపలికివచ్చును. దుప్పటిపైనం తయు మంచు నిండియున్నది. దానిని తీయుచు మాట్లాడుచుండును.]

సుధ

(తనరెండుచేతులతో అతనిని కౌగలించుకొని) అబ్బా! ఎంతకాల ముంటిరి? నన్నువదలిపెట్టిపోకండి, నన్నువదలిపెట్టకండి. 'ఏకాకినై నిశీథములయందలి ఆనల్ల నిశాచరూపములతో పోరాడుటకు సత్తువ లేదు. అవినన్ను చుట్టుకొని వేపించుచుండును. ఏమిరాత్రి! మిమ్ముల నాకు కనుపించకుండాదూరాన్నే ఉంచినవి ఎటువంటి పాడుదినము లబ్బా!

భీష్ముడు

బాలా! మరలవచ్చి నీవాడనైనానుగదా. (ఒక్క మైనపువత్తిని అతడువెలిగించును. అదితన నిర్జీవపుకాంతిని గది యంతటను ప్రసరింప జేయును.) నీవుపాలిపోయిఉన్నావే.

సుధ

ఏడ్చేడ్చి– అలసిపోయికూడ; ఆ కాచుకొనియుండడం ప్రయాసవల్ల ......అందువల్ల కొన్ని పూవులను గుత్తులుగా కట్టిపెట్టినాను— కొద్దే; కాని నాకు దొరికినవి అవ్వే—ఈ చలికాలమంతా వాటిని కాపాడి ఇంటి నలంకరింపవలెనని తలచితిని. ఇవిమాత్రం దండకట్టి ఇవ్వవలెననుకొంటి? (ఏడ్చుచు) వాడికే అయింది—అనుభవం— సమాధిమీద వేయడానికి! అదిగో చూడు అక్కడ దానిని కప్పివేసిన ఆదట్టమగుమంచులో సగము మూసుకొనిపోయి, ఆ—ఓ సర్వేశ్వరా!

భీష్ముడు

శ్మశానము.

సుధ

అయ్యో ! ఆమాట !............

భీష్ముడు

ఆఁ! కన్నీళ్లురా నీకు............

సుధ

అయ్యో! కొంచెంఓర్చుకోండి, అట్లేచేస్తా; కాని నాహృదయ మింకను రక్తము స్రవించుచున్నది —గాయమా క్రొత్తది. ఆ ఆవేదన—నా శక్తిఅంతా ఖాళీఅయిపోయింది ......అయ్యో! త్వరలోనే మళ్లీ ధైర్యము వహింపగలను. ఈ సంక్రాంతిపండుగ దాటిపోయిందంటే మళ్లీ నే నేడ్వబోను, మీరుచూడబోరు.

భీష్ముడు

ఏమీ? ఇదేనా పండుగజరుపవలసినవిధం?

సుధ

అయ్యో! ఓర్చుకోండి. నేను యత్నముచేసినా—అయ్యో, నిరుడే కదా బాగా, దిట్టంగా, ఆరోగ్యవంతుడుగా ఉండెనే. ఈయేడు నా యొడిలోనుంచి తీసికొనిపోయిరే —తీసికొనిపోయిరే.

[మాట నుచ్చరింప లేక వణకును.]

భీష్ముడు

(కఠోరముగా) శ్మశానమునకు.

సుధ

(ఏడ్చుచు) దానిని పల్కకుడు.

భీష్ముడు

ఆశబ్దమునకు నీవు భయపడునెడల నేను నిండునోటితో పలికియే తీరవలయును. తీరముపైబడి గర్జించు తరంగమువలె అది అన్ని ప్రక్కలను మారుమ్రోగువఱకు ఉచ్చరించియే తీరవలయు!

సుధ

మీరు ఒప్పుకొన నిష్టపడరుగాని దానిభారమునకు మీరు జంకుచున్నారు. దానివలన గలిగినచెమటలతో మీఫాలతలము ఇంకను తడిగానే యున్నది.

భీష్ముడు

నానుదుటిపై నుండునవి నీటితుంపరలుమాత్రమే. అల్లకల్లోలముగానుండిన యేటిలోనుండి గాలికి పైనబడినవి యిప్పుడే!

సుధ

మీదృష్టి నవరోధించు ఆబిందువుగూడ ఆకసమునుండి పడి కరగిన హిమకణమేనా?—కాదు; అది చాల వెచ్చగ నున్నది. మీస్వాంతహృదయాంతరాళమునందలి ఒక ఊటనుండి అది బయల్వెడలినది!

భీష్ముడు

సుధా! సహాయినీ! మనము జంకక నిలిచి ఆయురవడినంతయు సహింతము—నీబలమును నాశక్తిని మిళితమొనర్చి, చేయిచేయిజేర్చి ముందునకు సాగిపోదము!......ఆహా! అచ్చట ప్రచండమారుతవాతావరణములతో డీకొనుచుండిన సమయమున నేను పురుషుడనుగానుంటిని! నట్టేట మనము పడియుంటిమి: శిలామయముగా నుండిన సముద్రతీరముపైబడి తరంగములు రొదవెట్టుచుండెను: సముద్రము

నందలి జంతువులుగూడ ఆతుపానుకోపవీక్షణములకు భయపడి మూక తను దాల్చినవి. వడగళ్లరాళ్లు ఆ చిన్న తెప్పను మర్దించసాగెను: సముద్రము అన్నివైపుల నురుగులు గ్రక్కుచుండెను: ఓడ స్తంభము మోకులు ఆ దెబ్బకు కిరకిరలాడిపోయినవి: పేలికలుగా చినిగిపోయిన తెరచాప తెల్లటిసముద్రంమీద చాలాలోపలికి కొట్టుకొనిపోయినది: చీలలు బిగించిఉన్న సందులను నోళ్లతో పడవ మూల్గ సాగెను: ఆ యగాధమగు నదిలోనికి మంచుపర్వతములు ఒళ్లుతెలియనివిసురున వచ్చి పడుచూ రొాద పెట్టసాగెను: ఎనిమిదిమంది తమతెడ్లమీాద పండు కొనిఉండినవారు ప్రతివాడు పీనుగైపోయిరేమో అన్నట్లు ఉండి నారు!......అప్పుడు చుక్కానిప్రక్కన నిల్చుకొని నేను విజృంభిం చితిని. అప్పుడు —ఆఁ; అప్పుడు నా పైగలసందేశము ఎరిగియుం టిని—నిశ్చయముగా యేకార్యనిర్వాహణమున మనరక్తము స్రవింప జేయుచున్నామో, ఆకార్యమునకు నే నిభిషిక్తుడనైయుంటినని.

సుధ

పోరాటములో కదలక నిలిచియుండుట తేలికయే; సమరమొనర్చు జీవితము సులభమే. అంతమొందింపజాలని యోచనలు మిక్కిలిమెల్లగ పిచ్చుకలవలె తటతటకొట్టుకొనుచుండ వానిమధ్య ఏకాకినై కూర్చుం డియున్న నాగతి యోచింపుడు. అమితభారముతో జరుగుచున్న ఆగడి యలలో సమరమను దీపపుస్తంభపువెలుతురునైన దృష్టిపథమున కాంచ నేరని దీనురాలను... నాగతి యోచింపుడు: నాచిన్నకర్తవ్యముకంటె అధికముగ యేమియు అడుగనేరని నాగతి యోచింపుడు: నిశ్శబ్దమగు కుంపటినిప్పులప్రక్క నుంచబడి సర్వము జ్ఞప్తియం దుంచుకొన సాహసింపజాలనిదాననై, అన్నిటిని మరచిపోవనేరనిదాననై,యుండిన నాగతి యోచింపుడు.

భీష్ముడు

నీకర్తవ్యము చిన్నపనియా? నీకు? ఇప్పటివలె ఇంతఘనముగ యెన్నడుఅది ఉండలేదు. నేను కష్టములవలన నార్జించిన విషయము నొకటి చెప్పెదను వినుము: చాలసార్లు నాకండ్లకు పొగమంచుక్రమ్ముకొనెను. హృదయము నొత్తివైచెను. యోచనాశక్తి పిడచగట్టిపోయినది. శ్రమోపశమనోపాయము ఏడ్పుమూలమున దుఃఖమును వెడల గ్రక్కుట ఒక్కటియే అయినట్లు తోచెను. అప్పుడు, సుధా! భగవంతుడు సమీపమున కనబడెను! అంతకుముం దెన్నడు నేను ఆయనను ఎరిగియుండనంతసమీపమున, అబ్బా! ఎంతదగ్గర! ఆయనను చేరుట చాల సులభ మనిపించెను. అప్పుడు అనాథయగుబిడ్డవలె ఆయన పాదములపైబడి నన్నాయనకు అర్పించుకొనుట ఎంతమనోహరము! సాన్నిధ్యమునందుండి తండ్రి తన వాత్సల్యపూర్ణమగు రొమ్మున అదుముకొనగలుగుట ఎంతటిభాగ్యము!

సుధ

భీష్మా! వారినెప్పుడూ అట్లే వీక్షింపుడు! మీ కెరుగగలిగిన తీరుననే పితృసమానునిగానే-ప్రభురూపమున గాదు.

భీష్ముడు

సుధా! భగవంతునికార్యమను గడుసురాజమార్గమును వదలిచరింపసాహసించెదవా? వారివీరకిరీటము స్వర్గమువలె మహోన్నతమై ప్రకాశించుచుండ కృపాణధారియగు భగవంతునే నేను చూడవలయునది! అవును. కాలము చాలాహ్రస్వరూపియైయుండుటవల్లనే ఘనత నన్వేషించుచున్నది......అయినను నీవుమాత్రము వారిని సమీపముననే చూడవచ్చును. ప్రియజనకునివలెనే వీక్షింపనగును; నీశిరమును వారి రొమ్ము

పై నిడి నీ వలసియున్నపుడు విశ్రమించవచ్చును; శాంతిబలభాగ్య సమ
న్వితవై సర్వేశ్వర కరుణాప్రతిబింబిత ముఖముతో మరలి రావచ్చును;
సమరసంఘర్షణవలన నలగియున్న నాయొద్దకు వారి మాధుర్యలేశమును
కొనిరానగును; సుధా! ఇటు చూడు. అట్లు కలసి అనుభవించుటయే
మనవివాహోదర్శము, గమ్యము; మనలో నొకరు యుద్ధ మొనర్పవల
యును; యత్నించవలయును; కాపాడవలయును. ఇంకొకరు అతని
గాయములను మాన్పవలయును. అట్లుండినప్పుడే 'రెండును ఒకటే' అను
మాటలు సార్థకము కాగలవు. నీవు సామాన్యప్రాపంచిక జీవితమును పరి
త్యజించి నాకు భార్యవగుటకు సమ్మతించి నీ యదృష్టమనుపాచిక
ను ధైర్యముతో విసరివైచినది మొదలు ఈకర్తవ్యదీక్ష నీతలపై
నున్నది. నేను సర్వకాలము యుద్ధము నొనర్చుచునే యుందును; జయ
మో, అపజయమో చేకూరువరకు కాల్చివేయు మండువేసవిలో నిల్చి
యుద్ధ మొనర్చెదను. క్రూరహేమంతరాత్రులలో గూడ ఏకాకినై
కావలిగాయుచు నిలుచుండెదను. నీవు యెడంగా నుండవలయును;
పైన నీ ప్రేమామృత పూర్ణకలశములు నాకిమ్ము. అయోమయయుద్ధ
కవచములోపల సౌహార్దపు మడతలతో నాదేహమును గప్పవలయును.
ఇది చాల చిన్నపనిఅని ఎన్నటికిని అనుకొనబోకుము.

సుధ

నేను చేయనెంచు ప్రతికార్యమును నాశక్తి చాలహీనమని కనుగొన్న
ట్లున్నది! నాయోచనాశాఖలన్నియును ఒక్కదీనమగు మోపుగా కట్ట
బడియున్నట్లున్నవి......ప్రతివిషయము స్వప్నమురీతి నున్నది....
నాకును, నాకార్యమునకును అవసరమగు వెలుతురును వ్యసనగర్భము
నుండి బదులుతెచ్చుకొనువరకు నన్నేడ్వనిమ్ము.........నిన్న రాత్రి

భీష్ముడు

మీరింట్లోలేనప్పుడు భీష్మా! నాగదిలో నాకు కనబడెను. వానిబుగ్గలపై ఆరోగ్యము వికసించియుండెను. ఆచిన్ని చొక్కాయ ఘగము తొడుగుకొని తప్పటడుగులతో నాబిడ్డ లోపలికివచ్చి తనతల్లి పడుకొనియుండిన పడుకదగ్గరకు వచ్చెను. వచ్చి తన రెండుచేతులను చాచి నాడు నాబిడ్డ! తన తల్లిపేరు పిలిచి ఒక్క చిరునవ్వు నవ్వినాడు! లాలించి యెత్తి ముద్దాడుమని బ్రతిమాలుచున్నట్లుగ...... అయ్యో! నాకు వణకుపుట్టినది. అవును నేనుచెప్పను.

భీష్ముడు

సుధా!......

సుధ

అవును! మాబిడ్డ మట్టిలో గలసిపోయినాడు! చలి మానాయనకు శల్యములుదాక అంటిఉంటుంది. ఇప్పుడు పండుకొనిఉండేచోట- బయట అక్కడ ఒంటరిగా!......

భీష్ముడు

ఆచలినేలలో పడియుండునది శవముమాత్రమే. మనబిడ్డ, వాడు స్వర్గమున సౌఖ్యముగా నున్నాడు.

సుధ

(వానినిజూచి భయకంపితయై) అయ్యో! రక్తముస్రవించుగాయమును మరల రేపుచున్నారు. నాపరితాపమును డెబ్బదింతలుచేయుచున్నారు. మీరు కఠోరముగా శవమనిపిలుచునదియే నాకిప్పటికిని నా ముద్దుల తండ్రి. ఆత్మ దేహము ఒకటియే. ఇచ్ఛయున్నను మీవలె వానినివిభజించి నేను చూడజాలను.......రెంటికిని నా హృదయమున తావున్నది. స్వర్గమున మహోన్నతుడైయున్నను, మంచములో లోతుగాప్రూడి

భీష్ముడు

పోయియున్నను నాకు తెలిసిన నరేంద్రుడుమాత్రము, నానరేంద్రుడు ఒక్కడే!

భీష్ముడు

ఇప్పటికి సగముమానియున్న గాయము లనేకములు నీకు స్వస్థతగలుగులోపుగ మరల నధికముగా రక్తమును గ్రక్కవలసి యుండును.

సుధ

కొంచెము ఓపికమాత్రము పట్టండి. భీష్మా! కూడా వచ్చెదను; తరుమకండి. ఆదేమేలు. నాసమీపముననేయుండి మీరెరిగినవాటిలో సౌమ్యతమమగు మాటలతో నాకుధైర్యము కలుగజేయండి. మేఘగంభీరస్వరముతో మాట్లాడుమీరు ఒకఆత్మ శాశ్వతకర్మ నిర్దేశించుటకు కట్టకడపటిసాంచిక వేయుక్షణమున ఘోరమగు నామహత్తరుణమున మీరు సౌమ్యస్వనముతో మాట్లాడజాలరా! బాధాప్రథమోద్రేక విజృంభణముల శాంతింపజేయజాలరా? నిశ్చలతేజో లేశముతోనైనను నిశీథమునకు సంతసముగొల్పజాలుమాటయే లేదా? భగవంతుడు సింహాసనాసీనుడగు సార్వభౌమునిరీతిగ నుండునని మీ రెరిగినది, మీరు బోధించినది. విస్పష్టములగు ఒకతల్లి దీనాలాపములతో అట్టివారి సాన్నిధ్యము నపేక్షించుటకు అబ్బా, ఎంతధైర్య మనపరము!

భీష్ముడు

మీరు ఇంతకుముందు పూజించుచుండిన దేవుని దరిజేరుట తేలికగనే యుండునా?

సుధ

ఆవైపు నేను ముఖమే పెట్టను. ఆఁహాఁ.....అయినను నాభావములు ఒక్కొక్కవేళలో నన్ను వంచించుచున్నవి. వెలుతురు పగలు ఉండు

రాత్రి

భీష్ముడు

చోటునుండి నన్ను దొంగతనముగా పంపివేయుచుండును......'ఎత్తుట కెంత తేలికయో భరించుట అంతభారం' అదేకదూ ప్రాతసామెత! మీ విశాలదేశములు నాఆత్మ కతీతములు; అందకున్నవి. ఇచ్చటనుండువస్తువులన్ని యీనాచిత్తము చెదరునట్లు ఒనర్చుచున్నవి. మీరు నిర్దిష్ట కార్యము మీపథము, మీగమ్యము, మీసంకల్పము, మరీ మీ మార్గములు సర్వమూ, ముందుకు వంగియున్న యీపర్వతము, మనముచరించు మార్గము నవరోధించు యీఏరు, సమరము, అంధకారము, సృష్టి అన్నియూ ఘనతరములు —దేవాలయము ఒక్కటి మాత్రము చాలా చిన్నది.

భీష్ముడు

(రాపడి) ప్రతిచోటను నాకగపడు ఆభావమేనా యింకా? అదిగాలిలో తేలియాడుచున్నదా?......ఎందువల్ల చాలా చిన్న?

సుధ

(ఖిన్నయై తలనూగించుచు) నేను చెప్పజాలను. కార్యకారణములను సరిగా యేర్పరచజాలను; యోచనలు భావములు గాలిలో కొట్టుకొని వచ్చు వాసనవలె తేలివచ్చుచుండును, పోవుచుండును; ఎచ్చటనుండి అదివచ్చినది ఎచ్చటకేగునది నేనడుగను. ఇదిమాత్రము నాకు తెలియును. దీనిని జ్ఞానమని పిలువజాలను—కాని దేవాలయము మాత్రము చాల చిన్నదని నాభావము.

భీష్ముడు

జనుల యీస్వప్నములో నేదియో మహత్తరమగు దృశ్యము గలదు. ఒక్క భావమునే నూర్లకొలది మనుజులమాటలలో కనిపెట్టితిని. వైకల్యచిత్తయై పర్వతారణ్యముల చరించుచుండినఆమెగూడ దీనిని తన కేక

లకు మకుటంగా వేసుకొన్నది. 'ఇది చిన్నదిగాన అసహ్యము' అని ఆమె పాట. తన భావముల హేతుపూర్వకముగా ననుమానించు శక్తియే ఆమెకు లేదు. అప్పటినుండి నూర్లకొలదిమంది ఇదేమాట! 'అది చాలచిన్నది, మా దేవాలయము చాల చిన్నది' అనుటయే. ఇవి ప్రొద్దుపోక మాట్లాడి నవిగావు; పిచ్చికేకలు గావు. ఇంకనూ యేదియో గూఢముగ నుండ వలయునని దీనిభావము. అవును. మనభగవంతుని లోకభవనము కావ లయునను కోర్కెను సూచించుచున్న దీకేక. సుధా! ఆఁ, నాకంతయు గోచరమగుచున్నది. భగవంతుడు నాకు దారిజూపనంపిన దివ్యతారాల వే నీవు. దారితెన్ను గానక కునుల గమనించలేక కష్టముతో తడుము కొనుచూ నేను చనియెడి యీమార్గమును చీకటిలో సహితము నిశ్చయ ముగా తప్పిపోకుండా నీవు చూపగలవు. అనృతతేజము నిన్ను దుష్ప థానువర్తిగా చేయజాలకుండెను. ప్రారంభమునుండియు నాకర్మక్షే త్రమువైపు స్పష్టముగా చూపుచునే యుంటివి; అదివవలి పక్షబలము కలిమి ఆకసముదాక నేను విజృంభించినప్పుడు నన్ను నిరోధించితివి; నిరోధించి నాచాంచల్యనేత్రముల నింటివైపు, ఆత్మవైపు, లోపలికి త్రిప్పితివి. మరియొకసారిగూడ నీ పెదవులు పలికిన ఒకమాటవలన తేజము ప్రస్ఫుటమయ్యెను. దుష్పథముల చరియించుచుండ నాకు దారిచూపితివి; యోచనాంధకారమున భ్రమ్మరుచుండ వెల్తురునొసంగి తివి. అవును; మనదేవాలయము చిన్నదే! కాని వేచియుండుము; అది ఘనతరముగ పునఃప్రతిష్ఠింపబడగలదు. నీమూలమున నాకు సర్వేశ్వ రుడు ప్రసాదింపనెంచిన దంతయు నాకిప్పుడు చాలాస్పష్టముగా కన బడుచున్నది. నేనును నీవలెనే 'నన్ను వదలకుము, నన్ను వదలిపెట్ట కుము' అని బ్రతిమాలుకొనెదను.

సుధ

నాకన్నీటిని ఆర్పివేసెదను. ఒక్కపెట్టున శోకాంధకారములనుండి విముక్తురాలనయ్యెదను! ప్రతిద్వారమును తన స్మృతిపథమున నున్న వాని నన్నిటిని పూడ్చివేయ నేర్చుకొనువరకు నా హృదయమునకు తాళమువేసి బిగించెదను! నాఏద్పునకును, నాకును మధ్య విస్మృతిఅను వారాశి నుంచెదను; నాచిన్నిచిత్రమునుండి తేజోవంతమగు ఆచుక్క నొక్కదానినిగూడ దయాశూన్యురాలనై కొట్టివేసెదను; హృదయ పూర్వకముగా మీకు సహాయనై మెలగెదను.

భీష్ముడు

మార్గము చాల దీర్ఘమైనను గమ్యస్థానము మహోన్నతము.

సుధ

భీష్మా! నన్నుతరుముటమాత్రము మానవలెను.

భీష్ముడు

నేను భగవంతునాజ్ఞను వచించువాడనుమాత్రమే.

సుధ

తడబడుచుండు సంకల్పమును వారు సర్వమూ నెరవేర్పజాలకున్నను త్రోసిపుచ్చరని నాకు మీరే నేర్పితిరి; ఆయన ఆజ్ఞ నేకదా!

[పోవుటకు తిరుగును.]

భీష్ముడు

పోవడమేనా?

సుధ

(మందస్మితముతో) పండుగకుగా చేయవలసిన నాగృహిణీ కృత్యముల యెడ అలక్ష్యముంచరాదు. పోయినసంవత్సరము, మీకు క్షిప్రియం

దున్నదా? 'ధనవ్యయి' అని మీరు నాకు పెట్టిన పేరు. ప్రతిదీపమూ వెలుగుచుండెను. ఆటవస్తువు లచ్చటనుండెను. అంతా శృంగారము. పండుగనాడు ఇంటి నెట్లా అలంకరించితిమి? ఆరాత్రి ఉల్లాసముగా నవ్వుచూ పాడుచుంటిమి......భీష్మా! యీయేడు గూడ మనము పండుగ చేస్తాము యీమహాశాంతపు పర్వదినమున మనయిల్లు కలకల లాడునట్లు ఒనర్పవలెను. అన్నియు బాగుగ నలంకరించి ఒకవేళవచ్చి తొంగిచూచినయెడల భగవంతునికి అకలుషితాత్మ యగు పుత్రియు నిష్కళంకుడగు పుత్రుడును, దైవభక్తియుతులు కన్పించవలయును. అప్పుడు తండ్రిదోషమునకై మనల పూర్తిగ తెగనాడజూడకుండవల యును. దుఃఖచిహ్నము యిప్పు డెచ్చటనున్నది?

భీష్ముడు

(గాఢాశ్లేష మొనర్చి మరల వదలి) బాలా! వెలుతురును తెమ్ము; అది బాగా నీకు తెలుసును.

సుధ

(దీనముగా మందస్మితముతో) పెద్దదేవాలయమునుగట్టింపుడు. అయితే, ప్రాణప్రియా! వసంతము వచ్చులోపలనే కట్టింపుడు. [పోవును.]

భీష్ముడు

(ఆమె పోయినవైపు చూచుచు) సంసిద్ధము; బలిపీఠము నధిష్ఠింప సంసిద్ధురాలు! (మతిమునకై) మహాగ్నిజ్వాలలోనురుక సంసిద్ధురాలు! శక్తి తగ్గుచున్నదా? ఆత్మ తడబడుచున్నదా? విరిగిపోయిన పోవునుగాని వంగదు! ఓ సర్వేశా! నీబలము నామెకు తోడుగా బంపుము! నాచేత మాత్రము యీకఠోరకార్యమును చేయింపకుము. శాసనక్రూరభయంకర గృధ్రిమునై ఆమె కోమలహృదయమును జీల్చి హృదయరక్తము నం

తియు ద్రావి పీల్చి పిప్పిచేయుకార్యము నాపై బడకుండ అనుగ్రహింపుడు!........బలము, ధైర్యము, సాహసము సర్వేశా, నాకుగలవు. యిద్దరిభారమును నన్నే మోయనిమ్ము ఆమెయెడల మాత్రము కరుణానుగ్రహమును చూపుము.

[తలుపుతట్టిన శబ్దము-కొత్వాలు ప్రవేశించును.]

కొత్వాలు

నేను పూర్తిగా ఓడిపోయినాను.

భీష్ముడు

అది ఎట్లు?

కొత్వాలు

నన్నోడించినది మీరు. బహుశా మీకు జ్ఞాపకం ఉండవచ్చు;పోయిన ఎండాకాలం మిమ్ములను ఇక్కడనుండి లేవదీసి పంపివేయాలని నేను పూనుకొనుంటిని. అప్పుడే ప్రారంభమైనా యీఉద్యమంలో మీది పైచేయి కాజాలదని నేనూహించి ఉంటిని.

భీష్ముడు

మరి యిప్పుడు?

కొత్వాలు

నేనెంత న్యాయపథంలో ఉన్నా సరే; యీసమరం ఇక సాగించను.

భీష్ముడు

అందుల కేమికారణము?

కొత్వాలు

ఎందువల్లంటే యిప్పుడు చూడండి. అధిక సంఖ్యాకులు మీచేతనున్నారు.

భీష్ముడు

నాతో నున్నారా?

కొత్వాలు

అది మీకే తెలుసు. నాకు సందేహమే లేదు. దొడ్డిన డొంకన దారిన వచ్చి జనమంతా మీదగ్గర మూగుచున్నారు. చుట్టుప్రక్కలా ఒకఅభిప్రాయం ప్రబలిఉన్నది. అది నాదారిలోనుంచి రాలిపడేది కాదని దేవుడే ఎరుగు. అట్లుండటంవల్ల మీరే దానికి స్వాములని ఊహించుటకు ఎక్కడనుంచో శాస్త్రజ్ఞుడు రావలసిన అవసరం లేదు. రండి, ఇదిగో నాచేతులు. అయ్యా! మనము స్నేహితులుగా ఉందాం.

భీష్ముడు

మన యుద్ధమువంటి యుద్ధము యెన్నటికీ ముగియదు, ఒకవైపువారు శస్త్రసన్న్యాసమొనర్చినాగూడ.

కొత్వాలు

మీ కింకేమి కావలయును? మంచిపరిహారములు, శాంతి స్నేహ భావములు. ఇంతకంటె నేనేమి కావలెనని నాగజేముడు త్రొక్కి కష్టపడే మనిషినిగాను. ఇరకాటంలో చిక్కుకొన్నప్పుడు అందరి ప్రవర్తన ఒక్కరీతిగానే ఉంటుంది. మరిఒకరివక్షస్థలమునకు కత్తిమొన తాకునప్పటికి ఇంకొకడు కాళ్లకు బుద్ధిచెపుతుంటాడు. జంకిపోవలసిన సమయ మెరిగినమనిషి తన దుడ్డుకర్రకు బదులు విరోధియీటె ఎత్తటం చూస్తూనే పరుగెత్తిపోతాడు. మరి ఒంటరిగా సమరరంగమున చిక్కుకొన్నప్పుడు వివేచనాజ్ఞానము లొంగిపొమ్మని హితబోధ చేస్తుంది.

గాబ

భీష్ముడు

ఆలోచించగా యిచ్చట ఉండేవి రెండు విషయములు; మొదటిది: మనలో నేను బలిష్ఠుడను; నీకు తెలియును. నాలెక్కలో ఎక్కువ మందిగూడా ఉన్నారు—

కొత్వాలు

అది వాస్తవము; గట్టిమాట.

భీష్ముడు

అదియే నిజముగా ఉండవచ్చును. కాని ఆమహానివేదన మొనర్చవలసిన ఆకడపటిదినమున సర్వేశ్వరుసన్నిధానమున ఎవరియుద్యమము విజయము గాంచగలదు? అనునదియే ప్రస్తుతవిషయం.

కొత్వాలు

ఒకఅర్పించేదినమా? మీరు చాలాదూరం చూస్తున్నారు. ఆదినం పంచాంగాలలో లేదు. అదివచ్చినప్పటికి మనమింత భయపడుతున్నాము గాని మనచేతులో డబ్బుంటే అంతా చక్కబడుతుంది. మతములలో దయార్ద్రత కనుపించవలె. అదీ ఇప్పటిమోస్తరు. పూజాపీఠమంటే డబ్బులేసిపెట్టడానికి ఉపయోగపడే ఒకపదార్థం. అదిమనలో అమిత భక్తిఆవేశపరులమతము! ఇందులో నాకు సంకటమైన ఒకవిషయం ఉన్నది. అన్నిటితోగూడా యీదయార్ద్రత అనేతత్వముగూడ నేను బోధించితిని. త్యాగమును ఒకమూలగూర్చుండబెట్టి మీరన్నట్లుగానే ఒకవిధంగా నేను దీనికి స్వాధీనుడనై పోతిని. ఏయే యుద్యమముల కొరకు నేను తంటాలుపడుచున్నానో వాటికొరకు స్వల్పంగానైనా కృషిచేస్తునేయున్నాను.

భీష్ముడు

మీరు న్యాయంలోనే ఉన్నారని చెప్పుతున్నారు. మరి యిప్పుడు నాకు ఏమీతోచకుండా ఉన్న ఒకవిషయం అట్లనే అయితే మీరు నాకు లోబడిపోవుట కెట్లు తెగించెదరు. ఇది తెలుసుకొనుటకు నా మనసు అమితంగా ఉవ్విళ్లూరుచున్నది. తన నిర్దిష్టకార్యనిర్వాహణము నకే మనుజుడు సృజింపబడియుండుట. తన నివాసమునందలి స్వర్గము అదియే. తనకర్తవ్యమునకును తనకును నడుమ సముద్రము పొంగివచ్చి నను ప్రక్కనే నరకలోకపురేవు ఉన్నను అతడు వెనుకంజవేయరాదు. 'ఇక కష్టపడజాలను; నాపని అయిపోయినది; ఇదిచూచుటకు చాలా బాగుగా నున్నది; కాన నరకములోనే యుండెదను; అని అతను శేక లిడతగునా?

కొత్వాలు

ఇందులకు ప్రత్యుత్తరము 'అవును కాదు'అని ఒకసారి కట్టుకొని కద లనే వలయును. ఇంకొకసారి వెనుదిరుగవలయును. ఈకాలంలో జను లు అలభ్యమైన వస్తువులకొరకు ఊరకే ప్రయత్నించరు. మనమేది చేసి నా దానివల్ల మనకు ఫలితము కలుగవలయుననియే మనము కోరు తాము. ఇందులకు సందేహమే లేదు. ఒకసారి యుద్ధమునకు తలపడి ఓడిపోయిరా! వారి తరణోపాయము నైపుణ్యము.

భీష్ముడు

నైపుణ్యము తెలుపును నలుపు చేయజాలదు.

కొత్వాలు

మిత్రశ్రేష్ఠమా! ఒకవస్తువు తెల్లనిదని నిర్ధారణచేయుటవలన ఉపయోగ మేమి? పట్టణమంతా ఒక్కగొంతుతో 'అదినల్లగాఉన్నది; నల్లగా... మంచువలె' అని ఊండేటప్పుడు.

## భీష్ముడు

అందువల్ల మీరు దాని పక్కతాళం వేస్తారు.

కౌత్యాలు

కాదుకాదు. నేను చెప్పేది నల్లగాలేదు కాని...... తెలుపు కలిసిన గోధుమవర్ణమని. భూతదయతో ఉన్నది యీదినాల్లోపనంతా. జనులు ఒకరినొకరు మార్గమధ్యముననే సతిఅనుకొంటారు. కంఠమూ మకొని ముద్దులవలె ఒకరినొకరు డీకొనరు. సగటునచూస్తే మనము స్వతంత్రజనులము. ఇక్కడ ఎవ్వడుగాని మరొకడికి తీసిపొయ్యేవాడు గాడు. ఒకరిఅభిప్రాయము ఇతరులదానితో సమానంగానే ఉంటుంది. ఒక వనుకొనే అభిప్రాయాలనన్నిటిని తెలుపునలుపు అనేప్రశ్నలలో చొప్పించడం ఎందుకు? .....ఇంతెందుకు? తలల లెక్కనుబట్టి వీరే న్యాయంలో ఉన్నట్లు తేలుతున్నది; అందువల్ల తక్కిన అందరివలెనే నేను నే నెరిగినంతబాగా మీకు చేతు లొగ్గెదను. నాసొంత ఉద్యమమును వీరే నిరసించినందులకు అవమానమును భరింపవలసి ఉండదని నా నమ్మకం. ఈమధ్య కొన్నిదినాలుగా జనులు నాకృషి చాలా నీచమని, స్వల్పమని భావించుచున్నట్లు స్పష్టంగా తెలుస్తున్నది. ముఖ్యావసరముక్క ఆ ఒక్కవిషయం| మనప్రతి సంవత్సరపు మహాసిూలు లెక్కలేకాదు, అంతకంటె ఘనతరముగ గన్పించుచున్నవి. ఇప్పుడు నేను చందాలుకోరినప్పుడు వారివారికి తోచినంత [illegible] ఇక్కడుగూడ సంసిద్ధులుగా రావటంలేదు. సంపూర్ణప్రాధాన్యం ఉంచి మొదల చేసినప్రతిపనియూ వ్యర్థమే. తరువాత ఎంత ప్రార్థించినా ప్రయోజనముండదు. జలదార్లు బాగుచేయుటకు, [illegible]మృతులకు నాతుద్దేశ్యములను ఏర్పాటులను పట్టిపంపినయెడల [illegible]న్యము

నకే మోపగుచుండుటచే బూడిదలోపోసిన పన్నీటివలె వ్యర్థమగు చున్నది ఇవి ఇట్లాటివి. అనేకములు పూర్వంవాళ్లు ఇష్టపడినవిగూడ మూలబడుతున్నవి. అయితే, స్వామి ఎంత తక్కువచెప్పితే అంత త్వర గా మారిపోతుంది. జయించజాలనప్పుడు ప్రతివాదును లొంగియే తీర వలయును. జనులమర్యాద ఇప్పుడు నేను పోగొట్టుకొంటిని అనుట స్పష్టమే. అదియూ నాకిచ్చట దొరకనో అమార్గమున నే పోయినది. మంచిది; మంచిది. ఇప్పుడు దీనిని మట్టిపోవలయును; పోయి మరల దానిని నావశము చేసుకొనవలయును

భీష్ముడు

అయిన మీ తెలివి తేటలు దానధర్మములు, పేరుప్రతిష్ఠలకొరకేనా విని యోగించితిరి!

కౌశ్యాలు

స్వామీ! కాదు. నావలన తప్పిదమేమియు లేదు. పరమేష్టిలాభమే నా ఆదర్శము; ఇరుగుపొరుగుజనులకందరకు సౌఖ్యము కలిగించుటయే కాని యీవిషయంలో నాపురోభివృద్ధికి వలయునోచన బొత్తిగా లేదని మాత్రము చెప్పజాలను. పనిదినములలో బాగుగ పనిజరిగినందులకు అభినందనములు, బహూకృతులు, వీనికొరకు కొంచెము నిరీక్షించితిని. బలముండి మెదడుగలప్రతిమనిషీ సనష్టములకు ప్రతిఫలముచూచియే తీరును. ఉత్తరఅభిప్రాయము కొసరం దాని పూర్వోత్తరముల బాగా తెలుసుకోకుండా అష్టకష్టాలుపడి భారమంతా మోయుదు. ప్రపంచ మునకు దానిమేలుకొరకు నాస్వంతసంగతిని మరచి నా శక్తియుక్తుల ఋణముగా ఇవ్వవలసిన అగత్యం నాపైన నిశ్చయంగా లేదు. నన్నే నమ్ముకొనియుండే కుటుంబం ఒకటి నాకున్నది. ఒక భార్య, లొమ్మం డుగురు కొమార్తెలున్నారు. వాళ్ల బ్రతుకుతెరువు ముందు యోచించవ

వలె. భావములు ఎవరిదాహముునుగాని తీర్చజాలవు. భావములు ఆహార పదార్థములు కాజాలవు; నావలెనే మీకు కుటుంబమేర్పడి తే, అయ్యా, అప్పుడు ఎవరైనా ఒకడు వచ్చి ఇందుల కాశ్చర్యము సూచించిన యెడల నాప్రత్యుత్తర మిదియే. "ఆమనిషి గృహస్థుడు కాడయ్యా" అని.

భీష్ముడు

ఇప్పుడు మీసంకల్పము?—

కౌత్సాలు

రాళ్లు, సున్నము.

భీష్ముడు

ఏమీ, కట్టెదరా?

కౌత్సాలు

మీరు సహాయులుగా ఉన్నచో నాకును మనయిరుగుపొరుగువారికిని మేలు కలుగునట్లు చేయవలెనని. మొదట నాప్రఖ్యాతికి, నాకృషికి తగుగౌరవము యీమధ్య కొంచెము తగ్గిపోయియున్నది. దానినిబాగుగ నిర్మించుకొనవలయును. ఎన్నికలకార్యము సమీపిస్తున్నది. అందువల్ల ఏదైనా ఘనకార్యానికి పూనుకోవలె. జనులందరూ దాన్ని గూర్చిరేమే మాట్లాడుకొనునట్టిగ యేదైనా ఒకటి చేయవలెను. నాప్రతిపక్షుల నందరిని వెనుకను నెట్టివేసి ముఖ్యముగా గూర్చిరేమే ఎల్లప్పుడూ మాట్లాడుకొనునట్లు ఏదైనా ఒనర్చవలయును. కుదురుగా వృద్ధికి రావలెనన్నచో మనిషి ప్రవాహం ఎట్లు పారుతుంటే అట్లే పడవ నడిపవలెనని నా అభిప్రాయము. ఇప్పుడందరూ ఔన్నత్యము, ఉన్నతి అనేపిచ్చిలో పడిఉన్నారు. అక్కడ నాకు అభ్యంతరాలు కలుగుచున్నవి. నాకు సాధ్యమైనదంతా జనాన్ని వాళ్లకాళ్లమీద నిలబడేటట్లు చేయుట మాత్రమే. నాప్రోత్సాహకులుగూడ అందరూ వైరివిధవలై

భీష్ముడు

పోతుంటే పైపనిగూడ మనఃపూర్తిగా చేయడానికి సాధ్యముకాకుండా ఉన్నది. ఇట్లా ఒకటి పొయ్యేతలికి ఒకటి పిగులుతూ నా మెదడును చీకాకుచేస్తున్నవి. అందుకుదోడు ఇక్కడి మాదరిద్రం ఒకటి; ఏంచెయ్యను?

భీష్ముడు

దీనినంతయూ బాగుపరచగలుగుదునని తలచెదరా?

కొత్వాలు

ఆఁ, ఆఁ, కాదు. అట్లు నేనెప్పుడు తలచను. అది సంఘమునకు నైజమైనలోపమే; అక్కడెప్పుడూ ఉంటుంది. దాన్ని మనము ఊరకే సహించియే తీరవలయును. ఐనాకాని, ఏదైనా నైపుణ్యము గలమార్గముపయోగించితే దానికి హద్దుపెట్టవచ్చు; తగ్గించవచ్చు; మనఇష్టము కాల్వలలోనికి తిప్పవచ్చు. న్యాయశాస్త్రవేత్తలు ప్రతివాదినోటా 'లేమియే నేరములకు శ్రేష్ఠతమమగు సత్తువ' అనుమాట వినవస్తున్నది. నేను దానిని అరికట్ట జూతును.

భీష్ముడు

కాని, యెట్లు?

కొత్వాలు

ఆఁ, మీరు ఊహించండి చూస్తాం. దీర్ఘకాలమునుండి ఉన్న అవసరమొకటి యిప్పుడు తీర్చబడగలదు. దేశమంతయూ దానివల్ల సౌఖ్యము ననుభవించగలదు. ఒక అన్నసత్రమును కట్టుటకు నాకు ఆధారము దొరకితే లంఘురుఖానా అయినా పరవాలేదు. మీకు అదే యిష్టమైతే అది నేరములబీజముల హతము చేయగలదు. ఈకట్టడమును చెరసాలనుకూడ కలిపి కట్టితే బాగుంటుందని నామనసులో ఉన్నది. అట్లుచేస్తే కార్యమును వానికారణముతో కూడ చాలసులభముగా కలి

వినవాళ్లమవుతాము. అవే కమ్ములలోనే గట్టిగా బిగించి ఆకొట్లకు మధ్య ఒకగోడ అడ్డం అంతే. తరువాత నే నాపనిమీద ఉండేటప్పుడు దాని కింకొకరెక్క గూడ కల్పవలెనని యోచన; ముఖ్యముగా ప్రజాహితకార్యములకనియే......కాని దానితో సమానంగా విందులు, ఉత్సవములు వేడుకలకుగూడ అతిథులకు గదులు, ఇంకా అటువంటివస్తువులు. వీటినన్నిటిని కట్టి ఒకసభావేదికతో పూర్తిచేసేది. ఒకమాటలో దాని కొకపేరు పెట్టేది. ఒకచిన్నరాజకీయ ప్రతిష్ఠాపన.

భీష్ముడు

అన్నియూ ముఖ్యావసరములే అయినను యీజాబితాలో ఇంకొకంటెనూ అవసరమగుదాని నొక్కటి చేర్చగూడదా?

కొత్వాలు

ఆఁ! శరణాలయమనికదా మీరు సూచించేది నిశ్చయము, నిశ్చయము. అదే నామొట్టమొదటి సంకల్పము, కాని నాస్నేహితుల నడుమగా నా పూర్వపురుషోద్దేశము స్వప్నమువలె మాయమైపోయింది. అంతపెద్దపని తలపెట్టి నిర్వహించుటకు అవకాశము ఎచ్చట దొరకగలవు? అది నిశ్చయంగా చాలా పెద్దమొత్తం హరిస్తుందని మీరే ఒప్పుకొంటారు. అర్హతకు వలయు చిహ్నము చూపగల ప్రతిమనుజునకూ అచ్చట స్థలముండునట్లు ఏర్పాటు చేయవలయునంటే, దానిని కట్టించేది ఒక్కరికోసంమాత్రమే కాదు; మనము లేక లేక మూలకూర్చున్నప్పటిస్థితిమీద గూడ ఒకకన్ను ఉంచియే చేయవలెను. విషయాలు వాలిఅంగలవలె అతిత్వరితంగా ముందుకు జరిగిపోతుంటవి. ప్రతిసంవత్సరము దీనిని క్రొత్తగా పెంచి కట్టవలసివస్తుంది. మనదేశావసరాలు ఎంతవిపరీతంగా

గాలి

భీష్ముడు

పెరిగిపోయివున్నవో మీకే కనబడుతున్నదిగదా! మనము యోచించగల ప్రతివిషయంలో అభివృద్ధి శరవేగంతో అయిపోతున్నది. అందువల్ల ముందురానున్నవారికి ప్రపంచంలో అందరికి, వారిభార్యలకుకూడా స్థల మేర్పరచి ఉండవలెనంటే మొదటికే మోసమవుతుంది. అందువల్ల నే నిప్పుడు చెప్పేదేమంటే: ఆపని వదలుకొందామని. పర్యాయాలు రాజ్యంచేసే యీదరిద్రప్రదేశంలో మన మంతకంటే చేయగల్గునది ఏమీ లేదు.

భీష్ముడు

ఎవరైనా వృద్ధివాడు వార్ధమీరిపోతుంటే ఆపెద్దభవనము ఉపయోగం ఉంటుందిగదా!

కొత్వాలు

ఆరే, బడేనౌజవన, అంనుకుపగ్గెలెస్తుంది, చాలాదినాలు ఆవిఖాళీగానే ఉంటుంది కాబట్టి
మనభవనము మనకు శీఘ్రకాలయుముగ నుపయోగించుకొనుటకు, లేకున్న వచ్చినట్లు అనుకోవచ్చు. మన దేశప్రస్వరములో మిళితమైయున్న ప్రతిముఖ్యపదార్థమును ఒకే యింటిక్రిందనే, ఒకటే ధ్వజముక్రిందనే, ఒక్క కేంద్రస్థలమునకు తెచ్చుకొని రావచ్చు. దీనికి తోడు బీదల సమూహములు వెల్లువెత్తివచ్చు దుష్టుల నిరోధించువారు లేక యిష్టము వచ్చినట్లు చరించు పిన్నివారల — చెపట... మనప్రజాస్వాతంత్ర్య ఫలముల — ఉద్రేకపూరితోపన్యాసములు, ఎన్నికలకొరకు కొనర్చు పనులు; నగరాభివృద్ధికి పలయుద్యమముల ప్రారంభించుటకు సభాభవనములు; బహిరంగోపన్యాసములకు, జనులజన్మస్వత్వములగూర్చిన ప్రతిజ్ఞల నొనర్చుటకు స్థలము; అన్నీ.—ఒకసారి యీయేర్పాటు విజయవంతమైనచో కృష్టకీవులను నిచ్చుటే ప్రజలకు మన మివ్వగలిగి

నంతలో జీవితముల నష్టమొనరింపజాలు నష్టములెల్ల లభింపగలవు. మానవప్రయత్నము చాలకోలదియని భగవంతుడే ఎరుగును. అయినా ఒక సారి దీనిని కట్టినామంటే మనకెల్లా సామాన్యమైనదే అయినా నా, ఏర్పాట్లుమాత్రం సమగ్రంగా ఉన్నవని చెప్పుకోవచ్చు.

భీష్ముడు

అయితే ద్రవ్యం సంగతేమి?

కౌశ్యాలు

ఆఁ అక్కడనే ఉండేసంకటం ఉద్వేగ ప్రతివర్గానికి కుంపకట్టు బల్లసంగతి ఎత్తితే మనుష్యులు వెనకపడతారు మీసహాయం లేకుంటే యీపని మూల పడియుండవలసిందే. నేనూ డబ్బు ఎత్తవలసి యుంటుంది. మీరుగాన నాకు సహాయులుగా, ఉపన్యాసకులుగా, ఉంటే అన్నీ ప్రవాహమువలె సాగిపోగలవు; ప్రయత్నం పూర్తి అయినతర్వాత నేను మీసహాయమును మరచిపోను—నాసంగతి కనిపెంచండి.

భీష్ముడు

అంటే, నన్ను కొనివేయవలెనని ఉన్నారన్నమాట

కౌశ్యాలు

నావిన్నపము వేరువిధముగా తెలియజేయవలె. ఇద్దరిలాభముకొరకు అని—విషయము రెండువిధాలుగా ఉన్నది—మనకు నష్టము కలిగించిన దేశభావములు అనుఅగాధమునకు (అందుకు ఇద్దరమూ బాధ్యులమే) స్నేహాకీత్యా ఇతరత్ర నంతెనకట్టి కప్పివేయవలెనని

భీష్ముడు

మీ కిది మంచిశరణము కాదు—

భీష్ముడు

కౌశ్యాలు

అవును; వినియుంటివి, వ్యసనకరమగు మీపుత్రునిమరణవార్త. వినియూ, నేను పొరపాటు పడితిని; ఇందులకు మీమగటిమియే కారణము... యీస్థానికముఖ్యావసరములవలన......

భీష్ముడు

ఆనందములో నున్నను, దుఃఖములో నున్నను అవసరములో సదా సంసిద్ధుడనేఅని నానమ్మకము. ఇప్పుడు నేను పలికినది ఇంకొక న్యాయసమ్మతమగు ఉద్దేశ్యమునుగురించి.

కౌశ్యాలు

అది!

భీష్ముడు

నేను నిరర్థప్రయత్నాలలోనే ఉన్నాననుటయే.

కౌశ్యాలు

మీరా? నావద్దనుండి యీవుద్దేశ్యమును దొంగిలించెదరా ఏమి?

భీష్ముడు

ఆ ప్లెన్నడును జరుగదు; (కిటికీగుండచూపుచు) కౌశ్యాలు గారూ, మీకు కనబడుచున్నదా!

కౌశ్యాలు

ఏమీ!

భీష్ముడు

అది!

ఆట్లా

భీష్ముడు

కౌశ్యాలు

ఆమిద్దెకగురుగా—అదియా — ఆ పెద్ద బ్రహ్మాండదారుగృహము. అపవ్యాంగా—సర్వకర్తలవులకు కొట్టం.

భీష్ముడు

ఆచిన్నది, వికారంగా ఉన్నదే అది.

కౌశ్యాలు

దేవాలయము !

భీష్ముడు

(తలయూగించుచు) దానిని పెద్దదిగా కట్టించెదను.

కౌశ్యాలు

అహో, వద్దు—అట్లాంటిపాపపుపనికి ఒడికట్టబోకండి. దానితో నాయుద్యమము మూలబడుతుంది. వ్యవధిలేదు; నాకార్యము ఆరంభించవలసినస్థితిలో ఉన్నది. ఇది దాన్ని కీలాభిలంచేసి వేస్తుంది. మానుకోండి!

భీష్ముడు

ఇప్పటివరకు నేను లోపడ్డది లేదు.

కౌశ్యాలు

లోపడి తీరవలెనండి. నా ప్రతిష్ఠాపననే కట్టించండి. సత్రము, లంగరుఖాన—కారాగృహము మీ అభిరుచికింపగురీతిగా వాటికి నామకరణం చేయండి—ఉన్మత్తశరణాలయము—కట్టించండి. దేవాలయము నుమాత్రము ఉండనీయండి! అట్లాటిమాట లాడకండి! మాకు బాగానే ఉంటూవుండినది చాలులేండి.

భీష్ముడు

ఉండవచ్చును; కాని యిప్పు డది చాలా చిన్నదిగా నున్నది

కౌశల్యాలు

ఇం తెందుకండి? దానినిండుగా జన ముండటం యిప్పటికిచూడ లేదు.

భీష్ముడు

దాని హ్రస్వపరిమాణము ఒక్క ఆత్మనైన నున్నతినొందనివ్వక నిరో ధించుచున్నట్లు తోచుచున్నది.

కౌశల్యాలు

(ఆశ్చర్యముతో తలనాడించుచు,) ఆత్మ కదలక యేల కూర్చుండియుం డరాదు, మేమున్నట్లు! నాళరణాలయావశ్యకత నిదే నిర్ధారణ చేయు చున్నది. (ఎలుగుమూర్తి) దేవాలయము నట్లే ఉండనిస్తురు, ద్రవ్య మైనా మిగులుతుంది. ఏమి? ఒకవిధంగాచూస్తే అది మనకు మిగిలి ఉండే మహదాస్తిగదా! ఆసత్యకాలమునుండి వస్తూవున్న గనిగదా యిది? మననిధిని మీరు ధ్వంసము చేయజాలరు అవును నాసంకల్పము నణచివైచితిరా. పెకల్చుకొని బూదిలోనుండి అభినవజానకీదేవివలె అది యావిర్భవింపగలదు. మాగ్రామపు యీపురాతనసంస్కృతిచిహ్నము కొరకై బల్లెమునుగొని సన్నద్ధుడనై రంగమున నిలిచెదను. సత్యకాల ములో, అజాతశత్రునిదినాలలో, ఇక్కట మ్లేచ్ఛులదేవాలయ మొక టుండెను; మతోద్ధారకుడగు నావహాకూరుడు దానిని ధ్వంసమొనర్చి మహత్తరమగు నీభవనమును ఆచోట కట్టజేసెను; అది వికారముగా కాన్పించుచున్నను తనపురాతనప్రపంచగాథ చుట్టనుకమ్మి వ్రేలాడు చుండి తేజఃపుంజముచే పవిత్రవంతమై యీఘడియవరకు తనశిరము నెత్తుకొనియే యున్నది.

భీష్ముడు

అప్పుడుగాని పురాతనమగు మీసాంఘికశక్తి చిహ్నములనెన్నడో పూర్వమే పూడ్చివేసియున్నారనుట నిశ్చయము. వానిస్మారకచిహ్నా మొక్కటికూడ మిగిలియుండలేదు.

కౌశ్యాలు

అగో దానిపురాతనబలముయొక్క సారము. మామునసబుముత్తాత చిన్న తనంలో ఆగోడలో ఒకరంధ్రం నిలిచియుండేదని ఆయన చెప్పుచుండేవాడు. అది ఎంతోపాతదైనందున భూమిమీదనుంచి మాయమై పోయినది.

భీష్ముడు

ఒకరంధ్రం?

కౌశ్యాలు

ఎంతపెద్దది! ఒకపిపాపట్టేటంత

భీష్ముడు

ఎంతగోడ?

కౌశ్యాలు

పెద్దు, ఆసంగతి అడుగవద్దు, కాని దానిని పడగొట్టాలెననే నీసూచన ఎన్నటికీ కానిమాట అని తెలుసుకోండి. అది చాలాలజ్జాకరమగు కార్యము. రోతపడుతారు. కని విని యెరుగని రాక్షసకృత్యము! మరిన్ని అప్పుడబ్బు— యిక్కడుండేజనమంతా కండ్లుమూసుకొని వారిడబ్బు నిర్లక్ష్యంగా అనవసరమును, ఫలితమునకు రాబోనికార్యా లకై పారవేస్తుంటారని కలగన్నారా ఏమి! సకాలంలో కొంచెం కష్ట పడితే ఖర్చు అధికము గాకుండా దానికి క్రింద పోటీలు పెడితే

ఆపాతదేవళాన్ని పడకుండా నిలుపవచ్చు. మనకాలమంతా కూలిపోకుండా ఉంటుంది......మంచిది; ప్రయత్నం చేసి చూడండి. ఇందువల్ల నాప్రయత్నమే సఫలము కాగలదు.

భీష్ముడు

భగవంతునిగృహనిర్మాణమునకు ఒక్కగుడ్డిగవ్వగూడ ఇతరుల దేబిరింపను. నాస్వంతమునే వ్యయమొనర్చెదను. నాకుసంక్రమించినయాస్తి సర్వస్వము భవననిర్మాణమునకే వినియోగించెదను; నేనొక్కడనే —యిప్పుడు కొత్వాలుగారూ! ఇంకనూ నామనస్సును మార్పింపయత్నమునచేయున్నారా!

కొత్వాలు

(చేతులుజోడించి) నాకు మబ్బులలోనుండి యిప్పుడే వొర్లి క్రిందపడుచున్నట్లున్నది!.....ఇట్టివిషయములు పట్టణములలోనే అరుదు. కాని మనపల్లెలలో సామాన్యావసరాలకే జనులు తడబడుతూ జోలెలు బిగించుకొంటూఉంటే మీరు వాస్తవంలో నదినే మర్లించివారు— నురుగులు గ్రక్కుచూ మెరయుచూ మూరే అడ్డులేనిదనూ నిర్ఝరిణికి త్రిప్పివదలినారు! ...... ఒకటేమాట చెప్తాను స్వామీ, నేను స్తబ్ధుడ్నై నిలబడిపోయినా!

భీష్ముడు

నాహృదయములో ఎన్నడో ఆద్రవ్యమును పరిత్యజించియుంటిని.

కొత్వాలు

అట్లుచేసితిరా? ఆవిషయమునగూర్చి కొన్నిగుసగుసలు వినియుంటిని గాని అవి అన్నియూ ప్రొద్దుపోనిమాటలని తలచితిని. జనులు తమ

సర్వస్వము వ్యయించుట ఏదో తగుపాటి ప్రతిఫలం ముట్టుతుందనే నమ్మకంతో నేకదా!......అదియెట్లయితే నాకెందుకు, ఇది మీస్వంతవిషయము; కానీయండి: ఎక్కడికైనా నేను మి మ్మనుసరించెదను; పని చక్కజేయవలసినది మీరు; మీకు దళబాగున్నది; మిమ్ముల మార్గదర్శిగా నేను నాదారి కమర్చుకొనెదను. స్వామీ, మనమిద్దరమూ కలసి దేవాలయమును కడదాము!

భీష్ముడు

ఏమిరా? మీస్వంతనిర్ణయముల జారవిడిచెదరా!

కొత్వాలు

ఓయి, తండ్రీ! వదలుకోకుంటే నే నోకదున్నపోతును! ఏమనిషి పగ్గరకు జనం పరుగెత్తుకొనివచ్చి మాగుకారనుకొంటారు!—ఒకరు వాళ్లను పొడుసేసి, మేపి బలియైనట్లు చేస్తుంటే; ఇంకొకడు వాళ్లను పీల్చి పిప్పిచేసి పలుచంగా చేస్తుంటే — మీకార్యానికి నేను ముగ్ధుడ నైపోయిఉండకుంటే అంతబట్టు అది నాప్రాణమే అయితే! అది నన్ను బాగా వశపరచుకొన్నది: నా అదృష్టమేదో నన్ను ఈదినం మీ ఇంటికి తీసికొనివచ్చినది. ఏలనందురా? నాప్రణాళికవల్ల కాకుంటే మీ కిది కట్టిరయే యుండదు. నిశ్చయం; ఒక్కమాటగూడ పలుకగూడదు. పోనీ, ప్రపంచ మింతవరకు ఆమాటసడిగూడా వినియుండలేదు- అవి ఒప్పుకొంటారా! అందువల్ల మంచిమాటలతో "యీనూతనదేవాలయసంకల్పము నాస్వంతము" అని అంటా

భీష్ముడు

అయితే నిలుపు—ఆ గంభీరశిలలములలో ఒక్కరాయిగూడా నిలుప కూడదు.

కౌశ్యాలు

(కిటికీగుండా చూచి) మంచు, వెన్నెల, దానిని బాగా చూపుటకు వాదులాడుచున్నవి. ఇట్లా చూస్తే అది కొంచెం శిథిలమైపోయి ఉన్నట్లే కనబడుతుం దనుటను కాదనడానికి లేదు.

భీష్ముడు

ఏమి? కౌశ్యాలుగారూ!

కౌశ్యాలు

స్వామీ, అది చాలా పాతదైపోయింది ఇంతవరకూ దీని నెందుకు గమనించకుండా ఉంటినా అనేది నాకు విప్పరాని సమస్యగా ఉన్నది. వాయువర్ణ్యని ఎంత వంగిపోయినది!—దానిని ఉంచకోరాదు. నిజంగా ఉంచవేకూడదు మరి పైకప్పు గోడ బాగా పరిశీలించిచూస్తే శిల్పవైఖరి ఎక్కడున్నది! ఆకమానులు—శిల్పిఅయినవాడు అవి అసహ్యంగా ఉన్నవని వచింపక మానడని తలంపు అవి అట్లనే ఉన్నవని చెప్పకతప్పదు. అటుతర్వాత ఆవాచి......గూళ్లుగూళ్లుగా...... అజాతశత్రుడు మనకు వదలిపెట్టిపోయినవి అవికావని అనుకొంటా! ఎంతభక్తిఉన్నా అంతదూరము పోకూడదు; ఈ పాతబొమ్మ సర్వాసహ్యంగా ఉండడం ప్రతివానికి స్పష్టమే

భీష్ముడు

జనవాక్యము దీని నాక్షేపించునెడల దేవాలయమును పడగొట్టుటకు ఒప్పదు.

కౌశ్యాలు

అప్పుడు చేసున్నానులేండి. యీ పండుగలలోనే విషయము చెప్పగనుండునప్పుడే దానిని తగురూపము నొందజేసి ముందుకుజరుపుతాను.

భీష్ముడు

బాగా వ్రాతలవల్ల ఉపన్యాసములవల్ల ప్రబోధము కలిగించేదము. ఈపనికి కొత్వాలును నమ్మి వదలిపెట్టండి స్వామీ, నేనుగాన నా యత్నాలవల్ల జనాన్ని మార్చలేకపోతే రావలసినజనం విముఖులుగా కనబడితే — ఏమీ; వాళ్లురాకుంటే నేనే పనిఅంతా చేస్తాను. ఒక్కొక్కటిగా వాళ్లనన్నీ పెరికి దేవళాన్ని కూలదోస్తాను. నాభార్యను తీసికొని వస్తా, నా కొమార్తెల తీసుకొస్తా; ఎట్లున్నాగాని అది క్రిందికొచ్చి తీరుతుంది, పదివేల దెబ్బలతో

భీష్ముడు

ఇంతవరకుండినస్వరముగాదే యిది ఇప్పుడింకొకరీతిగా నున్నదే !

కొత్వాలు

మానవ జనాభిప్రాయము లిట్టివే, తమలో నాటుకొనియున్న భావము లన్నైనా నిమిషములో వదలివేయగలరు అటుపిమ్మట — కవివర్యుని వాక్యము లబద్ధములుకానిచో — భావములకు రెక్కలువచ్చి ఒకరి నుండి ఇంకొకరివద్దకు యెగిరిపోవుననుట నిశ్చయంగా మనోహరమగు విషయమే — సెలవు తీసికొనెదను (శిరోవేష్టనముతీసికొంటూ) ఆ గుంపువిషయము చూడవలసియున్నది.

భీష్ముడు

ఏగుంపు?

కొత్వాలు

ఇది చూడండి యీదినము నేను కొందరిని బట్టియుంచితిని — నేనున్నూ ఇంకొకమనిషి, అక్కడ మేమిద్దరమే యుంటిమి — జిల్లా సరిహద్దులలో ఉండేఎరుకలవాళ్లు కొందరు. దయ్యాలమాదిరి ఉండే మూక అయితేమటుకు? కొన్నిత్రాళ్లు త్రటా తప్పించి మరి యిప్పుడు

భీష్ముడు

కట్టి భద్రంగా ఉంచివచ్చినా. ఇక్కడనే, మీ ప్రక్క ఇంటికి ఉత్తరంగానే, ఇంకేమి ఫరవాలేదు అప్పటికీ వాళ్లదుంపతెగ! ఇద్దరో ముగ్గురో దూసుకొని కాలికొంది కమ్మెదీసినారు

భీష్ముడు

మరి, భూతలమున శాంతినిలయములో ఘంటారవములు వినవచ్చుచునే యున్నవి

కౌశ్వాలు

వారిచట కట్టువచ్చిరి, అది సమస్య; వాస్తవంలో వాళ్లు మావాళ్లే అని చెప్పవలసిందేకాని......కాదు మీవాళ్లు నిజంవిచారిస్తే... (నవ్వుచూ) ఇక్కడొకసమస్య ఉన్నది. రండి ప్రయత్నముచేసి కొంచెం విప్పండి. ఈప్రాంతాలలో కొందరున్నారు. వాళ్లప్రాణాలు మీ తండ్రికి భార్యగాఉండిన ఆమెవలన నిలిచినవి. అయినా వీరుమాత్రం ఇంకొకతండ్రివలన వేరుతల్లియందు జన్మించినవారు.

భీష్ముడు

(తలనాడించుచు) ఈజగమున యెన్నియో సమస్యలు ప్రత్యుత్తరముల నన్వేషించియూ, ఫలప్రాప్తిలేకయే పోవుచుండును. వాటి నన్నిటి నెరుగ ఎవ్వరితరము

కౌశ్వాలు

కాని, నా ప్రశ్న అనుమానించుటకు తేలికఅయినదే మీరు వినియుండవచ్చు—పూర్వకాలమున ఒకనాడు పశ్చిమదేశమునుంచి ఒక యువకుడు పౌరోహిత్యమునకు కావలసినన్ని పుస్తకాలు చదువుకొన్నవాడు మీతల్లిని వరించుటకువచ్చినాడని......

భీష్ముడు

ఆఁ?

కౌశల్యాలు

చిత్రం చూడండి! భాగ్యవంతుల పిల్ల కోసరం ఆమె అప్రయోజకుని పామ్మని నిరాకరించినది. తరువాత వాడేమి చేస్తాడు? అది తమాష. దుఃఖమువల్ల ఉన్మత్తుడైపోయి కడకు ఒక యెరుకలకుర్రదాన్నే పెండ్లి చేసుకోడానికి తయారైనాడు అటుపిమ్మట...... చనిపోవుటకు ముందు తన రూపాన్ని ముద్రవేసియున్న యీ పలగాకిబూకను, యీ దేశద్రిమ్మరిగుంపును పెద్దదిచేయమని వదలిపెట్టిపోయినాడు. వీళ్లలో ఒకలంజెముండ మనగ్రామంపాలబడ్డది. ఆయన ఘనకార్యానికిమంచి స్మరణచిహ్నం!

భీష్ముడు

మరి అది?

కౌశల్యాలు

ఎరుకల గిరికీ—ఆమెద్రిది

భీష్ముడు

(హీనస్వరములో) గిరిక!......

కౌశల్యాలు

(ఎగతాళిగా) ఏఁ! సమస్య ఏమంతగడుసుది కాదు; మీరు చూడండి. అతని సంతతి ప్రాణాలను నిలబెట్టినది. మీతండ్రికి భార్యగా నుండిన ఆమె: ఎందువల్ల? ఆసంతతికి మూలము మీ తల్లి అతనిని వరింపక పోవడమే

భీష్ముడు

ఈదరిద్రులను వారిసిగ్గుమాలినజీవితములనుండి ఉద్ధరించుట కేమైన ఆలోచన మీరు చెప్పగలరా?

కొత్వాలు

పోనిస్తురూ! చెరసాలతలుపులు బాగా బిగించితే చాలు! ఎందుకు తల మున్కలుగా వారు పాతిత్యములో నున్నారు అట్టిపాపాత్ముల రక్షింపజూచితిరా యమునికి చేరవలసినదానిని పోనీక మోసముచేసిన వారౌతారు. నరకలోకమున దండనకార్యము ఇప్పుడే దివాలా తీయ వలసివస్తుంది.

భీష్ముడు

అట్లున్నను మీరు యిట్టివారికి తలదాచుకొనుటకు యిల్లుకట్టిపెట్టుటకు దయార్ద్రహృదయులై తలపెట్టితిరే!......

కొత్వాలు

నిలుపు, నిలుపు. ఆతీర్మానోపపాదకుడు తనతీర్మానమును ఉపసంహరించుకొన తొందరపడుచున్నాడు

భీష్ముడు

అయితే కొత్వాలుగారూ, తుదకు—

కొత్వాలు

ఇప్పుడు మీస్వరం మార్చినారు. మొదట ఉపయోగించినది ఇదికాదు సరేగదా; జరిగిపోయినది పోనీ; వెనుకకు చూడకండి; మనుష్యు లెప్పుడున్నూ ఒకటేమనస్సుతో నుండవలయును. పోయివచ్చెదను.స్వామీ,

ఆలసింపరాదు. తప్పించుకొనిపోయినవాళ్లు దాగుకొని యుందురు. త్వరగా పోయి తిరిగి గాడ్దెల కనుక్కోవాల. నమస్కారము. త్వర లోనే మరలచూస్తాను. మీకు మీభార్యగారికి నమస్కారము.

[పోవును.]

భీష్ముడు

[యోచనానిమగ్నుడై కొంచెపుసే పూరకుండి]

ఇచ్చట పశ్చాత్తాప మింకను ప్రారంభము కాలేదు. విడివడుటకు వీలు గానిరీతి చిక్కువడి పురాకృతికర్మ రచించిన వింతవస్త్రపు పోగలలో వల్లిబిల్లిగా నల్లుకొని పాపము పాపఫలముతో మిళితమై ఒండొరుల కలుషితములుగా నొనర్చుకొనుచున్నవి. వాని భేదింపజెంచు దృష్టి గూడ న్యాయము, రక్తసిక్తమగు అన్యాయము ఒక్కటిగ నైపోయె వని భావించుచున్నది (కిటికీవద్దకు పోయి కొంతసేపు వెలుపల చూచి)

చిన్నిబిడ్డా! నాతల్లి పాపప్రక్షాళనమునకై, పాపము! నీజీవితము ఛేదిం పబడెను. స్వర్గము నధిష్ఠించియుండు భగవంతునివద్దనుండి ఒక వైకల్యచిత్తురాలు ఆసందేశమును గొనితెచ్చెను. కర్తవ్యమును నిశ్చ యించుకొమ్మని ఆజ్ఞాపించెను. ఆపాడుదినము...ఆవికలచిత్త-నాతల్లి యాత్మ దుష్పథానువర్తియగుటవలననే జన్మించియుండెను.

భిన్నభిన్నదుష్పథముల వింతలైన
ఘర్షణంబులె శిక్ష, జగన్నియంత్రు
ఘోరశాసనోల్లంఘనాచారమునకు;

భీష్ముడు

తండ్రి కర్మఫలంబు సంతతికిరాన
దైవికంబగున్యాయంబు తగులజేయు.

(భీతిజెందినవానివలె కిటికీనద్దనుండి వెనుకకు తగ్గి) శాసనకర్తయగు భగవంతుడు మనపైన గలడు. కఠినపరిహారములు కావలయునని వారి ఆదేశము. సంపూర్ణమగు స్వార్థబలిదానమే మానవిముక్తికి వలయుమూల్యము నొసంగగలదు. కాని యీదినములలో యీపిరికిపందలు ఆమాటను సంపూర్ణముగా అనృత మొనర్చివైరి. (కొంతసేపు గదిలో అటునిటు తిరుగుచు.)

ప్రార్థించుట! ఆహా! ఆమాట ఎంత తేలికగా ప్రతివాని పెదవులనుండి జారివచ్చుచున్నది ఎంతసామాన్యమైపోయెను? ప్రార్థనయనిన వారి మదికి ఆకసములు నల్లగనున్నపుడు తెలియరానిసమస్యను గూర్చిదీనముగ మొరపెట్టుటయేకదాయగును! క్రీస్తు వంగినవీపుపై స్థలముకొరకు కుయ్యిడుటయే కదా! తాము సందేహమను మృదువగు రొంపులో నడుములవరకు దిగబడిపోవుచుండియు, అతనివైపు రెండుచేతులను జాచుటయేకదా! అట్టిదియే కరుణాగ్రహణమునకు మార్గమైయున్నచో ఆహా, ఎవ్వరిని పొగడుటకుగూడ భయమగును! అట్టిభగవంతుని సింహద్వారమున నిలచి శబ్దమొనర్చుటకుగూడ నేనెవ్వరికిని తీసిపోను. (నిశ్శబ్దముతో యోచించుచూ నిలుచుండును)

అయినను ......అమితభయోత్పాదకములగు ఆదివసములలో, ఏనాడు వ్యసనము భయముచే విలపింపజాలకుండెనో, ఏనాడు నరేంద్రుడు తన కడపటినిద్ర పోయెనో, ఏనాడు తనతల్లిముద్దుసహితము వాడిపోవుచుండినబుగ్గలకడకు మరల నాచిరునవ్వును వంచించియైన కొనిరాజాలకుండెనో ......ఆ దినములలో ప్రార్థనకాకున్న అది మరియేమిటి?

భీష్ముడు

చాలదూరపు రాగాలాపములె వాయుతరంగములపై దేలియాడు చుండిన అమృదుమధురనినాదము — మోహావేశమున ముంచజాలి నదియు, తన్మయత నొందియున్న నాయాత్మను తనలో లీనమొన రించుకొనజాలిన ఆ సుధాలహరియేమిటి? ప్రార్థించితినా నేను? దానివల్ల నాకూరటగల్గెనా? భగవంతునితో నేను మాట్లాడియుం టినా? ఆయన నాప్రార్థన కంగీకరించెనా? నన్ను తన సాన్నిధ్య మున, ఇచ్చట యీఅంధకార మయమగు దుఃఖనిలయమున జేర్చి యుంచెనా? నాకేట్లు ఎరుగనగును అంతయుమూసి బంధింపబడి యున్నది నామనస్సుపై చీకటిదోర్లిపడు తున్నది వెలుతురునకై యెచ్చట వెతుకవలయునో నేనెరుగను; అవును—సుధ ఎట్టిచీకటి యు ఆమెను అంధురాలుగ నొనర్పజాలదు

(వేదనతో అరచుచు) వెలుతురు. సుధా! సాధ్యమగుచో వెలుతురు కొనిరమ్ము

సుధ

(తలుపు తెరచి ఒకమైనపువత్తి వెలిగించుకొని లోపలికివచ్చును.)స్పష్ట మగుకాంతి గదియందంతటను ప్రసరించును).

సుధ

తెచ్చినాను. ఇదిగో దీపము; స్పష్టముగా ప్రకాశవంతముగా నున్నది.

భీష్ముడు

(మెల్లగా) మంచిది!

సుధ

(బల్లపై దీపమునుంచుచూ) ఆలస్యమాయెనా!

భీష్ముడు

అంత లేదు.

సుధ

మీ దేహ మెంతచల్లగా నున్నది! చలువలు క్రమ్మిన ట్లున్నదే!

భీష్ముడు

(గంభీరముగా) నాదేహము చల్లగా లేదు

సుధ

(మందహాసముతో) ఎంత గభీరత! ఎంత దార్ఢ్యము! వెలుతురూ వేడి లేదని కృశించి దిగులుపడువారుకారు మీరు.

[మంటచేయును.]

భీష్ముడు

(ఇటునటు తిరుగుచూ) ఆఁ. దిగులు—

సుధ

(మెల్లగా తనలో గదిలోనిసామాను సర్దుచూ) మైనపువత్తి యిక్కడ పెడదాం......నిరుడు. మిరుమిట్లు గొలిపెడు యీదీపపు కాంతిచే నాకృష్ణుడై తనచిన్ని చేతిని చాచెను—ఎంత ఆనందముతో! ఎంతనవ్వు! ఎంతతొందర! మాచిన్నినాయన! తానుకూర్చున్న తావు నుండి దానివైపునకు వంగి యిది సూర్యుడు కాదా అని అడిగెను

(మైనపువత్తిని కొంచెము ప్రక్కకు జరుపుచు) ఆఁ. ఇప్పుడు దీపపు కిరణములు ఆ చోటుమీదంతా—అక్కడ బయట—పడుచున్నవి... తాను పడుకొన్నచోటనుండి మిణుకుమిణుకుమను యీ వెలుతురును కిటికీసందులుగుండా చూడగలడు. తొంగిచూస్తే యీ వెలుతురు

అలంకృతములైన యీగోడల నన్నిటిని చూడగలదు. మంచుబొట్లు పడి కిటికీ యేడ్చుచున్నట్లున్నది. ఒక్కమాటతో దాని నవ్వువట్లొన ర్చెదను.

[కిటికీఅద్దముల తుడుచును.]

భీష్ముడు

(ఆమెచేయూన దంతియూచూచి మెల్లగా) హృదయమంతయు నల్లకల్లోలముగనున్న యీదుఃఖసాగరము నెన్నడు నిద్రపుచ్చగలను.నిద్రించియే తీరవలయును......

సుధ

(తనలో) హా! మూడు! ఎంతశుభ్రిము! అచట అద్దమే లేనట్లున్నది. గోడలు చీలి ఎడముగా పోయినట్లున్నవి. అదిగో భీకరమూర్తియగు ఆ భూదేవిఅంకమున చలిలో హాయిగా నిద్రించుచున్నాడు,నాముద్దులబిడ్డ!

భీష్ముడు

చాలించు సుధా!

సుధ

సద్దు.

భీష్ముడు

(సమీపించి) ఏమిచేయుచున్నావు. కిటికీ నెందుకు తెరచితివి?

సుధ

నేను స్వప్నము గనుచుంటిని; నిద్ర లేచితిని.

భీష్ముడు

స్వప్నములమూలమున జాలరి మోసగించుటకు వలలు పన్నుచుందును. తలుపు మూసివేయుము.

భీష్ముడు

సుధ

(దీనముగా బ్రతిమాలుచు.) నాథా!

భీష్ముడు

వేసి, గట్టిగా బిగించు.

సుధ

అయ్యో! ఎంతకఠినులు. అట్లనుట సరిగాదు.

భీష్ముడు

గట్టిగా, గట్టిగా!

సుధ

(తలుపుమూయుచు) ఇప్పు డంతయూ దృష్టినుండి మూయబడినది; కాని స్వప్నమూలమున ఒకక్షణకాలము కొంచెము తాపోపశమనము ననుభవించినయెడ ఈశ్వరుడు కోపింపడని యెంచెద.

భీష్ముడు

కాదు, అట్లెన్నటికాదు. యథార్థమును చూడక వదలునట్టియు కృపార్ద్రములగు కన్నులతో కొంచెము సౌమ్యమగు విగ్రహారాధన చూచి యోర్చుకొనునట్టియు న్యాయాధీశుడా అతడు!

సుధ

(అశ్రుపూరితములగు నేత్రములతో.) అతడి కోర్కెల కంతేలేదా? చెప్పు. నారెక్కలు అలసి వ్రాలిపోవుచున్నవి. నేను పడిపోవు—

భీష్ముడు

ఇంకొక్కసారిమాత్రమే. సర్వము కాని నీత్యాగము. సముద్రపుట లలో పారవైచినట్లే.

సుధ

అంతయూ అర్పించితినే నాకడ ఇంకేమియూ లేదు.

భీష్ముడు

(తలసాడించుచు.) నీ వర్పించవలసినది ఇంకనూ కొంత గలదు.

సుధ

(మందహాసముతో.) నిర్ణయింపుడు. నాది పేదవారిసాహసము.

భీష్ముడు

ఇచ్చి వేయుము

సుధ

తీసుకొనుడు ఖాళీపెట్టెను దోచుకొనుటయే యగును

భీష్ముడు

నీస్మృతిపథమున వాడిములుకులవలె నాటుచున్న ఆవేదనాపూర్ణ మగు కోర్కెలను నీపాపప్రవాహము ఇంకను మిగిలియున్నది గదా!

సుధ

(నిస్పృహతో) విదారితమైయున్న నాహృదయముయొక్క వ్రేళ్లునిలిచి యున్నవి; పెకలించివేయండి, ఆ వ్రేళ్లను పెళ్లగించి వేయండి.

భీష్ముడు

ఇచ్చినందులకు విచారించేయెడల ఆగహ్వారగర్భము నీవర్పించిన దాని నంతయూ వ్యర్థముగా మ్రింగివేసినట్లే కాగలదు.

సుధ

(వణకుచు) అయ్యో! మీప్రభునిమార్గము ననుసరించుట చాల కష్టము!

భీష్ముడు

సంకల్పముయొక్క మార్గమే అది.

సుధ

కాని, కరుణయొక్కదారి.

భీష్ముడు

పూజాపీఠములతో నిర్మింపబడియున్నది

సుధ

(చాలదూరమున యోచించూచి వణకుచు) అనంతమగు పాతాళమువలె భీకరమూర్తి యగు నావాక్యము ఇప్పుడు స్ఫురించుచున్నది. తడబడుచున్నను అగాధమగు దానిలోతును నాయాత్మ యిప్పటికి కనుగొనగలిగెను

భీష్ముడు

ఏవాక్యము అది?

సుధ

'రుద్రుని ప్రత్యక్షముగ చూచినవారు మరణింతురు!'

భీష్ముడు

(తినహస్తములతో నామెను గాఢాలింగనమొనర్చి) అహో! దాగుకో, దాగుకొనుము, నీకండ్లు మూసుకో, వారిని చూడకుము: వారినుండి మారుమొగము పెట్టుము.

సుధ

అట్లుచేయనా?

భీష్ముడు

(ఆమెను వదలి) వద్దు!

సుధ

మీరు నిశితమగు వేదనలో నున్నారు

భీష్ముడు

నిన్నట్లు ప్రేమించితిని

సుధ

మీ ప్రేమ కఠినతరము.

భీష్ముడు

అతికఠినమా! వాస్తవముగా!

సుధ

నన్నడుగకుడు: ఎట్టిచోటుకైన మిమ్ముస్నే అనుసరించెదను.

భీష్ముడు

స్వల్పకార్యములయందు నియోగించుటకేనా నిన్ను నీయాటలపాటల నుండి నేను లాగుకొనివచ్చినది! సర్వశూన్యమో అను ఆ ఘోరవాక్యముతో నిన్ను ప్రహరించినది ఆనిమిషమున నామనస్సులోనుండిన చంచలమగు అభిప్రాయముల తృప్తికొరకేనా! హ్రస్వములును, నీచములును అగునట్టి ఆదర్శములకొరకై అట్టి మహాత్యాగము సిగ్గుచేటుగదా? నీవు నాసహాయినివి; ఆమహాకార్యమునకై నీజీవితమును, నీసర్వస్వమును అర్థించుటకు సాహసించెదను

సుధ

సరే, కోరుడు......నన్నుమాత్రము వదలకుడు—

భీష్ముడు

తప్పదు. శాంతియు, విశ్రాంతియు లేక కృశించుచున్నాను. ఇప్పుడా పెద్దదేవాలయమును నిర్మింపబూనవలయును—

భీష్ముడు

సుధ

నాచిన్ని దేవళము మట్టిలో గలిసిపోయినది.

భీష్ముడు

అది నీవిగ్రహపు గుడియగుటవలన తుపాను వీచుటచే అది నిలువజాలక పోవచ్చును. (భయపడినవానివలె ఆమెనుపట్టుకొని నీకు శాంతి చేకూరుగాక! నీమూలమున న్యాయమగు శాంతి నావారిపైనను నా పైనను నిలుచుగాక! [ప్రక్కతలుపునద్దకు పోవును.]

సుధ

వియోగకారియగు యీకిటికీతలుపులకు నడ్డముగానున్న అనల్లనికమ్మిని మెల్లగా తీసివేయ అనుమతించెదరా?—కొంచెముమాత్రము కదిలిస్తే చాలు: చేయవచ్చునా? అయ్యో, ఇంతమెల్లగా

భీష్ముడు

(వాకిట్లో) వల్లపడలేదు [తనగదిలోనికి పోవును.]

సుధ

మూసినారు, నే నెంతగ ఏడ్చుచున్నను. నావ్యసనమునుండి బయటబడు మార్గము లేకుండ అన్నిటినీ బంధించివేసినారు. అశ్రువులు, నిట్టూర్పులు, పైనున్న స్వర్గము, క్రిందనున్న శ్మశానము అన్నియూ ముద్ర వేసి బంధింపబడినవి; ఊపిరాడకున్నది. నేను బయటబడి తీరవలయును; నిస్సహాయురాలి నగుటచే ఈ ఆవేదనతో నాబలము కుష్కించుచున్నది; వెలుపల కేగవలయును; అయితే ఎచ్చటకు! స్వర్గమునకు నాయెడ తీవ్రమగు అసహిష్ణుత కలదు; పారిపోయిన యెడల యిచ్చట నాహృదయమునకు ప్రియతమమగు నిధినే నా

వెనుక వదలిపెట్టిపోవలయును ఎటుపరుగెత్తినను అవ్యక్తమును, అగాధమును అగు నాలోనిభయమునుండి నన్నుద్ధరించుకొనజాలనని నాకు తెలియును.

[భీష్మునిగదివాకిట నిలచి వినుచు]

పెద్దగా చదువుతున్నారు. చాలదూరాన ఉన్నారుగాన నామాటలు వారికి వినిపించవు. సహాయులుగాని, ఓదార్చువారుగాని ఎవరూ యిచట లేరు; పండుగనాటి దేవుడు తనదర్శనమునకు వచ్చు భాగ్యవంతులపనితొందరలో నున్నాడు — బిడ్డలుగలభాగ్యశాలినులు, వారి అనుగ్రహపాత్రులు ఆనందగీతములతో హారతు లొసగుచున్నారు: అన్నిదినములకంటెను ఈశ్వరునికి ఇది ఆనందదివసము: ఏకాకినై వెక్కివెక్కి ఏడ్చుచుండు దరిద్రురాల నగుతల్లి నేకదా నేను, కావున నన్ను మరచిపోయిరి.

[సందడిలేకుండ కిటికీవద్దకు చేరి]

ఈకిటికీతలుపును తెరతునా— యీవెలుతురుకిరణములలో తేజోవంతమగు నది ఒక్కటైన దానిపై బడునట్లు చేయుదునా? అంధకారములో ఏకాకియై పడియుండువానికి చిన్నశయ్యపైనుండి నిశీథములందలి భయానకదృశ్యములనైన తరిమివేయునుగాక......అదికాదు; వాడీరాత్రి అచట లేదు. సంక్రాంతిపండుగ పిల్లకాయలకు ఆటవిడుపుదినము. ఇచ్చటకివచ్చుటకు వానికి అనుమతి గలదు. బహుశః ఇప్పుడు వెలుపల నిలుచుకొనియున్నాడేమో—మునివ్రేళ్లమీద నిల్చి కటికిచీకట్లో తనతల్లి కిటికీతలుపు తట్టుతున్నాడేమో.........ఆఅరచినది పసిబిడ్డయేకదా? చిన్న నరేంద్రా! సహాయపడజాలను. అన్నీ బిగించి యున్నవి. నీతండ్రియుత్తరువు; నరేంద్రా, నేనిప్పుడు తెరచుటకు సాహసింపజాలను? నీవు చాల విధేయుడవగు బిడ్డవు. వారి

కెప్పుడును తొందరకలిగించిన వారము కాము...స్వర్గమునకు ఎచ్చట మంచివచ్చితివో అచ్చటికే ఎగిరిపొమ్ము! అచ్చట వెలుతురు గలదు; అచ్చట ఆనందము కలదు. పసిపిల్లల గుంపులుగూడ ఆటలోనున్నారు. అయితే నీవేడ్చుచుండుట ఎవ్వరూ చూడగూడదు! 'నేను వారివద్దకు పోయి తలుపుతట్టితే మానాయన తలుపుబిగించినాడు' అని చెప్పవద్దు. చిన్నపిల్లలు 'ఎందుకు' అని ఆశ్చర్యపడుతారు. మనము పెద్దవాళ్లము; యోచిస్తుంటాము......వాడు యేడ్చి ఆయాసపడ్డాడు అనిచెప్తాము. మంచిపూలుబోలు దండకట్టినది వీడిచెయ్యి అని చెప్పుకుంటాము— కనబడుచున్నదా? అక్కడక్రింద...

[వినును; యోచించును; తలనాడించును.]

స్వప్నములు! నాబిడ్డను నన్ను వేరుచేయునది యీవెశవకిటికీ ఒక్కటి మాత్రమే కాదు. ఆశిషావాక్య గర్జనములో మాత్రమే ఆరక్తవర్ణన; ఉషఃకాంతిజ్వాలలో మమ్ము వేరుపరుచు గోడ పడిపోగలదు. చెరసాలలు పగిలిపోగలవు [illegible]మ్ముత్తలు వీడిపోవును; స్వర్గనరక లోకముల ద్వారములు కిటకిటలాడుచు మూల్గును; భగవంతుని ద్వారముకూడ తెరవబడును. ఎంత!అబ్బో, యెంతయున్నది? ఇక్కడ చేయవలసినపని మేమిద్దరమూ మరలచేరేలోపలనాపైగలయీకార్యమనెడు లోతుఅగాధము పూడువరకు నేను పనిచేయవలయును. తడబడకూడదు.నన్నునూ నాసంకల్పమును ఆయోమయముగ నొనర్చుకొనవలయును.– అయితే యీరాత్రి పండుగ......ఆహా ఒక్కసంవత్సరము ఎంతమార్పు నొనర్చింపగలదు!—వలదు!స్వల్పముగనైననుచేయవలయును. ఆవస్తువులనైన బయటపెట్టవలయు; అమూల్యములగు వాటిధర కొలుచుటకు తగ్గిహృదయమునకు తప్ప ప్రపంచమునందు మరెవ్వరికిని సాధ్యము కాదనుట నిశ్చయము.

[ఒక పెట్టెవద్దకూర్చుండి ఒక అరను తెరచి చాల వస్తువులను బయటకు తీయును. ఆక్షణములోనే భీష్ముడు తలుపు తెరచి మాటలాడబోవును. కాని ఆమె చేయుపనిని జూచి కదలక నిల్చును. సుధ వానిని గమనించదు.]

భీష్ముడు

(హీనస్వరముతో) ఇంకను స్మశానము చుట్టు తిరుగుటయేనా! ఇంకను యీపిచ్చిదయ్యాలతో ఆడుకోవటమేనా!

సుధ

ఇదిగో ఉత్తరీయము; దీనిని వేసికొనియుండినాడు చలమదగ్గర నవ్వినప్పుడు. ఈమూటలో ఉన్నవి వాని వస్త్రములు.

[పైకెత్తి దానిని చూచుచు, నవ్వును.]

వాని సౌందర్యమునకు తగినవి. అయ్యో, నా చిన్నబిడ్డ అక్కడ ఆ యెత్తుపీఠముమీద కూర్చుంటే యెంతముచ్చటగా ఉండేది. ఇది వాని అంగవస్త్రము, ఇదిచొక్కా. మొట్టమొదట గాలిలో తిరుగుటకు తీసుకపోయినప్పుడు వేసుకొని యుండినది....................
అప్పు డివన్నీ చాలా వదులుగా ఉండెను, కాని కొంతకాలమునకే చిన్నవై చాలకుండ వచ్చినవి......చేతిమేజోళ్లు ఎంతబాగుండేవి పాపం...—కాళ్ళజోళ్లు—ఎటువంటికాలువాడిది; క్రొత్తపట్టుశాలువ ఎంతచలిగాలిలోనైనా వెచ్చగా ఉండేది; అది వేసుకొన్నదేకాదు; క్రొత్తదానివలెనే ఉన్నది......వాడి ప్రయాణపుదుస్తులుగూడ ఇక్కడున్నవే: వీటితో కప్పి—దుప్పటి బూనీసు—హాయిగా ప్రయాణం చేస్తుంటా దనుకొంటే నే—కడపటిసారి వీనిని పెట్టెలో బెట్టినప్పుడు నేను చాల నీరసముతోనుంటిని, చనిపోవున ట్లుంటిని.

భీష్ముడు

(ఆవేదనతో చేతులు గట్టిగా బిగియబట్టి) సర్వేశ్వరా! నన్ను మన్నింపుము; ఇదిమాత్రము అర్థించితిని; ఈమెకు మిగిలియున్న ఒక్క విగ్రహపు ఆలయము భగ్నముకావలసియే యున్నచో ఆకార్యమునకు నన్ను వదలి వే రెవ్వరిహస్తమునైన పంపుము.

సుధ

ఇక్కడ మరక లున్నవి......ఏడ్పువలన గలిగినవా? ఇవి? ఆహా; నాచేవిలో ఎంతభాగ్య మున్నది! ముత్యముల కూర్పుగలిగి, కన్నీటి మంచుచే తడసి, ఆవేదనముతో పోతపోయబడి నాఆత్మను పిండివ విర్ణయమువలన ఒకపావనమగు పరివేషములో నానవేయబడి—పవిత్రవంత మైనది. అవును నీటితొట్టివద్ద నిలిచి నవ్వినపుడు నా బిడ్డపై నుండినది యీశాలువ—నావస్తువు లెన్నిపోయినను ఇది మిగిలియుండునంతవరకు నేను భాగ్యశాలినే.

[తీవ్రముగ తలుపు తట్టినట్లు వినబడును. సుధ ఒక అరుపుతో వెనుకకు తిరుగును. అప్పుడే భీష్ముని చూచును. తలుపును ఒకస్త్రీ, పేలికలు ధరించియుండునది, తనచేతులలో ఒకబిడ్డ నెత్తుకొని వడిగా లోపలకివచ్చును.]

ఆస్త్రీ

(పసిబిడ్డ వస్త్రము చూచి సుధతో పెద్దగా) నాకు కొన్ని యిమ్ము, భాగ్యముగల తల్లీ, యిమ్ము.

సుధ

నీవు నాకంటెను భాగ్యశాలినివి నాకంటె.

భీష్ముడు

ఆస్త్రీ

ఆc. నీబోటివాళ్ల సంగతి నాకు తెలుసు, చప్పిడిమాటలతో లాభమేం.

[redacted] భీష్ముడు

(ఆమెను సమీపించి) ఏమికావలయునో చెప్పు.

ఆ స్త్రీ

గురువును చూడడానికిమటుకు నేనురాను. ఇక్కడ నిల్చుకొని నీబోధలకు, శాపాలకు ఓర్చుకొని యుండడంకంటె పోదు తుపానులో దెబ్బలాడడమైనా నాకు సంతోషమే. నుళ్లీ దాంట్లోకే పొయ్యి మునిగినాసరే, మరిగిచచ్చినాసరే,పోట్లాడడానికైన సంతోషముతో ఒప్పుకొంటాగాని నరకమని, పాపమని,మంటలని నీవు వాగుతుంటే మాత్రం వినలేను. దేవుడు నేనట్లు ఉండాలని చేశాడు; అందువల్ల నేను నాశనమైపోయినాసరే ...... అంతకంటే నేనేమిచేయగలను?

భీష్ముడు

(హీనస్వరముతో) ఆమెముఖవైఖరి, స్వరముసహితము నన్ను స్తబ్ధునిగా జేయుచున్నవి. ముందు రానున్న అశుభము హృదయమును కలవరపెట్టుచున్నది.

సుధ

అవసరముగా నున్నయెడల విశ్రమించి చలి కాచికొనుము; నీ బిడ్డను మేము పోషించెదము.

ఆస్త్రీ

వెలుతురు, కుంపటి ఉన్నచోట యొరుకలజన్మానికి విశ్రాంతి లేదు. మా జనానికి ఆపెద్దరస్తా ఉన్నది; బీడు, కొండ, అడివి ఉన్నవి

తిరగడానికి; అవన్నీ తిరగాల; మేము తిరగవలసిందే. కొంపగోడి మాకు కాదు. కొత్వాలు, నౌకర్లు దారికని పెట్టుంటూరు. వాళ్లను తప్పించుకొని తొందరగా వెళ్లిపోవాలి. వాళ్లను జెయిలులో పెట్టాలని వాళ్ల యిష్టం; ముండాకొడుకులు!

భీష్ముడు

ఇచ్చట నిన్ను వారు తాకజాలరు.

ఆ స్త్రీ

ఇక్కడ? యీగోడలసందున? యీకప్పు క్రింద? వద్దు. తుపానులో యీదరగాలి చినుకులలోనే మాకు యిక్కడకన్న ధారళముగా ఊపిరాడుతుందని తెలిసికొన్నాను. యీబిడ్డ కొక గుడ్డపాత చూడండి, చాలు; నా పెద్దవాడు, లంజకొడుకు! వీడికి కప్పియుండిన యేలికపాత కాస్తా లాగేశాడు అందు చేత గుడ్డలేక యీపోనుగాలిలో సగంచచ్చిపోయినాడు చూడు! చలికి ముద్దయిపోయి యిప్పుడుగొట్టిన చలిగాలికి ప్రాణమే పోయేట్టున్నాడు.

భీష్ముడు

అమ్మా, నీవు చనెడునట్లే—చీకట్లో, వెర్రిదారులలో నీబిడ్డనుగూడ తీసికొనిపోవలయునా? వాని నుద్ధరించెదము; వానినందుకొని లేత నుదుటినుండి ఆమచ్చను కడిగివేసెదము.

ఆ స్త్రీ

ఆ! మీ రీసంగతి తెలుసుకోవలయు ఆమచ్చ నెవరూ కడిగివేయలేరు. అవును ఎవరూ ప్రయత్నంగూడ చేయకూడదని చెబుతున్నా. ఆమచ్చ నేర్పరచిన మీతో యుద్ధముచేయవలసినదే. వీడి నెక్కడకన్నానో తెలుసునా? విను, కందకం ప్రక్క నేలమీద చుట్టూ పాటలు; ఆటలు;

తాగడం; మంచు; మురికినీళ్లు బిడ్డకు నీళ్లుపోయడానికి......వీడితల్లి మృగం; తనపిల్లను కంటూ ఉండేటప్పుడు దానిచుట్టూ కొందరు నిల్చొని బూతుబందు కూస్తుండినారు: వాళ్లెవరు? ఆబిడ్డనాయన. ఆహాఁ! వీడినాయన్ను అంటేమేలు.

భీష్ముడు

సుధా !

సుధ

ఆ !

భీష్ముడు

నీకర్తవ్యమును జూడుము.

సుధ

(భీతితో) ఈమెకా? అట్లు కాజాలదు.

ఆస్త్రీ

ఇమ్ము. నాకిమ్ము ఉండేదంతా పారేసినపేలికలు, పట్టువైనాసరే; మంచివి చెడ్డవి, అన్నీ నాకొకటే. వాడికి కప్పటానికి పనికొచ్చే పని అయితే అన్నీ యివ్వండి! తొందరలోనే వీడిని ఊపిరివదిలిపెడుతుంది. ఒళ్లైన మొదట కప్పనీయండి.

భీష్ముడు

ఇప్పుడు నిర్ణయము, స్పష్టముగా, బిగ్గరగా పలుకుచున్నది.

ఆస్త్రీ

నీబిడ్డకు చాలినన్నిగుడ్డలు నీకున్నవి. నాబిడ్డకు ఒక్కపేలిక నివ్వలేవా? యిప్పుడు చస్తే కప్పడానికన్నా ఉపయోగపడేటట్లు.

భీష్ముడు

ఈ మెమాటలలో గాఢముగు ఆజ్ఞ గ్వానించుమన్నట్లు తోచుట లేదా?

ఆస్త్రీ

వాటిని నా కిచ్చివేయి.

సుధ

అది పాతకము. చనిపోయిన ఆచిన్నికుమారుని హత్యతో సమమగు ద్రోహము.

భీష్ముడు

వాడు నడువవలసియుండినమార్గము కడపముండలు నే మనము తప్ప వలయునా?

సుధ

(గద్గదస్వరంతో) మీయిష్టమువచ్చినట్లే కానీయండి. నాహృదయము యొక్క కడపటివేరునుగూడ నాకాలిక్రింద నలిపివేయవలసి వచ్చెను ......అమ్మా, రా, నా కధికముగా నున్న వాటిని తీసుకపోదువుగాని.

ఆస్త్రీ

ఈ.

భీష్ముడు

పంచెదవా, సుధా? పంచుటయేనా?

సుధ

(తీవ్రముగు ఆవేశముతో) చావునకైన తెగించెదనుగాని సర్వస్వమూ పోగొట్టుకొనజాలను — చూడండి, కొంచెము కొంచెముగా నేను లొంగిపోతూ నేయున్నాను: వెనుకకు తగ్గలేదు ...... ఇప్పుడు నేను

భీష్ముడు

విరామముకోరునది—ఇంత కెక్కువ చేయజాలను. సగముచాలును. ......ఆమెకోరినది ఇంతకూడా లేదు.

భీష్ముడు

పూర్వము నీస్వంతబిడ్డనుగా కొనినప్పుడు యివి అన్నియూ ఎక్కువగా నుండెనా?

సుధ

(ఆస్త్రీకి యిచ్చుచు) ఈశాలువ దీసుకో; ఇది వేసుకోని వాడు దేవళానికి పోయేది. బూనీసు, అంగవస్త్రము, పెట్టుకొనే టోపి—రాత్రి చలిగాలిరాకుండా కప్పేటందుకు పట్టుచొక్కా—ఎంతచలిగాలిలోనైనా వెచ్చగా ఉంటుంది అదితొడిగితే; వాటిని తీసుకోపో; క్రింద ఏమీ పడనీబోకు!

ఆస్త్రీ

ఈ.

భీష్ముడు

సుధా! అన్నీ యిస్తున్నావా?

సుధ

(ఇచ్చుచు) నామకరణమునాడు వేసికొన్న ఉత్తరీయంగూడాయిదిగో!

ఆస్త్రీ

ఇప్పటికి నేను శుభ్రంగా ఊడ్చివేసినా; పూర్తిగా ...... ఇప్పటికే నేను చాలదూరం పోయియుండవలసినది. వేళఅయింది. వీడికి కప్పేసి యీమాటంతా ఎత్తుకోని ఒక్కపరుగుతోపోయి కలుసుకొంటా.

భీష్ముడు

సుధ

(మనస్సులోపల తీవ్రమగుపోరాటముతో నిల్చుకొనును. కడపట అను గును; చెప్పండి మీరు! అధికముగా యింకా యెక్కువగా ఇంకా ఒక కార్య మొనర్పుమని న్యాయము అడుగగలదా?

భీష్ముడు

ఇష్టముగల హృదయముతో ఈదానము నొనర్చితివా, మనసుకు గలుగునొప్పికి వెనుదీయకయే?

సుధ

లేదు.

భీష్ముడు

గాలికి, అలలకు వెదచల్లినట్లే అంతయు వ్యర్థము, ఆఆదేశ మింకనూ పలుకుచునే యున్నది; త్యాగమును కోరుచునేయున్నది. [పోబోవును.]

సుధ

(వాకిలికడకుపోవునరకు ఊరకుండి, అప్పుడు పిలుచును) భీష్మా!

భీష్ముడు

ఏమికావలయును?

సుధ

నేనసత్యమాడితిని! పశ్చాత్తాపపడుచున్నాను. ధైర్యముగా ఉంటాను. ఆహా! ఏదైన దాచిపెడతానని, ఇంకేదైనా దాచుకొని యుంటానని మీరు కలలోనైన తలంచియుండరు.

భీష్ముడు

ఏమీ?

సుధ

(రవికలోనుండి ఒకమడచియున్న చిన్నబిడ్డటోపీతీసి) ఇంకా నాదగ్గర ఒకగుర్తు, చిహ్నం మిగిలియున్నది.

భీష్ముడు

అది టోపి—

సుధ

అవును. అశ్రుమిళితమై వాడు చనిపోవుటకుముందు చెమటతో తడిసి అప్పటినుండి నాహృదయము పైననే పెట్టుకొని యుంటిని!

భీష్ముడు

నీవిగ్రహములనే పూజించుకో! నేను పోయెదను.

[పోబోవును].

సుధ

నిలవండి!

భీష్ముడు

నాతో ఏమిపని?

సుధ

కాదు. ఇదిగో! [టోపీ అతని కందిచ్చును.]

భీష్ముడు

(ఆమెకడకుపోయి తీసికొనకయే అడుగును) ఇష్టముతోనేకదా?

సుధ

అవును; ఇష్టముతోనే.

భీష్ముడు

ఆమె కాచుకొనియున్నది; దానిని నాచేతి కిమ్ము.

[వెలుపలకు బోవును.]

సుధ

నాసర్వస్వమును అన్యాయముగా కొల్లగొట్టగా, నా పూర్వజీవితమునకును గల ఆఖరుబంధనమునుగూడ త్రెంపివేసిరి.......

[క్షణకాలము చలించకయే ఆమె నిలుచును. అప్పుడు ఆమె ముఖమునందలిభావము కొంచెంకొంచెముగా మారి ఆనందమయమై ప్రజ్వలించును. భీష్ముడు మరలివచ్చును. అమితసంతోషముతో నెగిరిపోయి వానిపై వ్రాలి పలుకును.]

నేను ధన్యురాలను. భీష్మా, కడపటికి స్వేచ్ఛ లభించినది.

భీష్ముడు

సుధా!

సుధ

రాత్రియంతయు గడచిపోయినది. నారొమ్ముపై నెక్కి దయ్యమువలె ఊపిరాడకుండా చేసిన ఆభయముల నన్నిటిని చాలదూరము విసరిపారవైచితిని. ఇచ్ఛ; అవును: సంకల్పము విజయవంతమైనది: దృష్టి నవరోధించు పొగలన్నియూ చెదరిపోయినవి: క్రమ్ముకొనియుండిన మేఘము లన్నియూ పరుగెత్తిపోయినవి: రాత్రి నశించినది: మృత్యువు వెనుదిరిగిపోయినది: చాలదూరమున అరుణోదయకాంతులు కాన్పించుచున్నవి! 'శ్మశానము' అవును, 'శ్మశానభూమి!' ఆశబ్దమువినియిప్పుడు కన్నీళ్లు కారుట లేదు: గాయము మానిపోయినది: చూడు,

ఆమాటకుగూడ అదిరక్తస్రవమున కిష్టపడుటలేదు. నాపుత్రుడు స్వర్గమున హాయిగా నున్నాడు.

భీష్ముడు

ఇప్పుడు నిశ్చయముగా నీవు విజయివి!

సుధ

అంధకారమును, సమాధియనిన భయమును అన్నిటినీ జయించితిని! ఆహా! పైన చూడుడు. అక్కడ నిల్చుకొనియున్నాడు నరేంద్రుడు. నాముద్దులనరేంద్రుడు. సంతోషముతో కలకలలాడు మోముతో ............తనచిన్ని చేతులు చాపుచున్నాడు. నాకు వెయ్యినోళ్లుండినను వానిని మరల నా కిచ్చివేయుమనుటకు ఒక్కనోటినిగూడ ఉపయోగించుటకు సాహసింపను. ఆపని నాకుసాధ్య మైయున్నను నే నట్లు కోరనేకోరను. బాధించు నెపమున భగవంతుడు మనలను ధన్యులుగ నొనర్చును. నేను పోగొట్టుకొనిన నాముద్దులబిడ్డ, నాయజ్ఞపశువు నాయాత్మ నుద్ధరించెను. అతడు నావాడు కాడు; నాకు బదులొసగబడెను. నన్ను గమ్యముదాక చేర్చుటకు వాని నంపిరి! ... నాకు మార్గదర్శకులగుచు ప్రేమార్ద్రహృదయముతో నాకొరకు కష్టపడినందులకు మీకుహృదయపూర్వకముగ నమస్కరించెదను. అబ్బా, మీరనుభవించిన ఆ ఆవేదనంతయు నేను జూచియుంటిని!...... ఇకను నిర్ణయము అనులోయలో ఆస్వరమును వినబోవునది మీరు: సర్వమో, సర్వపూజ్యమో అనుదెబ్బ పడవలసినది ఇక మీమీదనే.

భీష్ముడు

సుధా! వలదు; సమరము గతించినది; బాధ శమించినది. బహుమతిని గైకొనుము.

సు ధ

పురాతనస్మృతివాక్యమును మరచిపోతిరా?— రుద్రునిదర్శించినవారు మరణింతురని.......

భీష్ముడు

(వెనుకకుపడి) ఆహా యెంతభయంకరమైనది యీనూతన తేజము! వద్దు; వేయిసారులు వద్దు. అయ్యో, యుద్ధమునకు నా బాహువులు బలిష్ఠములుగానే యున్నవి. నేను నిన్ను పోనివ్వను! భూమిపైగల ఇతరసర్వస్వము జారిపోయిన పోవుగాక; ఒక్క అణువైనను నా చేతిలో నిలువకుండ పోయిన పోవునుగాక— కాని నిన్నుమాత్రము ఎన్నటికి వదలను.

సు ధ

నిర్ణయించుకోండి. దారులు చీలుచోట నిలిచియున్నారు. ఇప్పుడు నిర్ణయించుకొను బాధ్యత మీపై గలదు. నాయందు నూతనముగ రగుల్పబడిన తేజమును చల్లార్పుడు— నాభావోద్రేకపుదివ్యశక్తిఊటలను మూసివేయండి: నావిగ్రహపువస్తువులనే నాకిచ్చివేయండి. (ఆస్త్రీయింకను బయట నిలిచియున్నది.) నన్ను మరల మొదటికే, తమస్వర్గమును మరచియుండిన దినములకే- బురదలో దిగబడి పాపినై నేపాపమొనర్చుచుంటినని యెరుగక చరియించినఆదినములలోనికే త్రోసివేయండి: నాఆత్మనుబంధించి, రెక్కలుకత్తిరించిమీయిష్టమువచ్చినరీతిని నన్నుమార్చివేయండి.బలిష్ఠములగు మీచేతులలో నేనుబంకమట్టిని.కాని సత్వపు అయోమయపాశములతో నన్ను కట్టివేయండి. మాటగాకట్టి క్రిందికిలాగండి. ఎచ్చటనుండి నన్ను మీ రుద్ధరించి పైకికొనివచ్చితిరో అచ్చటికే, దేనిని నేను మరచునట్లొనర్చితిరో, బాధాయుతమును అంధ

కారబంధురమును అగు ఆజీవితములోనికే నన్ను త్రోలివేయండి. వీటి నన్నిటి నొనర్ప సాహసించినచో, సంకల్పమున్నచో ఇదిగో అప్పుడు గూడ మీకు సహాయురాలనై మెలగెదను ...... నిర్ణంయించుకోండి; మీరు దారులు చీలుచోట నున్నారు.

భీష్ముడు

అశ్లేష్యమైన నా జీవితము నిష్ఫలము! కాదు; కాని యీపాడు ప్రదేశమునకు చాలదూరమున నీవ్యసనస్మృతి చిహ్నములకు చాలదూరమున ఒకానొక ప్రాతఃకాలము నీవు మేల్కొనుటతోడనే జీవితము, జ్ఞానము ఒక్కటియే యని యెరుగగలవు.

సుధ

ఏమీ? భగవంతుడు మన కార్యనిర్వహణమునకై మి మ్మభిషిక్తులజేసియు మీచుట్టునూ జేరి మిమ్ములనే సర్వవిషయములయందు ఆధారమని నమ్మియున్న యీవేయిమందిని వారి పాతిత్యమునుండి యుద్ధరింపవలయునని ఈశ్వరాజ్ఞ మీపైగలదనుట మరచుటయా! కావున నిర్ణయించుకోండి మీరు దారులుచీలుచోట నున్నారు.

భీష్ముడు

అటుకాదు; నేను నిర్ణయించుకొనవలసిన దేదియు లేదు.

సుధ

(వానిమెడపై తానుపడుచూ) అందులకు నమస్కారములు. ప్రతివిషయమునకూ నమస్కారములు. ప్రేమార్ద్రహృదయులై నాతో స్నేహమొనర్చితిరి. నాతడబడుపాదములకు మార్గదర్శకులైతిరి. యిప్పుడు నా

భీష్ముడు

శిరముచుట్టును అలసటయను పొగ క్రమ్ముకొనుచున్నది. నా మంచము వద్దచేరి దయతో వనుగాచుచుండవలయు. ఇదియే నా ప్రార్థన.

భీష్ముడు

నిద్రింపుము! నీదీర్ఘ దివసపుకార్యము ముగిసినది.

సుధ

రాత్రికి దీపము వెలుగుచున్నది. నాశక్తి అంతయు సమరము వలన వ్యయమైనది. చాలా అలసియున్నాను. భారముగా నున్నది...... ఆహా! దైవనామస్మరణమే జ్ఞానము. భీష్మా! శెలవుదయచేయుము.

భీష్ముడు

శెలవు!

సుధ

శెలవు. యెల్ల రకునమస్కారము. ఇక విశ్రమింపవలయును.

[పోవును].

భీష్ముడు

(పిడికిటిని గట్టిగా రొమ్ముపైనుంచి) ప్రాణమా! కడపటి వరకు నిశ్చలముగా నుండుము; యుద్ధములలో నుత్తమమగు యుద్ధము ముగియు వరకు! నీసర్వస్వమును పారవేయుము. అనంతరము "నష్టమే లాభము" కాగలదు.

నాల్గవ అంకము ముగిసినది

---

# భీష్ముడు

---

## ఐదవ అంకము

[ఒకటిన్నర సంవత్సరము గడచినది. నూతనదేవాలయము పూర్తి అయిఉన్నది; ఉత్సవములుగాన అలంకరించియున్నారు. ఏరు దాని నొరసికొని ప్రవహించుచున్నది. ప్రాతఃకాలము, మంచుకురియుచున్నది. దేవాలయపుగుమాస్తా ఆలయమునకు వెలుపల తోరణములు కట్టుచుండును; ఇంతలో ఉపాధ్యాయుడు వానిని కలసికొనును ]

ఉపాధ్యాయుడు

ఏమిా! అప్పుడే వచ్చినారే?

గుమాస్తా

నేను వచ్చి చాలసేపయినది. ఈతోరణాలు స్తంభమునుంచి స్తంభానికి వేయడానికి కొంచెం తోడ్పడండి. తెలిసినదా? ఉత్సవము ఏమార్గములో పోవలసినది చూపడమునకు.

ఉపాధ్యాయుడు

ఆపైన స్వాములవారి ఇంటివద్ద ఏదో ఆకారము పైకి లేస్తున్నది; పైన గుండ్రంగా వంచియున్నట్లున్నది.

గుమాస్తా

ఆఁ! నిజంగా!

ఉపాధ్యాయుఁడు

ఏమి టదంతా?

గుమాస్తా

స్వాములవారి గౌరవార్థం, అదిగో దానిమీద తగటుఅక్షరాలతో వారిపే రుంటుంది.

ఉపాధ్యాయుఁడు

అవును. ఈవేళ చాలా గలాటాగా ఉన్నట్లున్నది. దేశమంతా బలే జల్సాలలో ఉన్నారు. తెరచాపలతో ఏరంతా తెల్లగా ఉన్నది.

గుమాస్తా

అవును. ఇప్పుడు ప్రజలు నిద్దుర లేస్తున్నారు. మునుపటిగురువుకాలంలో (భగవంతుఁడు వారికి శాంతి నొసఁగుగాక) యుద్ధము, ప్రయత్నము అనేమాటలే ఉండేవికావు హాయిగా నిద్రపొయ్యేవాళ్లు; ఇతరులెవ్వరూ వాళ్లజోలికి గూడ వచ్చేదిలేదు.— ఏమార్గం సరిఅయినదో నాకేమి తెలియడములేదు.

ఉపాధ్యాయుఁడు

ఏల? జీవితమయ్యా! జీవితము.

గుమాస్తా

ఈజీవితమంతా దానిదారిన అది జరిగిపోతూఉంటే చలించకుండా ఉంటిమే నీవు నేను; అయితే యిదెట్లావస్తే ఏమయ్యా అని?

ఉపాధ్యాయుఁడు

ఏల? ఇతరులు నిద్రించినదాకా మనము పనిలో నుంటిమి, వారు లేచి మనవల్ల ఉపయోగము లేకపోగానే మనము గురకపెట్ట మొదలు పెట్టినాము.

గుమస్తా

అట్లుండియూ జీవితమే శ్రేష్ఠమని చెప్పితిరే?

ఉపాధ్యాయుడు

గురువులంతా అట్లేకదా చెప్పుచున్నారు. వ్యక్తమైన అసత్యము జన సామాన్యానికి— ఇతరులకు అన్వయించేటప్పుడుమాత్రము వారిభావ ములనే నేను అనుకరిస్తూఉన్నాను. మాకు సరె వేరే న్యాయము ఉండనేఉన్నది. ఈకొండపల్లెలలో వాడుకల్లో ఉండేదిగాదు. మేము జిల్లాకు తలవంటివారము; అధికారులము. ఈఉద్యమాలవల్ల మామీద అసూయగూడా కలుగవచ్చు. మేము కల్లోములను బిర్రుగా పట్టుకొనియే ఉండవలయును; బ్రాహ్మణ్యమును ఆధిక్యమును నిలు పుకొనవలయును. మాకార్యాలవల్ల తగవుల కెడమీయకుండవలయును: ఒక్కమాటలో— స్పర్ధలలో జోక్యము కలుగజేసుకోరాదు.

గుమస్తా

అయితే మనస్వాములవారు వాటిమధ్యనే ఉన్నారే?

ఉపాధ్యాయుడు

అదే వారిగొప్పఅక్రమం! ఆయన పైవారికి, కొందరికి ఆయనపని రుచించుట లేదని నాకు తెలుసును. నిజములో వీటితో విసిగిపోయి ఉన్నారు. జనులు ఆయనను ప్రేమిస్తుండబట్టికాని యిప్పటి కెప్పుడో— చాలాఏండ్లు గడపకముందే— వీరిని తోసివేసి ఉండే వారే. వీరుగూడ గడుసువారే; వీరి కన్నీ తెలుసు. నాటి రెండింతలవిలువ గల తంత్రము వీరెరుగుదురు. కట్టుతూ ఉన్నాడు! ఇక్కడ ఏదో ఒక 'పని జరుగుతూవుంటే' అన్నీ వాటంతట అవే చక్కబడతవి. ఆపని

రాజుతూవుండే కుతంత్రమైనాసరే అదేమని ఎవరూ అడగరు ; విష య మేమిటంటే 'చేస్తూఉండడం.' నాయకులుమొదలు వినాయకుల వరకు మనమందరమూ ఏదైనా చేస్తూఉండవలయును— లేకపోతే పరాయివాడిదే (అదృష్టం.)

గుమాస్తా

మీరు శాసనసభలో ఉంటిరిగదా, అందువల్ల మనజనము, దేశము మీకు తెలిసియుండవలె. మరి మనలో ప్రబోధము కలిగినమీదట యీ దేశముగుండా ప్రయాణముచేసినవా రొకరు 'మీ రొకప్పుడు నిద్రించుజాతిగా నుంటిరి; కాని యిప్పు డభివృద్ధికి వచ్చులక్షణము లగపడుచున్నవి' అని పల్కియుండిరి.

ఉపాధ్యాయుడు

అవును. బుద్ధిలక్షణమగుప్రతిభ మనయందు కలదని నే నెరుగుదును. ఇప్పుడు కావలసినదంతయూ వృద్ధికిరాదగుదురు అనులక్షణము లే. ప్రతి మనుజుడును తనవాగ్దత్తముయొక్క భావమును తనమనస్సుకు నచ్చిన విధమున నే నిర్వచించుకోవచ్చును లే.

గుమాస్తా

ఒక్కవిషయముమాత్రము నాకెప్పుడునూ స్పష్టముగా అవగాహన కావడంలేదు. ఇటుచూడండి. మీరుచదువుకొన్నవారు; దయయుంచి తెలియచెప్పండి.! ప్రజలవృద్ధిలక్షణము అని వినవస్తున్నదే సహజముగా ఆ అభివృద్ధిబీజము ఏమిటండీ!

ఉపాధ్యాయుడు

ప్రజల వృద్ధిలక్షణమగు ప్రతిభయా? వాస్తవములో, అయ్యా, నేనంత దూరము లోపలికి పోలేను. కాని ఒకఅభిప్రాయముబలముపైనాధార

పడి ప్రజలు అనుసరించి పరుగెత్తుచుండు ఒకపదార్థమని మాత్రము చెప్పగలను. తప్పక ఫలకారి కాబోవు ఒకగొప్పవిషయము; అయితే ఎంతికాలమునకో! అదిమాత్రం గమనించి ఉండవలె!

గుమాస్తా

కృతజ్ఞుడను. ఇప్పుడు నేను చీకట్లో ఏమాత్రమూ లేను. అయితే ఇది ఇంకొక విషయమును మళ్లీ సూచిస్తున్నది. స్పష్టముగాదానిభావమును తెలియపరచగోరెదను.

ఉపాధ్యాయుడు

బిడియం లేకుండా మాట్లాడండి.

గుమాస్తా

రాబోతూ ఉన్నదే ఆసత్యకాలం వచ్చేది ఏనాటికి?

ఉపాధ్యాయుడు

ఎన్నటికీ రాదు!

గుమాస్తా

ఏమీ? ఎన్నటికీ రాదా?

ఉపాధ్యాయుడు

దీనిని నీవు సందేహింపగలవా? ఎట్లనగా అదివచ్చినప్పటికి ఆకాలము వర్తమానమే యగును. దానికి భవిష్యత్తేమీ యుండదు.

గుమాస్తా

అవును. అందు తప్పేమియూ నాకగపడుట లేదు; దాన్ని కాదనుటకే లేదు. అంతమట్టుకు స్థిరం. అట్లయితే ఒకవాగ్దత్తము యెప్పుడు సార్థకముగానుండును.

ఉపాధ్యాయుడు

మునుపుచెప్పినట్లు వాగ్దత్తముభవిష్యత్కాలమునుగూర్చియేయుండును; కావున భవిష్యత్తునకే సార్థకము.

గుమాస్తా

అవునుగాని యెప్పుడు ఈభవిష్యత్తునచ్చునో కొంచెం చెప్పండి!

ఉపాధ్యాయుడు

(స్వగతము) సరి. గుమాస్తాలు నట్టిమూఢులు. (ప్రకాశముగా) ముందు చెప్పియుంటినే; ఇది తేలికలెక్క; భవిష్యతు యెన్నటికి రాజాలదు. ఏలననగా అది వచ్చినప్పటికి అది భూతకాలమై పోయెను.

గుమాస్తా

ఆఁ! కృతజ్ఞుఁడను......

ఉపాధ్యాయుడు

అన్ని భావములలోను యేదో యొకతంత్రమువంటిది యిమిడియున్నట్లు తోస్తూయున్నది. ఈజనులలో కొంచెము ప్రాణగలిగి ఐదుకంటె పైగా లెక్కపెట్టగలవారికి కావలసినంత స్పష్టముగ నేది యుండునో దానినిమాత్రమే నేను గ్రహిస్తాను. వాగ్దత్తము చేయుటయనిన దానిని తప్పుట అనిభావము. మాటనిచ్చుటయు, మరల దానిని నిల్పు కొనుటయు యెట్లు సాధ్యపడును? దానిని ఆక్షేపించుట అపభ్రంశ మగును. మునుపు మాట నిలుపుకొనుట బహుకఠిన మనుచుండిరి; ఇప్పుడు తర్కసిద్ధాంతలేశమువలన నది యసాధ్యమని నిర్ధారింప బడినది—మంచిది. ఏదైన యితరవిషయముల విమర్శింతము. కొంచెము చెప్పు :—

గుమాస్తా

సద్దు.

ఉపాధ్యాయుడు

నీవు చెప్పునది యేమిటి?—

గుమాస్తా

హాఁ!

ఉపాధ్యాయుడు

ఎవరో హార్మోనియముమీద సంగీతము పాడుచున్నారని దృఢముగ చెప్పనగును.

గుమాస్తా

అవును; పాడేదివారే.

ఉపాధ్యాయుడు

స్వాములవారా?

గుమాస్తా

సరిగ ఊహించినారు.

ఉపాధ్యాయుడు

అదిగో విను. అరుణోదయముతో కూడ వారు లేచియుండవలయును.

గుమాస్తా

అది నాకు అనుమానమే. రాత్రి వారు పండుకొనియే యుండరని నాయూహ

ఉపాధ్యాయుడు

అట్లు తలచెదవా?

గుమాస్తా

ఆఁ. వారికి మనస్సు స్థిమితముగ లేదు: భార్య గతించినప్పటినుండియు ఏకాంతము వారిని పెక్కురీతుల బాధించుచుండును. వారు తమవ్యసనమును గూఢముగనే ఎంచుచున్నారనుట యథార్థము; కాని అప్పటచ్చట నది పైకి ఉబికివచ్చుచుండును. వారిహృదయము వ్యసనముతో నిండి తొణకుచున్నట్లు తోచుచున్నది; అప్పుడు వారు పాడు

చుందురు...ప్రతిస్వరమును వారు దారాపుత్రులకై పరితపించుచుం డిరో యనునట్లు విపరీతముగ నుండును.

ఉపాధ్యాయుడు

వారు మాట్లాడుకొనుచూ ఉన్నట్లుగ.

గుమాస్తా

ఒకరు దుఃఖించుచుండ ఒకరు ఓదార్చుచున్నట్లు.

ఉపాధ్యాయుడు

మనధర్మము మనల భావశూన్యులుగ నొనర్ప నుండినయెడల?

గుమాస్తా

మనము అధికారులము కాకుండ నుంటేనా? —

ఉపాధ్యాయుడు

శాసనములచే బంధితులముగాకుండఉంటే? మనస్థితిగతులయెడ గౌర వము లేకుండ ఉంటే!

గుమాస్తా

వానినన్నిటిని త్యజించి పారవైచి పుస్తకము పేనా "నాశనమైపోవు గాక" అని అనగలిగియుంటే!

ఉపాధ్యాయుడు

మనము తెలివిగలిగియుండుటను మానివైచి యితరజనులవలె భావిం చుటకు సాహసిస్తే!

గుమాస్తా

మిత్రమా! ఎవ్వరును చూచుట లేదు— ఒక్కసారియైనను భావో ద్రేకము అనుభవింతము.

ఉపాధ్యాయుడు

ఏమి! ప్రజాసామాన్యమునంవలి ప్రతిమూఢునివలె గౌరవమును తగ్గించుకొనుటయా? ఒక్కసారే రెండువిధములుగ నుండ యత్నించువారు గర్వితులేయని మనస్వాములవారి అభిప్రాయము. శ్రేష్ఠతమమగు సంకల్పమున్న ఏప్రాణికూడ రెండుగ—అధికారిగను, పురుషుడుగను (స్వతంత్రుడుగను) — ఉండజాలడు! విషయము స్వల్పమైనా ఘనమైనదైనా ప్రతిదానిలోను మనము గౌరవనీయుడగు మనకొత్వాలునకలుగ నుండవలయును.

గుమాస్తా

ఆయననకలు కానేల?

ఉపాధ్యాయుడు

మంచిది. వారిగృహమును భస్మముచేసెనే ఆయగ్ని ప్రతివారికి జ్ఞప్తిలో ఉండవచ్చును. దేవాలయములకు సంబంధించిన కొన్నికాకితములుమాత్రమే—అవే మిగిలినవి!

గుమాస్తా

అవును నాకు జ్ఞాపకమున్నది; అది జరిగిన దొకనాటిరాత్రి.

ఉపాధ్యాయుడు

తుపానుకొట్టుతూ ఉండినది. ఆనాటిసాయంత్రం; అవును. నీవు చెప్పినదే నిజము. అబ్బా! కొత్వాలు యెట్లా చచ్చి దుగ్గుడు అయినాడు, తనకు ప్రాణాలు మూడున్నవా యేమి అనేటట్లు! ముసలాయన ప్రక్కన నిలుచుకొని యున్నాడు. జవానికి ఆయన నవ్వు వినవస్తూయున్నది. ఆయనను చూచి భార్య కేకవేసినది.

అయ్యో "కొంప మునిగిపోయె. తప్పించుకొని బ్రతికే ఉపాయము చూడండి" అని మంటలలోనుంచి కొత్వాలు అరుస్తాడు. "నా ప్రాణ మా, దానితాడు తెగ, పోతే పోనియ్యి! కొంచెము కాలు గదలించి యిటువచ్చి గ్రామలెక్కలు బయటపడేమార్గము చూడండి!......" ఆయన బయట, లోపలకూడ కొత్వాలే సుమా; మధ్యనుంచి చర్మము వరకు, కాబట్టి ఆయన తాను పడినబాధకు తగినప్రతిఫలము పొందగల ప్రదేశము చేరగలడని నాకు నిశ్చయము.

గుమాస్తా

ఏమిటి అది?

ఉపాధ్యాయుడు

నీకు జబాబుచెప్పడము నిమిషము. కొత్వాలుగారు సుఖప్రదమగు స్వర్గములో.

గుమాస్తా

మిత్రశ్రేష్ఠమా,

ఉపాధ్యాయుడు

మంచిది.

గుమాస్తా

మీరుచెప్పే ప్రతిమాటలో యీకాలపుపోంగుసూచనలు వినబడు చున్నవని ధైర్యముతో చెప్పవచ్చు. ఏలయన, పూర్వాచారములయెడ నెంతకొద్దిమంది యిప్పుడు గౌరవము చూపిస్తూ ఉన్నారో గమనించినవా ళ్లెవ్వరు పోంగు ఉన్నదనుటలో సందేహ ముంచలేరు.

ఉపాధ్యాయుడు

క్రుళ్లిపోయినపదార్థము క్రొత్తవస్తువును పోషించును; నశించుచుండు వస్తువు మట్టిలోమాత్రమే కలియగలదు. మనతరమువారు క్షయ

ననుభవించుచున్నారు. దానిని దృఢమూలమున వెళ్ళగపెకిలించుటకు శక్తి యుక్తులు లేకున్నచో—(వీరిని) పాతిపెట్టవలసినకాలము కూడవచ్చును. ఉద్రేకమేమో యున్నది కాదనజాలము. కండ్లు తెరిస్తేనే అది అందరికి కనబడుతున్నది. పాతదేవాలయపతనము వీక్షించిన దివసము అంతవరకు దేనియాధారమున మనజీవితమును వ్రేళ్లుపారి గట్టిగనాటుకొని యుండెనో వానినన్నిటినికూడ తనతోడ కొనిపోయి నట్లున్నది.

## గుమాస్తా

జనులలో నొకవిషమగు స్తబ్ధత ప్రవేశించినది. పడగొట్టుమని అందరు అరచినవారలే. కాని పిమ్మట యెట్లో ఆయరపులు సమసిపోయినవి. చాలామంది రూక్షవీక్షణములతో పెడమొగము పెట్టి, యోచిస్తూ నిలబడ్డారు, ఆపాతగ్రామదేవళము శ్రద్ధతో బడగొట్టి చదరముచేసే సమయానికి. దేవాలయము నెడల అట్టి అకృత్యము నొనర్పరాదని కొందరు తలచినారు.

## ఉపాధ్యాయుడు

పూర్వకాలముతో తమ్మును వేయిపాశములు యిప్పటికిని గట్టిగ బంధించియున్నవని యీనూతనదేవాలయము దాదాపు పరిసమాప్తియగు వరకు దీనికొరకు యెదురుచూస్తూ యుండికూడ, జనులంతా అనుకునేనారు; అందుచేత అతిఆతురతతో మేల్కొలుపుని సందర్భము యెట్లా వస్తుందో అని చూస్తుండినారు. ఈ మహా దివసముకోసము యెప్పుడు పాతజెండా పారవేస్తారో, యెప్పుడు క్రొత్తరంగు లెగురుతవో అని మహాశ్రద్ధతో చూచేవారు. కాని యీగోపురము మెట్టుకు మెట్టు పైకి లేచేకొద్ది వారుమాత్రము ఎలవరపోయి నోరుకదపడమేమానివేసినారు. మరి యిప్పుడు; యిప్పుడెందుకు, కాలము యెట్లో గడచిపోయినది.

గుమాస్తా

(ప్రక్కన చూపుచూ) ఆగుంపు కొంచెము చూడు. చిన్న పెద్ద అంతా యెట్లాతోసుకొని వస్తూయున్నారో యిక్కడికి.

ఉపాధ్యాయుడు

వేలకొలంది; మంచిది! యెంతనిశ్శబ్దముగ నున్నారు.

గుమాస్తా

ఐన, పొంగుతూ ఉన్నది తుపానుకు సముద్రము పొంగినట్లు.

ఉపాధ్యాయుడు

అది జనులహృదయము; కొట్టుకొనుచూ, ఈకాలము ఘనము అనుభావ భరమున మూల్గుచున్నది. తాము నడచుమార్గము ఏదేని యొక గొప్ప యెన్నికలసమావేశమునకు కొనిపోవునని వా రెంచుచున్నారు. వేరొక భగవంతుని యెన్నుకొనుట! హీ, హీ! స్వాములవారు యెక్కడో? ఊపిరి కూడ ఆడడము లేదు. యెవరికి కనుపడకుండా దాగుకొంటే బాగుండును.

గుమాస్తా

నేనుకూడ అదేపని చేస్తా.

ఉపాధ్యాయుడు

ఇటువంటిసంసర్భములలో మన మెట్లున్నామో అనికూడ పరిగకనుక్కోవడము కష్టము! ప్రతిగోతికిని క్రిందయింకా లోతైన గుంటలుండును; మనము సంకల్పిస్తాముగాని చెయ్యము. కూలిపోతున్నా తృష్ణయేమో వదలదు.

గుమాస్తా

మిత్రమా !

ఉపాధ్యాయుడు

మంచిది !

గుమాస్తా

(దగ్గును.)

ఉపాధ్యాయుడు

ఏమి నీభావము ?

గుమాస్తా

మనము (నూతనావేశము) అనుభవించుచుంటిమని నానమ్మకము.

ఉపాధ్యాయుడు

అనుభవించుటా ? నేను లేదు.

గుమాస్తా

నేనుకూడ లేదు ఇది వాస్తవము. ఒక్కసాక్ష్యమువల్ల దొంగతనమునకు శిక్ష వెయ్యలేరు.

ఉపాధ్యాయుడు

మనమిద్దరము పురుషులము. అవ్యక్త బాలికలము కాదు. సెలవు తీసుకొంటూ, పాఠశాలకు పోవలయును. [పోవును]

గుమాస్తా

నే నొకమహత్తరమగు దృశ్యమును గాంచి నన్ను హేళనకు గురిచేసికొంటిననుట వాస్తవము ! ఇప్పుడు నేను మరల నేనే అయితిని; ఎదుటబడితిని! మూసినపుస్తకమువలె పలుకను; మాత్సర్యబుద్ధితో

విస్పష్టమగు తలతో వెడలిపోయి చలించెదను; ఇచ్చట అంతేయు సమతయే. సోమరితనము పైశాచికము.

[అనతలవైపునుండి నిష్క్రమించును.]

[తేలికగ వినవచ్చుచుండినగానము తటాలున పెద్దదై శ్రుతికటువగు అపస్వరముతో సమాప్తినొందును. అంతట భీష్ముడు ప్రవేశించును.]

భీష్ముడు

కాదు! దానిని పలుకున ట్లొనర్పజాలను. స్పష్టమగు ఒకపూర్ణస్వర మునుగూడ గ్రక్కించజాలను: గానము ఆక్రందనములో సమసిపోవు చున్నది! కప్పు, కమానులు, గోడలు, మూలలు ఒక్కటిగా మోసుకొని వచ్చి అన్నియు ఒక్కగట్టిశబ్దములేని కౌగిటిలో కట్టూపిరితోనుండు ఈస్వరములను శవముచుట్టునున్న పెట్టెవలె క్రమ్ముకొనునట్లున్నది. నేను యత్నించితిని; వాయించుచునే యుంటిని; కాని యీవాద్యము నకు కంఠము పోయినది. అంతట ప్రార్థనలో నాకంఠమును పైకెత్తి తిని; కాని ప్రతిమాటయు పలుకుచుండగనే విరిగి వాగ్బంధితమగు నొకబోలుమూలుగులో పగిలినగంటయొక్క త్రుప్పుపట్టిన నాదము వలె మరల నాపైననే విసరివేయబడెను......భగవంతుడు సింహాస నాసీనుడై నాపైననే యుండి వినుచుండెనా అనిపించెను: కోపము తో దనవద్దనుండి నన్ను వెడలిపొమ్మనెనా! నామాటవినకపోయెనా!— భగవంతుని ఆలయమును మహత్తరముగ కట్టెదననియే నేను నమ్మితిని: అట్లే ప్రతిన నొనర్చితిని: తేలికయగుహృదయముతో సాహసించి పడగొట్టి నేలమట్టముచేసి నాశనముచేయగలిగితిని—అదిగో పూర్తి గావింపబడినకార్యముకాన్పించుచున్నది—ప్రజలందరు "యొట్టిఘనత మనయెదుట నిలచియున్నది!" అని అరుస్తూన్నారు. ఒక్కకంఠముతో

'అవును అవు'నని పలుకుచున్నారు......వారే అన్యాయముగ విమర్శించువారు? లేక నాదృష్టియే స్పష్టతరమగునదియగునా? నేను సంకల్పించిన భవనము ఈగృహమేనా? నూతనమగు నీయారాధనమంటపమును నాచే గట్టించినసందేహము నల్లపడినదా?......అస్పష్టమగు దాని గుసగుసలు ఇంకను నాకు వినుపించుచున్నవి! బాధాభూయిష్ఠమగు లోకమును రక్షించు పెద్దగొడుగువలె నాభావప్రపంచమున ప్రత్యక్షమైన మహోత్కృష్టమగు పూజాగృహమేనా యిది? (ఉత్సవమునకుఁ గావింపబడుచున్న ప్రయత్నముల గాంచి) గాలిలో తేలియాడు జండాలు వ్రేలాడు పుష్పమాలలు; విద్యార్థుల గానాభ్యాసము; శిలమొదలు గోపురశిఖరమువరకు అన్నియు నలంకృతములై యొప్పుచున్నవి; గ్రామమంతయు జనులతో క్రిక్కిరిసియున్నది;—అందరును నన్ను చూడగలరు. అందరు నన్ను తెలుసుకొనగలరు;వారు నాపేరును బంగారు అక్షరములతో వ్రాసి పైకెత్తియున్నారు!... ఓసర్వేశా! నాకు జ్ఞానమును ప్రసాదింపుము. లేదా లోతుగ శ్మశానముక్రింద పాతిపెట్టుము. అక్కడ ఒకగడియ నేపైన ఊరకుండవచ్చును: ప్రతివారును గురువునుగూర్చియే యోచించుచున్నారు. ప్రతినోట వారినామస్మరణమే. అబ్బా!వారిభావమును నేనెరుగుదును. ఎరిగియుండుటచే నర్హుడనుగాని, వచియింపబడు ప్రతిమాటకు నా పరితాపము మిక్కిలి యగుచున్నది. పొగద్త మంచు ప్రవాహమువలె పారుచూ గారడివలె నాశిరమునులోపల కలగుండువరచుచున్నది... అహో! విస్మృతివసనమును నాపై గప్పుకొని యేదేని క్రూరవ్యాఘ్రవాసమగు గృహములోనికి దిగజారి యెవ్వరు కనుగొనకుండులాగున నాముఖమును దాచుకొందునా!

అగా

భీష్ముడు

కౌశల్యాలు

(అధికారచిహ్నములగు పూర్ణవేషముతో ప్రవేశించి సంతోషమున కిలకిలలాడుముఖముతో పరిచయము సూచించుచు) మంచిది పని దినాలుగడచిపోయినవి; కడపటికి మనపండుగ వచ్చినది. యిప్పుడు మనతెరచాపలను కొంచము చుట్టిపెట్టి యుత్సవపుజండాల గట్టవచ్చు. చెట్లు, గుట్టలు చూచుకొంటూ (తెప్పమీదనే) ప్రవాహములో తేలి పోవచ్చు. అన్నియును బహుబాగా ఉన్నవని ఆనందము ననుభవింప వచ్చు. ప్రసిద్ధపురుషుడవగు మిత్రమా! శ్రేష్ఠములగు నాయభినందన ములగైకొనుము. త్వరలోనే మీనామమునకు దేశమునందంతటను కీర్తి వెలయగలదు; ప్రేమార్ద్రములగు నాయభివందనముల గైకొనుము. నామనస్సు యిది కొంచెము తగిలినదనుట వాస్తవము. ఐనను ఆనంద ము నిండి తొణకుచున్నది. మీమనస్సులో యెట్లున్నది?—

భీష్ముడు

దాదాపు ఊపిరి ఆడకుండ నున్నది.

కౌశల్యాలు

ఆవిషయము ఇక పలుకవలదు. మీరు పరిహాసమునకు అనుచున్నారు. మీరు బోధించవలసియున్నది. మేఘగంభీరముగ నుపన్యసింపవలసి యున్నది. పూర్ణముగ ఉపదేశించండి; మిక్కుటమయ్యే టట్టు! అదే యెక్కుడపట్టిన మీకే కనబడుతున్నదిలేండి. నాకు తటస్థించినవాం డ్లంతా ఆశ్చర్యములో మునిగియున్నారు.

భీష్ముడు

వాస్తవముగానా?

కొత్వాలు

ఏలకారాదు? అవును ధర్మకర్తకూడ కనపడేదంతా చూచి మిక్కుటమగు సంతోషములో నున్నారు. మరి ఆవైఖరి చూచుట కెంత ఉత్కృష్టముగ నున్నది? ఎంత మహోత్తరమగురీవి? ఎంతఘనత? ప్రతివిషయము శాస్త్రనియమానుసరణమే.

భీష్ముడు

అదియుకూడ మీకు అగుపడుచున్నదా?

కొత్వాలు

ఏది కనబడుచున్నదా?

భీష్ముడు

మహోత్తరమని అనిపించు ఆరూపు.

కొత్వాలు

అదివరకు కనుపడుటయేకాదు—అది అట్లేయున్నది స్వామీ! దగ్గర నిలుచుకొన్న, చాలదూరమున నుండిన ఒకటే.

భీష్ముడు

అది నిశ్చయముగ నున్నది? ఆవిషయమునకు సందేహమే లేదు?

కొత్వాలు

వెఱ్ఱినాయనా! దానిని గురించి సందెహ మన్నమాటే లేదు — అంత పెద్దది మనకుండవలసినదేకాదు. దక్షిణదేశస్థులుకూడ గమనించవలసినంత పెద్దది అక్కడ పరిమాణములో ఇంకను పెద్దవాటి తారతమ్యముల నెఱుగజాలునంతటి దేశము లున్నవిగాని యిక్కడనో మారుమూల పనికిమాలిన గుట్టలనడుమ పడియుండు మన

ము, వాగుకు, కొండకు నడుమ చీలికవంటి యీ క్రొద్దినేలలో యుండుమనము దీనిని జూచి ఆశ్చర్యాన్వితులము కావలసినదే.

భీష్ముడు

మీరు వచియించునది నిజముగానే ఉండవచ్చును—మన మొకప్రాత యనృతమును వదలి క్రొత్తదానిని గైకొంటిమి.

కొత్వాలు

తరువాత యేమి?

భీష్ముడు

పురాతనకాలచిహ్నమగు ఆశిథిలశరణాలయమువైపునుండి నవ్యకళా వైఖరిని మేఘముల కెగబ్రాకు గోపురశిఖరముదిక్కునకు ప్రజల భావముల మనము మరల్చితిమి. పూర్వము జనవాక్యముల ఎంతపురాతనము అని ధ్వనించేది. ఇప్పుడన్ననో 'యెంతఘనము? యెంతగంభీరము? దేశమంతటలో దీనిని బోలినది లేనే లేదు.' అని

కొత్వాలు

మిత్రమా! ఇంకను పెద్దపరిమాణము కావలయునను మనుజుడు కొంచెము అధికముమాత్రము అని చెప్పక తప్పదు. నా కట్లాయున్నది.

భీష్ముడు

కాని యిదిమాత్రము అందరికి స్పష్టపరుపబడుగాక! దేవాలయము, యిప్పుడుండురీతి, చిన్నది. దానిని మరుగుపరచుట అసత్యమాడుటయే యగును.

కొత్వాలు

ఇటుచూడండి; తెలివిమాలిన ఆలాపనలు పూర్తిచేసినారా! మీరు శ్రమతీసుకొని కట్టించినదానిని మీరే చెడగొట్టడము యెక్కడి న్యా

యము? అందరును పూర్ణముగ సంతృప్తిచెందియున్నారు. ఎన్నడు చూచికాని, నిర్మింపబడికాని యుండనంత మహత్తరముగ ప్రతివస్తువు ఉన్నదని భావించుకొంటూ ఉన్నారు.

అట్టిభావనాప్రపంచములోనే వారి నుండనియ్యండి. దురదృష్టవంతుడగు ప్రతివానిని, అతడు వెలుగుచుండవలెనని కోరని దీపమును చూచునట్లెందుకు చేస్తారు. ఆకార్యానికై వారినెందుకు తొందరపెట్టుతారు. వీటిలోనంతా ముఖ్యవిషయము నమ్మకము. దేవాలయము కుందేళ్ళగూట్టంత ఉండవచ్చు—దానివల్ల అంత మునిగిపొయ్యేదియేమి యుండదు; ప్రజలుగాన నిష్కర్షగ అది మహోత్కృష్టముగ వున్న దనుకుంటూవుండేటట్లయితే.

భీష్ముడు

అన్నిటను ఒకటే మోసకృత్యపుసూత్రము.

కొత్వాలు

అంతేకాక యీదినము ఉత్సవము; వారందరు మనయతిథు లనదగినవారు. అతిథులతృప్తికొరకు మనము సర్వప్రయత్నముల నొనర్పకుండుట సరియగుమర్యాద కాజాలదు. వీటిఅన్నిటికంటె ముఖ్యముగా మీస్వంతముకొరకైనా స్వల్పము అను యీబాధాకరమగు బొబ్బను యథార్థమనెడి మోటుచేతితో ఒత్తివేయుట అమితమగు పొరపాటు కాగలదు.

భీష్ముడు

అదియెట్లు?

కొత్వాలు

ఇంకా మీకు తెలుపకుండా జరుపడమెందుకు? మనసభ్యులందరు మీకొకవెండిగిన్నెను బహుమతి యియ్యబోవుచున్నారు: మీరు దేవా

లయమునుగూర్చి చిన్నమాటలు మాట్లాడినయెడల గిన్నెపై చెక్కి-యుండువ్రాత తప్పుగ కనుపడతుంది. అపుడు యిందులకై ప్రత్యేకముగ వ్రాసియున్నపాట, ఉపన్యాసము—నేనే యుపన్యాసకుఁడను—ఇవిరెండును అపభ్రంశపుపెద్దమాట లనిపిస్తవి. మీరుగానమమ్ముల నిట్లే వెనుకకు నెట్టివేస్తే అందువల్ల మీరు మామాటకు లోబడి మీమనస్సును నిష్కళంకముగ కుదురుగ ఉంచుకోవలయును.

భీష్ముడు

ఆహా! కనబడుచున్నది—ఇది నాకండ్ల కనేకమార్లు నొప్పి గలిగించుచుండును—అబద్ధములకు బహుమానము అబద్ధాలపండుగయే.

కొత్వాలు

దేవుడు మనల రక్షించుగాక! మిత్రరత్నమా, యిట్టి తీక్ష్ణమగు భావవలన నేమిసూచింపనెంచెదరు? మరియిప్పుడు—అభిరుచివిషయమును వదలిపెట్టుతాము—చెప్పవలసినది వేరే కొంతవిషయ మున్నది. మొదటిది వెండి అయిన ఇది బంగారు. యిది తెలుసుకోండి! మహోన్నతమగు రాజాదరణ మందహాసముచే భూషితులై యున్నారు. అనగా 'పరివ్రాజకాచార్య' అనుబిరుదు రానున్నదనుమాట. ఈ దినము నవ్యాలంకారశోభితులై గర్వాతిరేకమున ప్రవర్తింపగలరు...

భీష్ముడు

అంతకంటె భారమగు పదార్థమే నాకు ఒత్తిడిగలిగించుచున్నది. చేతనైనవారు దానిని నావద్దనుండి గైకొనుడు!

కొత్వాలు

ఏమి! ఈ అత్యంతముఖ్యమైనరాజాదరణభాగ్యమునుగూర్చిన నావచనము చలనములేకయే వినుచున్నారే! మొత్తముమీద మీరొకసమస్య—కాని—మనము మధ్యలో నున్నాము—గమనము చేసుకొండి.

భీష్ముడు

(కాలితో నేలను తన్నుచు) మీరు పలుకునదంతయు ప్రొద్దుపోని మాటలే. మనము కలసినప్పటికంటె వీడిపోవునప్పటికి యెక్కువ వివేకవంతులము కాలేదు. నామాటల వెనుకనుండిన భావములో నణు మాత్రమైనను నీవు కాంచనేరకున్నావు. నేను వచియించిన ఘనత అంగుళముతో కొలువతగినది కాదు; అది యాచ్ఛాదిత మయ్యును ఉత్తేజితమై ప్రజ్వరిల్లనోపును; చలిగలిగించియును ఆత్మను మండునట్లొనర్చును (జ్వలింపచేయగలదు); వదలిపోవని స్వప్నములవైపు రమ్మని దారితీయునట్లుండును; నక్షత్రశోభితమగు రాత్రివలె మన కౌన్నత్యము నాపాదించును; మరియు—నన్ను వదలిపెట్టండి; ఆయాసమువలన సోలిపోవుచున్నాను; ఇతరులతో మాట్లాడండి, వాదించండి, విమర్శించండి. [దేవాలయమువైపు పైకిపోవును.]

కొత్వాలు

(తనలో) అర్థశూన్యములగు నీయవ్యక్తపుమాటలలో లేశమైనను భావము నెవ్వడు కనుగొనగలడు? ప్రజ్వరిల్లునట్టి ఘనత......దారితీయుట......అంగుళములలో దానినెవ్వరు లెక్కింప లేరు...... అటుపిమ్మట......నక్షత్రశోభిత మగు రాత్రి?......ఉదయముననే స్వాములవారు కొంచెము సేవించినట్లు అగుపడుచున్నది. [పోవును.]

భీష్ముడు

(మైదానముమీదుగా మరల ప్రవేశించి) ఆఘోరపర్వతపంక్తులపైన సహితము ఒంటరితనము యిక్కడివలె యింతభయావహముగ నెన్నడు నుండలేదు! ఇచ్చట ఒక్కప్రత్యుత్తరమైనను స్పష్టముగ తిరిగి వచ్చుట లేదు; 'గురగుర బెకబెక తటతట' అనుశబ్దములు తప్ప. (కొత్వాలు పోయినవైపు చూచుచు) అహో! నామడమక్రింద వేసి వీనిని నలిపి వేయచాలుదును! టక్కరితనము, అనృతము వీనినుండి ఇతనిదృష్టిని

భీష్ముడు

నేను పైకెత్తజూచునపుడు — వాగకుండయుండజాలక — జుగుప్సాకర మగు తనయాత్మను నాకన్నులయెదుట నుమియుచుండును. ఓసుధా! నీవేల అంతబలహీనురాలవుగ నుంటివి? ఈకపటనాటకముతో సలసి నాతల తిరుగుచున్నది. ఎవ్వరును ఓడుటలేదు; ఎవ్వరు గెలుచుటయు అబద్ధము. అవును ఏకాకినై సమరమొనర్చుట నిష్ప్రయోజనము.

ధర్మకర్త

(ప్రవేశించి) వాయనలారా! క్షమింపుము సోదరా! నేనుచెప్పబోవు— ఈకార్యసంరంభమునలన నేను మరచిపోతిని......ఉపన్యాసము నాతలలో పరుగులిడుచున్నది......నిన్నటిదినమే దానిని నేను సిద్ధముచేసినను నానోటియందు ఆవాసన యింకను నిలచియేయున్న ట్లున్నది.—అంతమట్టు కది అభ్యంతరములు సరకుచేయక కొండను పగులగొట్టినందులకు ఇవే నానమస్కృతులు. పడిపోవనున్న దానిని పడగొట్టి అర్హ్వముగ, ఘనముగ, నూతనముగ నిర్మించితిరి.

భీష్ముడు

అర్హ్వముగ కాదు.

ధర్మకర్త

ఏమిటి ఆవాక్యము? ఏమికొరత, దీనికి సంప్రోక్షణ మొక్కటితప్ప?

భీష్ముడు

నూతనముగ నిర్మితమైనయీగృహము స్వచ్ఛమగునాత్మల నొసంగి హృదయముల నుద్ధరింపజాలియున్నచో?

ధర్మకర్త

అవి క్రమానుగతికములు. సొగసైనచెక్కడపు పనిగల ఆపైభాగము, కప్పు, దీపకాంతిశోభితమగు ఈవిశాలప్రదేశము, యివియే సహా

జముగ ప్రజల నుద్ధరించుటకు తోడ్పడగలవు. వృద్ధిపొందుచున్న వారి పలెకన్నింప జేయగలవు. ఆప్రతిధ్వనియు స్వాము లుపన్యసించునపుడు ప్రతిపలుకును ఇనుమడింప జేయుటచే శిష్యబృందముయొక్క భక్తిని గూడ నూరింతలుగనైన వృద్ధిచేయగలదు. నిష్పక్షపాతబుద్ధితో పరిశీలించితే యింతకంటె చాలవిశాలములగు దేశములలో ననేకము ఇంత కంటె శ్రేష్ఠతరములగు ఘట్టములు చూపజాలియుండవు; ఇదంతయు మీవలన గలిగినది. హృదయపూర్వకమగు కృతజ్ఞత వెలిపుచ్చుటకు మీసోదరి కనుమతి నోసగుడు. ఈయుత్సవకర్తలు స్వస్తివాచకముల మధ్య, అర్థమగు రంగాలంకారములనడుమ అనర్గళములగు ననేకోప న్యాసములతో ఇంతకంటె అధికముగ తమకృతజ్ఞతను తెలుప నున్నారని యూహించెదను. మనవవకుమారసింహములనుండి — అయితే యిదేమి స్వామీ! అంత పాలిపోయిన ట్లున్నారు!......

భీష్ముడు

చాలకాలముక్రిందటనే నాహృదయము స్వాధీనము తప్పిపోవ మొదలిడెను.

ధర్మకర్త

సహజమే— విచారించవలసిన దింతయుండడము-నిలిచి సహాయపడే వారెవరు లేకపోవడము— అయితే యిప్పటికి కష్టాలు విరగడై పోయినవి. అన్నిలక్షణములు అదృష్టదినసమని సూచిస్తూవున్నవి. ఎంతోదూరానవుండే గ్రామాలనుంచికూడ వేలకొలదిజనులు ప్రగహిస్తూవున్నారు. ఇప్పుడు విచారిస్తూవుండబోకండి. అదిపోతుందిలెండి నిశ్చయంగా. సమయమువచ్చినపుడు అనర్గళమగు మీవాగ్ఝరిమహిమతో నెవ్వరీడు రాగలరు? యోచించండి. మీబ్రాహ్మణసోదరులం చాలమంది, పూర్ణహృదయముతో మీకు స్వాగత మిస్తూవున్నారు.

భీష్ముడు

నిండి తొణకుచున్న కృతజ్ఞతతో యీ సామాజికులందరిహృదయములు వెచ్చనైయున్నవి. మరియు, ఈకార్యము—ఎట్లు వృద్ధిగాంచినది? మనోహరమగు నీయలంకారమో! చూడు! మరి యీనాటివిష యము— ఎంతయుత్కృష్టమైనది? తర్వాత...... నోరూరజేయు ఆవిందు! స్వామీ! ఇంతకు ముందే మీయింటివద్ద నుంటిని. వారు మాంసము కోయుచుండిరి. అది చాలమంచిమృగమై యుండవలె. అంతమంచిభాగము దొరికేటప్పటికి చాలాకష్టమై యుంటుందనుట వాస్తము. అందులో శేరు పదమూడణా లమ్మేయీదినాలలో— కాని...దానిని పోనియ్యండి. విందుకు జొయ్యేలోగా నాకుకొంచెము పని వున్నది ఇక్కడ.

భీష్ముడు

నన్ను వదలిపెట్టకండి! పాడువండి; నరకండి; నన్ను చీల్చివేయండి!

ధర్మకర్త

నామతము సౌమ్యమైనదే. క్లుప్తముగా— వ్యవధి లేదుగావున—మీరు అధికముగా దృష్టిపరపవలసినది ఒక్క చిన్నవిషయముమాత్రము గలదు. అది కష్టముగా నుండదు—ఓ, అవును, నామాటలు సూచించు విషయమును మీ రూహించగల రనుటలో నాకు సందేహమే లేదు. ...అది మీయధికారధర్మము స్వామీ! ఇప్పటికి మీరు చాలసార్లు నడవడి, అలవాటు, వీటిమీద ఏమీ పూని చెప్ప లేదనుట వాస్తవము. అలవాటు, నడవడి, విషయములలో ప్రధానములు గాక పోయినా అధమములు మాత్రము కానేకావు దేవుడు మిమ్ము రక్షిం చుగాక! మిమ్ము ఆక్షేపించుట నాయుద్దేశము కాదుగాని మీ కను భవము లేదు. ముసలివారా కారు. నగరమునుండి పల్లెటూళ్లకు క్రొత్త గా విజయముచేసినారు. ఇతరులప్రవర్తన నెరుగుటకు కొంతకాలము

పట్టును. మరి యిప్పుడు మిత్రమా! యింకా కొంచెము జాగ్రత్తతో ప్రవర్తించడము అవసరము. మీరు బోధించినంతలో ప్రతివాని ప్రత్యేకావసరములయెడ నధికముగా దృష్టినుంచితిరి; అదీ మీరుచేసినగొప్ప పొరపాటు. వద్దు వారిగుణాగుణముల మొత్తమును ఒకటిగా చూడండి. అన్నిటి కిని ఒక్కకుంచెతో పూతపూయండి. నామాట నమ్మండి. మీరు యెక్కువగౌరవము సంపాదిస్తారు.

భీష్ముడు

మీయర్థమును స్పష్టపఱచుడు.

ధర్మకర్త

ప్రజలమేలుకొఱకై మీరొక దేవాలయమును గట్టించితిరి. శాంతి, శాసనాధికారము అనుభావముల పైని యాచ్ఛాదనమువలె ఆదేవాలయముండవలయును. రాజ్యమునకు మతమేమియగును? ఔన్నత్యము గలిగింపజాలుశక్తి; ఆధారపడియుండదగుబలము; నైతికజీవనమునకు సంరక్షణకర్త: కొన్నిసమయములందు ప్రభుత్వమునకు మార్గములు కలవగును; అది తనద్రవ్యము విలువ తనకు మరల జేరగోరును; మంచిహిందువు అంటే మంచిపౌరుడు అనియే. ప్రభుత్వము తనద్రవ్యమును పూరికే పంచిపెటుతుందా యేమి? దేవునికి మనుష్యులకు మేలుచేయడానికి—అందువల్ల కష్టాలు మాత్రము తెచ్చుకుంటూ? కాదుస్వామీ! ప్రభుత్వ మేమంతటియున్నత్తమైనది గాదు; మరి మనస్థితిగతులు అధోగతిలోనుండేవే, ప్రభుత్వము గాన అప్రమత్తతో యీజీవితమునే కంటిలో బెట్టుకొని యుండకపోతే. అయితే అది తనగమ్యమును తన అధికారులమూలమున—యీసందర్భములో తనవిద్యాబుద్ధుల నేర్పు గురువులమూలమున-మాత్రమే చేరగలదు.

భీష్ముడు

కానియ్యండి! ప్రతిమాటయు ఋషులకు సమ్మతము కాకున్న దేగలదు.

ధర్మకర్త

ఇంక నేమియు లేదు. రాజ్యమునకు లాభ మొనగూర్చుటకై మీ రిప్పుడీదేవాలయమును నిర్మించితిరి. కావున దీనిసాహాయ్యార్థమే యీ దినముమొదలు మీకార్యము లెప్పుడును నిర్దేశింపబడవలయును. ఒక గంటలోపల గావింపబడు మాయుపన్యాసములలో ఈభావమే వ్యాపించియుండగలదు: ఘంటారావములో నిదియే వినిపించుచున్నది. దానకార్యములో నిదే కాన్పించుచున్నది. (ప్రతి)దానము ననుసరించి యొకవార్తయుండును. దాని సారాంశమును మీరు పూర్తిగా వేరు పలుపవలయును—

భీష్ముడు

దైవమా! నే నెన్నడు అట్లుండవలయునని యెంచలేదు.

ధర్మకర్త

సరే! కార్యము మిగిలిపోయినది. ఇక ప్రయోజన ముండబోదు. మీరే యెరుగుదురు.

భీష్ముడు

ఆహా! అదే వాస్తవమో కాదో త్వరలోనే చూచెదముగాక!

ధర్మకర్త

మీ కెదురుగా మందహాస మొనర్చినందులకు క్షమింపుడు. మిమ్ముల నుసత్తులుగ జేయజాలినవిషయ మిచ్చుట నేమున్నది? మీ కేమిచెడ్డ వార్తయు చేయబోవుటలేదు. అప్పుడుగూడ ప్రతిజీవికిని ప్రత్యేక

భీష్ముడు

ముగా, మొత్తముమీద రాజ్యానికి కూడ మీరు సేవ యొనర్పవచ్చును. ఇతరగురువులవలె మీరుకూడ వర్తిస్తే మీయిద్దరియజమానుల అవసరములతో మీరు పరిచితులు కాగలరు. ఎల్లయ్యను, పుల్లయ్యను నరకలోకపుజ్వాలలనుండి రక్షించుటకు మాత్రమేకాదు మీ రీవృత్తి నవలంబించినది; మరి, భగవంతుని పరిపూర్ణమగు కృపాసముద్రమును దేశమందంతటను పొర్లునట్లు ప్రవహింపజేయుటకు; మొత్తముగా (నందరు) రక్షణపొందినారంటే, ప్రతిచిల్లరజీవిగూడ తన్ను దా నెరుగగలదని చూపుట సులభమే. ప్రజాప్రభుత్వవాదులలో సగమువారము గాన (బహుశా మీరెరుగరేమో) మనరాజనీతి స్వాతంత్ర్యమును నిషిద్ధములక్రింద నుంచును కాని సమానత్వము మీదమాత్రము దాదాపు పడిచస్తూవుండును. ఇప్పుడు ప్రతిచిన్నగుట్టను చదరముచేయనిదే దీనిని మనము పొందజాలము. అయితే మీరు చేయకుండావుండేది అదే! పైగా ప్రతిచిన్నబోటును, (బహుశా అవి కనబడకుండా గూడ వుండినవేమో) యింకా ఉన్నతముగా చేస్తూవచ్చినారు. దేవళానికి పొయ్యే ప్రతిమనిషి యిప్పుడు ప్రత్యేకవ్యక్తి: మొత్తములో నొకభాగముమాత్రమే కాదు; అట్లుండడము రాజ్యానికి యేమాత్రము లాభము లేదు. అంతేకాదు. అందువల్లనే శిస్తులు వసూలుచేయడము (దేవాలయఖర్చులకు) యింత ఆలస్యము కావడము, సంఘు మొసగు యితరధర్మములకోసరము కనిపెట్టుకొనియుండడం సంభవిస్తూఉన్నది; దేవాలయకార్యమంటే— ప్రకృతులు భిన్నమైపోవుటవలన— యెవ్వరికి అంతయిష్టముగా కనిపించడము లేదు.—

భీష్ముడు

ఆహా! యెట్టిదృశ్యము సాక్షాత్కరించుచున్నది!

ధర్మకర్త

విచారించవలదు. అందువలన ప్రయోజన ముండబోదు; మనిషిని తిక మకలు పెట్టుటకు యీగందరగోళము చాలియున్నదనుట వాస్తవమే కాని ప్రాణముండేటంతవరకు ఆశగూడ వుండనేవుంటుంది; మతవిష యములయెడ మృదువగురాజకీయదృష్టి నవలంబింప ననుజ్ఞనొసగి నీదానము నీధర్మమును వృద్ధియొనర్చెను. ప్రతివిషయమును శాసన బద్ధమే యగును. ఉత్తయధికారములు హద్దులకు వెలుపలగూడ వా టినే నమ్ముకొనియున్నయెడల, మరగని అడవిగుఱ్ఱపుపిల్లవలె కంచెలు, కాల్వలు దాటి ఆచారములు అను పొలిమేరగుర్తులనుగూడ నతిక్ర మించి శరవేగముతో పారిపోగలవు. ఏర్పాటు సర్వత్ర ఒక్కశాసన మును మాత్రమే యెరుగును. దానికి పేరులు మాత్రము వేరు వేరుగా నున్నవనుటలో సందేహము లేదు; లలితకళలలో దానిని మతము అందురు; రణశిల్పమున ఆదర్శమనెదరు. అది పదముల గమ నించుటయే లేక కాలముననిగూడ అనవచ్చు. నేను చెప్పునది సరి యేనా? అవును. మిత్రమా! అదీ మనకుకావలసినవిషయము. దీనివైపు నకే రాజ్యతంత్రజ్ఞులు మరలవలయునది. కాలమును గమనిస్తూ (ఇది అమితఆలస్యపుపని) పరుగెత్తుట అసాధ్యము. ప్రతిమనుజుడు ఒక్క టిగా అడుగులువేయుటయే రాజ్యతంత్రముయొక్క గమ్యము, ఆద ర్శము.

భీష్ముడు

సారువడేగకు జలదారికాలువయు, బాతులకు మేఘమాలికల గగనవిహా రమేనా?

ధర్మకర్త

దేవునిదయవలన మనుజుడు మృగమున్మాత్రము కాడు. ఉపమానాలే కావలయునంటే మనపురాణగ్రంథాలలోనివే వాడుదాము. అవి సరి పోనిసందర్భము ఒక్కటికూడా నుండదు. సృష్టిప్రారంభముమొదలు జ్ఞానసాక్షాత్కారమువరకు గూఢార్థప్రతిపాదకములగు విషయముల తోను, నీతికథలతోను అవి నిండియున్నవి. సంకల్పింపబడిన బావి లోను గోపురమును గూర్చి మాత్రము యీతరుణమున ప్రస్తావించె దను. ఎంతవరకు దానిని ఆసుజనులు సాధింపగలిగిరి ? కారణము తెలి యజెప్పుట సులభమే : వారు మాట్లాడుచుండిన భిన్నములగుభాషలే: వారిలోవారు కుట్రలు పన్నవలసివచ్చుటయే : ఒకరికొకరు వ్యతిరేక ముగా గుంజులాడుకొనుటయే, అనగా ప్రత్యేకవ్యక్తిత్వముల బలపర చుకొన్నారనుమాట.— ఇందులో రెండురహస్యాలు గోచరించు చున్నవి.కథలోగలరెండునీతులలో నిది సగముమాత్రమే: ఏకాకియగు వాడెవ్వడును సురక్షితముగ నుండజాలడు అని; ఇతరసంబంధము లేనిదే త్వరలో నశించును. తాను పతితునిగ చేయనెంచిన మనుజునికి భగ వంతుడు మొదట ప్రత్యేకవ్యక్తిత్వ మొసగును. ఇట్టివానిని దేవత లున్మత్తునిగ నొనర్చుచుండిరని పూర్వము రోముదేశీయు లనుకొనెడి వారు: దానిలో గలలాభముల నెంతయెక్కువగా లెక్కవేసినా కూడా ఒకరే యొక్కపక్షమున నుండుట వెర్రితనము. అట్టివానికి అంత్యకాలమున కష్టదశ సంప్రాప్తించుట వాస్తవము.

భీష్ముడు

ఉండవచ్చును కాని వృథాగా వాగ్వ్యయమెందుకు మీకు? మరణ మనిన నా కేమియుఘోరముగ గాన్పించుట లేదు. మరియు, మిత్ర మా! ఆ నిర్మాణకర్తలు ఒక్కమనసుతో, ఒక్కమాటతోనే ఉండి

యున్నచో వారాబాబిలోను గోపురమును స్వర్గమువరకు యెప్పుడైన నిశ్చయముగా కట్టగలిగియుండెడివారే యని మీకంతదృఢముగ నమ్మక మున్నదా?

ధర్మకర్త

స్వర్గమునకు? కాదు. అది యెవ్వరును చేయజాలనిపని. పూర్తిగా స్వర్గమునకు చేరుటకు!—అదీ మనకథ పిడికిటిలో నిమిడియున్న రెండవసారాంశము: అత్యున్నతముగ నిర్మించి ఆకాశమును మించ నెంచువాడు పాతిత్యమునకే కట్టుచున్నాడు.

భీష్ముడు

ఐనను పరశురాముడు స్వర్గమునకు మెట్లుకట్టెను. స్వర్గమును జేరుట కింకను మానవాత్మ యత్నించుచున్నదికదా!

ధర్మకర్త

నిజమే!—ఆమార్గములో! దేవునియెయువల్ల ఆవిషయములో భేదాభిప్రాయములకు స్థలమేలేదు! సన్మార్గమున వ్యయించినజీవితమునకు, భక్తిప్రార్థనలకు, సహజమగు బహుమానమే స్వర్గము. జీవితమనునది యొకవిషయము; భక్తియనునది వేరొకభావము; వానిని కలుప ప్రారంభించినపుడు రెండును చెడిపోవును. మనము పనిచేయుదినములు యెన్నియున్నవో మీరెరుగుదురు. మిగతవి భక్తికిగా విడలియున్నాము. సంవత్సరాదిమొదలు ఫాల్గుణబహుళ అమావాస్యవరకు దేవాలయమును ఎప్పుడు తెరచియే యుంచేయెడల పండుగలవలన నింకేమి యుపయోగము? మట్టసముగ ఉపయోగపరుస్తూఉంటే తప్ప ఆమాటకుగల పాపప్రక్షాళనశక్తి నశించిపోవును. శిల్పమునకువలెనే మతమునకుగూడా సమయానుకూలమగు కేంద్రీకరణము అవసరము. గర్భ

గుడిలో సురక్షితముగ నున్నంతకాలము ఆదర్శముపైననే ఏకాగ్రదృష్టి నుంచి యుండుము. కాని దేవాలయము లోనుండి వెలుపలికివచ్చుట తోడనే పట్టుబట్టతో గూడ దానిని మూలలో నుంచుము—అప్పుడు ఇతర సాధారణశాసనముల గమనింపవలయును: అవి గీయుగీతలను దాటకుండవలయును: ఈవిషయమై కొంత స్పష్టపరచవలసినయవ సర ముండుట గమనించియున్నందున ఇంతిగా మాట్లాడినాను.

భీష్ముడు

నా ఆత్మీయమతమును పూర్ణముగా చెక్కుచెదఱకుండున ట్లుంచవలసి యున్నచో మీరాజకీయములకు గూండ్లలోనికి అది పోజాలదు

ధర్మకర్త

మిత్రమా! త్వరలోనే మీకు సరిపోవుగూటినే కనుగొనగలరు. ఐతే ఇంకాఉన్నతమగు అలమరమీద: మీరు పైకిపోవలయును —

భీష్ముడు

ఇంకా పైకిపోవడమంటే రొంపిలో ఇంకా క్రిందికివంగి దిగబడిపోవ డమే అవునా?

ధర్మకర్త

"వినయభూషణుడు ఔన్నత్యము పొందగలడు." వస్తువుల పట్టు కొనుటకు కొక్కీని వంచియుంచుట అవసరము.

భీష్ముడు

ఉపచరించవలయునన్నచో మనుజుడు చావు చచ్చేతీరవలయును.

ధర్మకర్త

ఎటువంటి సారాంశములోనికి పట్టికొట్టినారు! చావడమునుగూర్చి యెవరు మాట్లాడినారు?

భీష్ముడు

అది మీ భావము. మీ జీవచ్ఛవత్వమునకు సరిపోయియుండవలయు నంటే మనుజులు శుష్కించి రక్తశూన్యులై, త్రాణలేక, ప్రాణవిహీనమైన అస్థిపంజరములై యుండవలయును!

ధర్మకర్త

నే నొకపిల్లికైనను రక్తస్రావము కలుగజేయనివాడ నని దేవుడే యెరుగును.—— అట్లుండు, మీ సిరలనుండి రక్తము దీయ నెంతునా! నా మట్టుకు నేను చాలదూరము ప్రయాణమొనర్చియున్న రాజమార్గముపైనగల ద్వారమునుమాత్రము బాగుగా తెరచి వదలిపెట్టెదను. అందులో బాధ యేమియు నుండదని యెంచెదను.

భీష్ముడు

ఆద్వార మెచ్చటికి దారిమాపునో మీ రెరుగుదురా? రాజ్యశాసనము నోడికూతతోనే, నేను దేనికొరకు యీ దినమువరకు జీవించి యుంటినో ఆ యాదర్శమును మంటగలుపవలయు ననియేకదా!

ధర్మకర్త

మంటకల్పుటా? అట్టిమాట లెన్నటికి క్షంతవ్యములు గానేరవు. (అట్టి మాటలనాడుట మీకు భావ్యము కానేరదు) నాయుపదేశము గాన మీరను సరిస్తే మాకు,—రాజ్యానికి,—ఉపయోగముండని కొన్ని విషయముల మాత్రము మీరు విస్మరింపవలసియుండును అనియే నేను చెప్పినది. మొదట వాటి అంచుల నన్నిటిని కట్టగా తీసి ముద్రవేసి పట్టుకొనియుంటే, మీరు ప్రేమతో పోషిస్తూ ఉన్న ప్రతిభావాన్ని అప్పుడు సహితము ఉంచుకోవచ్చు. మీ భావాల స్వైరవిహారానందమును, యత్నముల సం

చారభాగ్యమును, అనుభవింపుడు—అయితే మీశిష్యబృందము ఎదుట మాత్రము వద్దు! నామాట నమ్మండి! ఇంత (పెడకట్టైతనము) మెడ విరుసుతన ముంటే కష్టాలు తప్ప మరేమిన్ని మీకు కలుగబోవు.

భీష్ముడు

ఔను, కష్టమన్నచో భయము, లాభమంటే ఆశ, రెండు హత్యా చిహ్నములు, మీనుదుటిమీద అడ్డముగా వ్రాసియున్నవి. ప్రాపంచిక శిల్పముతో నీనిర్మలహృదయకమలమును ధ్వంసమొనర్చితివే యని ఏడుపు.

ధర్మకర్త

(స్వగతము) ఇతడు నన్ను స్పష్టముగా 'నీవు' అంటున్నాడు! ఇది అధిక ప్రసంగము. (ప్రకాశము) వాదము నిక పెంచక ఇది తెలుసుకోండి అనివిన్నవించెదను మీరు జీవించియుండు యీకాలమును యీదేశమును తమరు బాగుగా తెలుసుకొనవలయును. లేకపోతే మీ కార్యము వ్యర్థమే. ఎందువల్లా అంటారా, యీకాలము మీకు చేయూత యొసగుతూ ఉడకుండా ఉంటే విజయము మి మ్మెన్న టికి కనుక్కొనజాలదు. మాశిల్పులు, కవులు,—తమపారుగువారి అభి రుచుల నెదుర్కొన సాహసింతురా? మాశూరులు మట్టుకూ? కరవాల మంటే అకలుషితముగ మోటగు ఒకపదార్థమని మాలోనిభావము. ఇదంతా యెందువల్ల? 'మీదేశావసరముల గమనించండి' అని ఆపర్వా క్యము విన్నవిస్తూ ఉన్నదికావున ప్రతిమనిషియొక్క కర్తవ్యము వానిజాతెలోనే ఉండవలయును. గుబ్బవలె పైకి వచ్చియుండుటకు బదులు వాడిని జనసామాన్యముతో సమముగా పడియుండనిమ్ము... ...ఈకాలము దయార్ద్రమని కొత్వాలు చెప్పుతూ ఉంటాడు;

కరుణామయమగు మార్గముల నవలంబించినయెడల శ్రేష్ఠములగు కార్యముల కొంతవరకు చేయనగును అయితే మీకునులుమాత్రము కొట్టి వేయవలయును. లోపాలతో నిండియున్న ప్రతిచిన్న రెమ్మను కత్తిరించివేయవలయును! ఒక్కప్రత్యేకవిషయముపై దృష్టినంతయు నుంచక యితరులవలెనే మీరుగూడ సాఫుగా పోతూవుండవలయును. అట్లుగాన అయితే మీకార్యము చిరస్థాయి కాగలదు.

భీష్ముడు

చాలదూరాన—ఇక్కడికి చాలదూరాన!

ధర్మకర్త

సహజము, అదిసహజము! మీవంటిపురుషుడు సకాలమున యింత కంటెనున్నతమగు ప్రదేశమునకెక్కి తీరగలడు; కాని అక్కడకూడ ఇక్కడవలెనే మీ కీ కోర్కెయే యున్నయెడల, కాలము నిర్దేశించు వేషమునే వేయవలసియుండునని మీరు కనుగొనగలరు. ... కాలమును సాధారణశ్రీష్ఠి కలక్రిందికి దెచ్చుటకు చేవబెత్తముగల రక్షకభటోద్యోగి కావలయును— మరి మనసాయకుల కిప్పుడు నిజమైన కవా తిచ్చుఉద్యోగి శ్రేష్ఠతమమగు ఆదర్శము. సుబేదారుడు శ్రేణులు శ్రేణులుగా నెట్లు తనభటుల భగవత్పూజార్థము నడుపుచున్నాడో అట్లే స్వాములవారు తనవారిని, గ్రామములు గ్రామములుగా స్వర్గమునకు జేర్చవలయును. ఇదంతయు ఎంతో సులభము! భక్తికి ఆధారము శబ్దప్రమాణముఅని యెరుగనగును. అర్హమగు జ్ఞానమువలన కేర్పడియున్న యీప్రమాణమునందు జనులు సంపూర్ణమగు నమ్మిక ముంచెదరు. పిమ్మట... మనభక్త్యుద్యమమును ప్రచారమొనర్చుటకుమార్గమా. సూత్రములలో ఆవిషయమై సందేహమే లేదు.

కావున సోదరా! విచారించబోకు— స్పష్టతరములగు అభిప్రాయ ముల నెరుగుటకు కాలమును వినియోగించుడు. సందర్భముల బాగుగా పరిశీలించుడు. మనస్సునకేమి తొందరలేకుండా మాత్రము చూచు కొండి. ఈదినము దేవాలయములో శాస్త్రమును ఇకకొంచెము పైకివిసరివేస్తానేమో!— కాని మీశబ్దశాస్త్రము నాకు నూతనము గావున ఇది యిప్పుడు అతుకుకుంటుందో, లేదో అని నే నాశ్చర్య పడవలసినయవసరము లేదు ... సెలవు సెలవు! మానవప్రకృతి యొనర్చి నఘోరమగు స(శాసనా) తిక్రమణమును గూర్చియు, అనగా ఆత్మను దేహమును వేరుజేయుటనుగూర్చి— ఈశ్వరుని ప్రతిబింబమును అప హ్యాముగ నొనర్చుటను గూర్చియు నే నుపన్యసింపవలసియున్నది.— మరి యిప్పుడు లఘువైన ఆహారముతో బడలిక దీర్చుకోవలె; లేకుంటే ఆగలాటా తప్పించుకోవడము కష్టము. [పోవును]

భీష్ముఁడు

(శిలగా మారిపోయెనా అనునట్లు ఒకక్షణముసేపు ఆలోచనానిమ గ్నుఁడై నిలుచుకొని) అంతయు త్యాగమొనర్చితిని;— నాసర్వస్వమును. ఏది భగవత్కార్యమని నేను ప్రేమతో దలచియుంటినో దానికై. మరి యిప్పుడు వారిశంఖారావము దృఢముగా వినవచ్చుచున్నది. నేను సేవ యొనర్చిన దట్టిశక్తికో ప్రత్యక్షమయ్యెను! అప్పుడేకాదు! వారు ఆలో చించినంతమాత్రమున వారిదికాజాలదు! ఈదేవాలయభూమి రక్తమును పీల్చియుండెను; నా తేజము, నాప్రాణము ఇచ్చటక్రిందబడియున్నవి— నాఆత్మను అప్పుడే నేను పోగొట్టుకొనను! ఏకాకినై నిలుచుండుట భయంకరముగ నున్నది. ఎచ్చటచూచినను మృతులైనవారే కనబడు

భీష్ముడు

టయా! ఆహారము లేక చస్తూవున్నపుడు రాళ్లుచూపి గేలిసేయు టయా!

ఎంతసత్యము! అతడెంతఘోరమగు సత్యమును వచించెను! అట్ల య్యును దానిభారమున పృథివి యెట్లువీగిపోయెను! సర్వేశ్వరజ్ఞాన కపోతము అచ్ఛాదితమై కూర్చొనియున్నది; అది నాపై నెప్పుడును వ్రాలియుండలేదు,—అహో! తననమ్మకమువలన సౌమ్యమగు నభ యము నొసగజాలియున్న జీవి యొక్కడైనను నాయెదుటికి వచ్చి నిలువబడడాయెగా!

[శరచ్చంద్రుడు వివర్ణుడై శుష్కించియున్నవాడు కాషాయవస్త్ర ధారియై రస్తాపైన నడచుచు ప్రవేశించును. భీష్ముని జూచినిలుచును.]

భీష్ముడు

(బిగ్గరగా) శరచ్చంద్రా! నిన్ను!

శరచ్చంద్రుడు

ఆనామధేయముతో నన్నెరుగనగును.

భీష్ముడు

నేనిప్పుడే, ఒక్కముఖమునకై, దారువుగాని, శిలగాని కాని ఒక్క హృదయముకొఱకై పరితపించుచుంటిని. నావద్దకు రమ్ము! నాకౌగిటి లోనికి రమ్ము!

శరచ్చంద్రుడు

అది న్యాయముగాదు. ఏలనన: నేనురక్షితుడను.

భీష్ముడు

ఆహా! మునుపు మనము గలసికొనినపుడు జరిగినదానికై నాపైన క్రోధముగలదా?

శరచ్చంద్రుడు

కాదు. మీరు సహజమగురీతినే ప్రవర్తించినారు. నేనుప్రాపంచికా రణ్యమార్గముల చరియించినపుడు భగవన్నియుక్తమగు నొక అంధ మగు ఆయుధముగామాత్రమే మీరుంటిరని నేనుభావించెదను.

భీష్ముడు

(వెనుకకుపడబోయి) ఎక్కడిదీభావ ?

శరచ్చంద్రుడు

ఈమధ్యవరకు పాపములో నిద్రించుచుండి, పునర్జన్మమునొంది నిద్ర లేచిన యదృష్టవంతుని భావ.

భీష్ముడు

చిత్రము! నీవు పూర్ణముగ వేరుమార్గమున జీవితము ప్రారంభించినా వని జనులవలన వినియుంటిని.

శరచ్చంద్రుడు

అవును. గర్వము నన్ను చాలదూరము తప్పుతోవల దీసికొనిపోయెను. నాస్వశక్తిపైగల నమ్మకము నన్నవమానములపా లొనర్చెను. ఈనిరీ శ్వరప్రపంచము ఏగుణములు శ్రేష్ఠములని యెంచునో,—ఏగుణములు నాకు గలవని వారుచెప్పిరో,—ఆహస్తము, ఆస్వరము, అవి ఊరులు మాత్రమే అయ్యెను. ప్రమత్తుడనైయున్న నన్ను 'మార' పట్టుకొనెను. కాని భగవంతుడు సర్వశక్తిమయుడు. వారు తప్పిప్రవర్తించుచున్న తనజనులపై ఒకకంటినుంచియేయుండును—సకాలమున నన్ను తన వానిగా జేసికొనెను.

భీష్ముడు

ఎట్లు?

శరచ్చంద్రుడు

ఇట్లు నేను పతితుడనై పోతిని—

భీష్ముడు

నా కర్మమెట్లు తోచుట లేదు.

శరచ్చంద్రుడు

జూదము, త్రాగుబోతుతనము: జూదమాడుటయం దెక్కడలేని యభిరుచి నాకు కలిగించెను.

భీష్ముడు

భగవంతుడు పునరుద్ధరించెడు మార్గమదియేనా?

శరచ్చంద్రుడు

మోక్షము మెట్లుమెట్లుగా రహస్యముగా లభించినది; ఎట్లన—పిమ్మట వారు నాఆరోగ్యమును గొనిపోయిరి. నా తెలివి, నాసంతోషము వెళ్లిపోయెను. నన్ను చికిత్సాలయమునకు బంపిరి; నరకలోకమున మంటలలో నుండుప్రాణివలె అచ్చట పడియుంటిని; నాకండ్ల నేవైపు త్రిప్పినను నన్ను బాధించు నల్ల యీగలు కోట్లకొలది కనబడేవి! తరువాత వెలుపలికి వచ్చితిని. ముగ్గురు సుగుణాలగు సోదరీమణులు, పావనాత్మలు, యోగినులు; వారితో బరిచయము గలిగినది. వీరు యింకొక యోగిసాయముతో, ఎట్లా బోధించినారు! కూడాగే ఈ ప్రపంచబంధమును త్రెంపి పారవేసితి. పాపజాలమునుండి తప్పించుకొంటిని! ఈశ్వరుని ప్రపంచముపై పరిపూర్ణుడను శిశువునై సంచరించితిని.

భీష్ముడు

వాస్తవముగానా!

శరచ్చంద్రుడు

ఎటువంటి భిన్నమార్గములలో మనము సంచరిస్తూ ఉన్నాము. కాని మనము కొండమీద రెండోక్షణము, లోయలో—ఆలోచిస్తే యెంత చిత్రము!

భీష్ముడు

అయితే అప్పటినుంచి?—

శరచ్చంద్రుడు

అప్పటినుంచినా? అది నిమిషములో చెప్పవచ్చును. మద్యపాననిషేధమునుగూర్చి ఉపన్యసింపసాగితిని. అయితే ఆకార్యము యింకనుశక్తివంతములగు ఆశాపిశాచములతో నిండియున్నది గావున నిప్పుడు నా కార్యప్రపంచమును మార్చవలసెను. పరివ్రాజకుడనై పోవుచున్నాను.

భీష్ముడు

ఎక్కడికి?

శరచ్చంద్రుడు

నీగ్రోలదేశమునకు—వారిని మానవులలో జేర్చుటకు కాని మనమిప్పుడువేరుగావలయును. భీష్మా! ఈ కాల మహాత్మ్యము.

భీష్ముడు

నీవు నిలువవా? ఉత్సవమని యెరుగుదువుగ—

భీష్ముడు

శరచ్చంద్రుడు

వీలుగాదు, కాదు. అంధమయములగు ఆత్మలనడుమ నాకర్తవ్యము గాన్పించుచున్నది.

[పోవుచున్నాడు.]

భీష్ముడు

అడుగుమని నీస్మృతి వెనుకకు గుంజుటలేదా !—

శరచ్చంద్రుడు

ఏవిషయము ?

భీష్ముడు

ఆనాటినుండి యిప్పటివరకు ఎవ్వతె దుఃఖభాజనమైన, ఎత్తెను నగు మార్గాల ననుభవించెనో ఆమనిషినిగూర్చి ?—

శరచ్చంద్రుడు

ఆహా! ఇప్పుడు స్ఫురించుచున్నది! భక్తివలన బోధితుడనై పవిత్రజీవితమునకై నన్ను అకలుషితునిగ నొనర్చుకొనుటకు పూర్వము, శారీర సంబంధమగు జాలములతో నన్ను బట్టుకొనియుండిన ఆతరుణస్త్రీని గూర్చికదా మీరు పలుకునది—దయయుంచి చెప్పండి. ఆమెస్థితి యెట్లున్నది ?

భీష్ముడు

మరుసటిసంవత్సర మామె నాభార్య యయ్యెను.

శరచ్చంద్రుడు

అదంతముఖ్యమైనవిషయము గాదు. నాదృష్టిలోనున్న ఆమహావిషయమునకు సంబంధించని విషయములపైకి నామనస్సును బోనివ్వను.

భీష్ముడు

మా దాంపత్యము ఆనందమయమై యుండెను. పరిమితదుఃఖభాజనముగ గూడ......మా పుత్రుని గోల్పోతిమి.

శరచ్చంద్రుడు

అ దంతముఖ్యమైనది గాదు

భీష్ముడు

వాస్తవమే వానిని మాకిచ్చిరనుటకంటె బదులిచ్చిరనుట బాగుండును. —మరి యిప్పుడు మేము మరల కలసికొనుదినమునకై చూస్తున్నాము. —అటుతర్వాత వానితల్లి పోయెను......ఆరెండుసమాధులు అవిగో పచ్చగా కనబడుతూవున్నవి.

శరచ్చంద్రుడు

అదంతముఖ్యమైనది గాదు

భీష్ముడు

అదిసయితము?

శరచ్చంద్రుడు

అట్టివిషయము లన్నిటియెడ నేను విముఖుడను. ఆమె యెట్లు మరణించెను అనుటయే నేనెరుగగోరు విషయము.

భీష్ముడు

వైభవోజ్జ్వలమగు సుప్రభావమును చూడగలనను నమ్మకముతో, తన హృదయభాగ్యరాసులనెల్ల వెలువరించి, ఆమరణాంతము నిశ్చలమగు సంకల్పముతో—జీవితము తనకిచ్చిన, పుచ్చుకొనిన ప్రతివిషయమునకు కృతజ్ఞురాలై,—ఆమె మృత్యురాజ్యమును ప్రవేశించెను.

భీష్ముడు

శరచ్చంద్రుడు

వీటి వ్యర్థవ్యామోహములం, అది యట్లుండనిచ్చి ఆమె భక్తితత్త్వ మెట్టిదో సెలవియ్యండి !

భీష్ముడు

చలింపనిది.

శరచ్చంద్రుడు

ఎవరియందు ?

భీష్ముడు

ఈశ్వరునియందు

శరచ్చంద్రుడు

వారియందుమాత్రమే! ఆ! అట్లయిన ఆమెజీవితము వ్యర్థమే.

భీష్ముడు

నీవు చెప్పున దేమిటి ?

శరచ్చంద్రుడు

పతితురాలు; పాపము! ఎంతసంతాపకరము.

భీష్ముడు

(నెమ్మదిగా) పో! భ్రష్టుడా ?

శరచ్చంద్రుడు

అంతేకాదు మరి ఎవడు నరకలోకమునకు ప్రభువో అతడు నిన్ను గూడ బట్టుకొని పోకుండినచో ఆశ్చర్యమే యగును. నీవుసయితము యమునిపురమునకే అర్హుడవు ?

[illegible]

భీష్ముడు

నరకయాతన ననుభవింపుమని నీ వనగలవా ? ఇంతవరకు బురదలో పొరాడుచుండిన నీవు ?

శరచ్చంద్రుడు

భక్తియను స్నానముచే ప్రక్షాళితమై యున్నందున ఒక్కమరకయైనను ఇప్పుడు నాపై నిలిచియుండనేరదు ; తొట్టిలోవలె పవిత్రతలో నిలబడి ప్రతిమురికికరను గోకివేయ నేర్చుకొంటిని ; అప్రమత్తత యను రమ్యమగు కొయ్యచీలకు దగిలించి నాపూర్వజీవితమును అకలుషితముగ నొనర్చుకొంటిని. మరి యిప్పుడు సర్వమును స్వచ్ఛముగ నొనర్చు ప్రార్థనయను సబ్బుమూలమున నేను పాలవలె తెల్లగ నున్నాను ని నానమ్మకము.

భీష్ముడు

సిగ్గులేదా ?

శరచ్చంద్రుడు

నీకూ అదేప్రశ్న? నీయొద్ద గంధకపుకంపు కొట్టుతూవున్నది దయ్యాలదగ్గర వున్నమాదిరి. నేను వరియింపబడినధాన్యపుగింజను, నీవో, నరకలోకపు జ్వాలల పోషించుపొట్టు. [పోవును.]

భీష్ముడు

(వానివెనుక క్షణముసేపు చూచును; హఠాత్తుగా అతని నేత్రములు విస్ఫారితము లగును; పెద్దగొంతుకతో) ఇతని నేకదా ప్రేమార్ద్రహృదయుడని నేను తలచినది ! ఇప్పుడు బంధములలో కడపటిదిగూడ వీడిపోయినది. నామాటవినువారు గాని నన్ను ప్రేమించువారును ఒక్కరును లేకున్నను నాసొంతజెండా నాపైననే యెగురుచున్నది !

భీష్ముడు

కొత్వాలు

(అతి త్వరితముగా ప్రవేశించి) ఇదేమిస్వామీ! చటన కానియ్యండి. అక్కడ జనముతో అతిరభసముగా వున్నది. ఉత్సవము బయలుదేర బోతూవున్నది.

భీష్ముడు

బయలుదేరనీండి.

కొత్వాలు

అయితే మీరు రావాలె! చూడండి; శీఘ్రింగా యింటికి పదండి! మీరు జాగుచేసినారు. ప్రజలు యింకా ఆలస్యమైతే ఓర్వరు— నిమి షనిమిషానికి ఎక్కువౌతూవున్న యీగుంపులు నెట్టుకుంటూ ఒత్తిడి కలిగిస్తూ, హోరుమనే మోతతో, వారుగో పూర్ణమగు వర్షాకాలపు వెల్లువవలె స్వాములవారియింటిచుట్టు ఆనిపోయినారు.

స్వాములవారికోసరం బిగ్గరగా గోలచేస్తూవున్నారు. అదిగో! మళ్లీ "స్వామీ" అనే అరుపు. త్వరగా పోండి! — చూడడమే చాలకష్ట ముగా వున్నది వాళ్ల ప్రవర్తన—అమానుషంగా వున్నదండీ!

భీష్ముడు

మీగోత్రాలమంక పోవుచున్నచోట (దేవాలయములో) యిక నెన్నడు నాతల దాచుకొనను. ఇచ్చటనే యుండెదను.

కొత్వాలు

అన్యత్రాలాపము లాడుచున్నారు!

భీష్ముడు

అది చాలా సంకుచితము, మీమార్గము నాకు.

కొత్వాలు

ఇంకా సంకుచితముగా అవుతుంది. ప్రజలు జాస్తిగానిండిపొయ్యేట ప్పటికి వాళ్లిక్కడికి పోతూవున్నారు! ఇది నిశ్చయముగా అన్యాయము. బ్రాహ్మలు ధర్మకర్త అధికారులు అందరు ముందుకు దూకు చున్నారు. కందకములో పడతారేమో!......ఏమి చూడకుండా! ......రండి! స్వామీ! ఘర్షణ యెక్కువౌతున్నది. మీపలుకు బడిని కొరడావలె ఉపయోగించండి?......ఆఁ! హాఁ! ప్రయోజనములేదు! అడ్డుకట్టలు తెగిపోయినవి— ఉత్సవమంతా చెదరి పోయినది!

[ప్రజలు, ఉత్సవము చెల్లాచెదరు గాగా, గుంపులుగా ప్రవేశించి దేవాలయముపైపు పరుగెత్తిపోవుదురు]

చెదరిపోయియున్న పలువురి స్వరములు

స్వాములవారు!

ఇతరులు

(భీష్ముడు నిలుచుకొని యున్న మెట్లవైపు చూపి చేతులుతట్టి) అటు చూడండి!

ఎక్కువస్వరములు

తెరిచేచిహ్నాము!

ధర్మకర్త

(గుంపులో నలుగుచు) కొత్వాలుగారూ! వీళ్లను వెనుకకునెట్టి ఒక్క వరుసగా నిలబెట్టండి.

కొత్వాలు

నామాటకు వారు లోబడడము లేదు.

ఉపాధ్యాయుడు

(భీష్మునుద్దేశించి) మాట్లాడండి! ఈగుంపులో కాంతికిరణముల ప్రసరింపజేయండి! వీరికి పిచ్చిపట్టి పోతూవున్నది. ఇదిఅసహ్యకరముగా కాన్పించుట లేదా? మహోత్కృష్టంగా వున్నదంటారా!—దుఃఖకర మంటారా?

భీష్ముడు

ఓహో! తమ్ము గట్టిగా బంధించి యుంచినమూర్ఛనుండి ప్రజలు మేల్కొనుచున్నారు! జనులారా! మీరు దారులుచీలుచోటను న్నారు! మరణించినదియు క్రుళ్లిపోయినదియు నగు మీపూర్వజీవితము విసర్జించి నిండుమనస్సుతో మీరు సంకల్ప మొనర్పవలయును! లేనిచో సర్వేశ్వరుని ప్రార్థనాగృహమును నిర్మించుట యెంతఘనకార్యమైనను వ్యర్థము కాగలదు.

అధికారులు

స్వాములు ప్రేలుతూ వున్నారు!

బ్రాహ్మణులు

ఈయనకు పిచ్చిపట్టినది.

భీష్ముడు

అవును; మీరింకను ఎట్లో, ఎట్లనో ఈశ్వరుని, సత్యమును కొలుస్తూనే యున్నారని నే నూహించియుంటినో అప్పుడు, ఆరీతిగనే ఉంటిని. అవును, నామార్గమునుండి నేను తప్పినచో నేరముచేసినచో మిమ్ము గూడ భగవదనుగ్రహపాత్రులనుగా చేయగల్గుదునని స్వప్నముల గనుచుంటినో, అప్పుడు ఆరీతిగనే యుంటిని.....మన దేవాలయము చిన్నదిగానుండుట గమనించి యీనీచమగు సారాంశమును అప్పుడు

తేల్చితిని: ఇనుమడించితిని — అది అందరికి సరిపోవును! మూడిం తలయ్యెను.

నిశ్చయముగా ఇది చాలును అని తలపోసితిని. అహో! నేను వెదకుచుండినదానినే చూడకపోతిని. దానిమొత్తమును సర్వమో, సర్వశూన్యమో అనుటలో కనుగొంటిని.సమాధానబుద్ధిచే మోహితుడనై తప్పొనర్చితిని; కాని సర్వేశ్వరుడు ఒక్క మాట నుచ్చరించెను. ధ్వంసనూచకమగు శంఖారావ మీశిలాగృహముపై బిగ్గరగా ధ్వనించెను. భయముతో నొండొరులు పలుకుచుండిన రహస్యమును; అఘోరమగు ఉపన్యాసముయొక్క—నీవే ఆపురుషుడవను - సారాంశమును భయాచ్ఛాదితుడనై వింటిని! నాతలపై పిడుగుపడిన ట్లయ్యెను! ఇప్పుడు సందేహమనుభావములెల్ల కరిగించినవి. జనులారా, మీరు వినుడు సమాధానబుద్ధియే అనృతములెల్లరాజు!

గుంపు

(పొంగుచున్న ఆవేశముతో) లేయ్యండిరా, మనలను ముతాళ్లనుగా చేసినవాళ్ల నందరినీ—మన ప్రాణాలలోని మూలిగనంతా దొంగిలించివేసినారు.

భీష్ముడు

వలలనుబన్ని మిమ్మిట్టు బంధించియున్న ఆకూరశత్రువు మీలోనే ఉన్నాడు. మీరు మీశక్తిసామర్థ్యములతో చేరమాడుచుంటిరి. మీదేహముల రెండుగా ఛేదించుకొంటిరి. తుదకుచెదరిపోవుటసంభవించుటనిశ్చయము. కపటనాటకము నాడినందులకు పరిహారము అనుభవింప గలరు! ఇచ్చటికిమిమ్ము లాగుకొనివచ్చినదిఏమిటి? ఉత్సవకోలాహలము, పాటలు, సంగీతము, సంబరము అగ్నిశిఖలవలె నుదయించి చిన్నదీపము

భీష్ముడు

వలె మిణుకుమిణుకుమను కాంతితో మీయందరియందు ప్రవేశించి మధురవాగమృతమును చవిచూచుటకేకదా ! ఆసింహనాదముల, ఆ మేఘగంభీరభాషణముల, బాలకులతొక్కుపలుకుల, గుసగుసల, స్తోత్ర పాఠముల, వాగ్ఝరిని వినుటకేకదా! యీ ఏర్పాటులన్నిటిని చూచి ఆశ్చర్యపడుటకేకాదా !

ధర్మకర్త

(స్వగతము) హా! కొత్వాలుహూతలని ఆయనభావము.

కొత్వాలు

(స్వగతము) ధర్మకర్త మతిమని వాగుతుంటారే అవి.

భీష్ముడు

అద్భుతములగు పూజాపునస్కారములు, శోభాయమానమగు దీపావళి, మీకు కావలసినదంతయు బాహ్యావిషయములు మాత్రమేకదా! అట్లే అయినమీయిండ్లకే, దైనికనికృష్టదీవనములోనికే, చీకటిపాగలలోనికే, దేహమువలెనే పనిదినపుమురికి బట్టలుధరించిన ఆత్మలతోమరలి పొందు ; జీవితమనుగ్రంథమును మీమందసముల అధోభాగముననే పండుగ తిరిగివచ్చువరకు పారవైచియుంచుడు!

త్యాగమను మధుకలశమును నేను పూర్ణముగా ఖాళీచేయ సాహసించి నది ఇందులకుగాదు. నమ్మకములు మతములు మాత్రమే కాక సర్వేశ్వరుడు తనస్వర్గముక్రింద వసించుటకు హక్కును ప్రసాదించియున్న సర్వస్వమును, తనఘనచ్ఛాయక్రిందనే యుంచుకొనజాలునట్లు రాజ హర్మ్యమువలె మనదేవాలయమును నిర్మింపవలయును. ఎడతెగకవచ్చు ప్రతిరేపటికష్టమును, సాయంత్రపు విశ్రాంతియు, రాత్రికాలపు

భీష్ముడు

దుఃఖమును తనతరుణరక్తపు ఆనందము—సర్వమును, మానవహృదయము భగవంతునిసుఖదుఃఖనిలయమునుండి బదులుగైకొనుటకు అనుమతిగలదు! ఏలనన, ఇక్కడనే క్రింద నురుగులు గ్రక్కుచున్న ప్రవాహము, గాఢముగ వాగ్బంధన మనుభవించు సెలయేటిగర్జనము, ప్రాణముగల తుపాను వదలించిన శబ్దములు, ధ్వనించుసముద్రపుకంఠస్వరము, అన్నియూ ఏకమై తమతత్త్వము నెరిగి దేవాలయమునందలి వేదఘోషతోను, మనకర్షకులు హాయిగాక్కలసిపాడు పాటలతోను మిళితమై పోవలయును.

ఇచ్చటి మనకృషి నికృష్టము; భౌతికరాగయుతము; ఘనమే అనువో అనృతములలో ఘనము; త్రాణయేలేని మీసంకల్పమున అది అర్హమైనదే యగును. పరిపక్వమై తనపతనమును ఇచ్ఛగించుచున్నది. మీ కర్తవ్యమును విభజించుకొనియుండుటచే ఉన్న తాళయముల ఆహ్వానమును మీరు నిర్లక్ష్య మొనర్చుచున్నారు: పనిదినములలో ఈశ్వరునిపతాకము కొంచెము ఎత్తులోనే ఎగురుచుండును. ఏడింటిలో నొక్కదినము మాత్రమే అది స్వేచ్ఛతో స్వర్గవీథిని విహరింపగలదు.

గుంపులోనుండి స్వరములు

దారితీయండి, తుపానుగాలిలో నున్నది. మీనాయకత్వమున మేము జయించి తీరుతాము!

ధర్మకర్త

అతనిమాట వినబోకండి! అతనిభక్తి నిశ్చయమైనది కాదు. అతడు హిందువుడుకాడని నేను ప్రమాణముచేయగలను.

## భీష్ముడు

కాదు: మీయందును నాలోను గలలోపము, ఆపెద్దలోపము—మన అందరిలోనూ ఉండనే ఉన్నది. మన మెవ్వరమును పరిపూర్ణులము కాము గాన భక్తి ఆత్మకుమాత్రమే సంబంధించునది. మీలో ఒక్కసత్యాత్మ కైన చూపగలరా! మీరు దుర్వృత్తిలోనికి దొర్లితిరి; భూమిపైబడి పొర్లాడితిరి. అప్పుడు ప్రతిమనుజుడు తన కుండినంతలో శ్రేష్ఠమగు భాగమునే కోలుపోయెను. తృష్ణ గానమొనర్చుచు గారడిచేయు చుండ జీవితానందమనుఅగ్నికణము మీలో చల్లారిపోయి అంధ కారము మి మ్మావరించువరకు మీరునాట్యమొనర్చితిరి. కావున భగ్నాత్ములు, ఎండి మోడైయున్న జీవచ్ఛవములు, అగుమీరు దైవసన్నిధానమున నృత్యములో పాల్గొనుచున్నారు. మూడుకాళ్ల ముసలులు, గ్రుడ్డి, కుంటివారు, ఆపాత్ర నందుకొని అడుగులతో గూడ ఊటివేస్తున్నారు; అప్పుడు పశ్చాత్తాపమునకు దేవుని శాసనముల బారి బడకుండుటకై ఏడ్పులు, ప్రార్థనలకు సమయము వచ్చెను.

మొదట వారిముద్రను కొట్టివేయుదురు. ద్విపాదపశువులు! తరువాత కరుణాద్వారమును మూయుదురు. మీ రెన్నడు లక్ష్యముచేయని ప్రభుని వెదకుదురు. రోగగ్రస్తులైనపుడు—వారివైపు దిరుగుదురు. మీచర్యకు వారిరాజ్యము తల్లక్రిందులు గావలసినదే. వారిసింహాసనమునచుట్టును మోకారించి నిలబడుటకు ముదుసలియాత్మ లెట్లు పనికివచ్చును?

వారివాక్యములు గంభీరముగా శాసించుచున్నవి. "తరుణహృదయములలో వెచ్చనిరక్తము ప్రవహించుచుండునపుడు మాత్రమే మిమ్ము వారు పుత్రులుగా గైకొందురు" అని. వారిరాజ్యమున పసిబిడ్డలు, భాగస్వాములు, ఇతరులెవ్వరును దొంగతనముగా వచటి కస్త్రాక

జాలరు! కావున నందరు,— స్త్రీలు పురుషులు—అందరు, రండు! జ్యోత్స్న కాంతిచే మనోహరములగు లేతముఖముల జీవితమహాలయములో నికి గొనిరండు.

కొత్వాలు

అయితే ద్వారము తెరవండి.

గుంపు

(భయపడినవారివలె నరచుచు) వద్దు! దానిని కాదు!

భీష్ముడు

దానికి హద్దుగాని, అంతముగాని లేదు. దానిక్రిందనేలకై విశాలమగు పచ్చనిపృథివియు, నదులు, సముద్రములు పరవబడియున్నవి. నీలాకాశము దానిపైన కప్పుగావంగియున్నది. అచ్చట మీకృషి పూజామందిరమున స్థలమును బడయుటకు యత్నింపనగును; అచ్చట మీపని దినములకష్టము, అపవిత్రమైనదగు మనుభీతి లేకయే మీప్రార్థనతో గలసియుండగలదు. జీవితము, భక్తి యేకమై సర్వమును గప్పివేయుబెరడు వృక్షమును చుట్టుకొనినట్లే పెనచుకొనిపోగలవు. మతసూత్రములు,పూజయు అనుదినమైనట్టికష్టముతో నేకముగాగలవు. వీరాదైనిక కష్టనిష్ఠూరములన్నియు ఆమహాలయములో ఆత్మయొక్క—నక్షత్రమండలవిహారముతో,—ప్రపంచసాగరతీరమున నాడు పసిబిడ్డలయాటపాటలతో,—దైవసన్నిధానమున నొనర్చు రాజకృత్యముతో—నేకము గాగలవు.

[గుంపంతయు నల్లకల్లోలముగ గాన్పించును. కొందఱు వెనుకకు తగ్గుదురు. అధికసంఖ్యాకులు భీష్ముని చుట్టును క్రమ్ముకొందురు.]

వేయిస్వరములు

అంతయు అంధకారముగ నుండినచోట దీపమును వెలిగించిరి! జీవించుటయు, ప్రార్థించుటయు ఒక్కటే!

భీష్ముఁడు

ధర్మకర్త

అయ్యో! మనవారినందరిని మోసగించికొని పోవుచున్నాఁడు! కొత్వా లుగారూ! నాకు సహాయమురాండి. అయ్యా, మీరు! మీరు రండి!

కొత్వాలు

(హీనస్వరముతో) ఆపాఁడుపాద నిలిపి విను: ఆబోతుతో నెవరు డీకొనగలరు? అతనియున్మత్తప్రలాపముల పూర్తికానివ్వండి!

భీష్ముఁడు

(గుంపునుద్దేశించి) ఈబోటువదలిపెట్టండి! ఈశ్వరుడిచ్చుటలేదు, ఎవరిరాజ్యము స్వేచ్ఛచే మనోహరముగగాన్పించునో వారిట్టిప్రదేశములో నివసింపగలరా!

(దేవాలయ ద్వారమునకు రెండుతాళములువేసిబంధించి తాళపుచెవుల తనచేతిలో నుంచుకొని) ఇకను నేను వీరికి గురువునుకాను: నేనోసగినదానిని మరల గైకొంటిని; మీయుత్సవమునకై నావద్దనుండి యీ తాళముల నెవ్వఁడును తీసికొనజాలఁడు.

(తాళముల నదిలోపాఱవేసి) ఇక యీ పాతాళ గృహపుచీకటి ద్వారరంధ్రముగుండా, తనమెత్తనివీఁపును వంచి, దూరి, విషముగ్రక్కు ఆకురాతినిగొని సొమ్మసిల్లి, ప్రాణావశిష్టుఁడగు క్షయరోగివలె, ఊపిరాడక తహతహలాడుచు యిరుకైన యీనల్లని కలుగుగుండా పంక నిర్మగ్నులగు జీవుల ప్రాకిపోవనిమ్ము!

కొత్వాలు

(మెల్లనిగొంతుకతో భారవిముక్తుడైనట్లుగా) వీరి కిక 'పరివ్రాజకాచార్య' అను బిరుదము పోయినదేనని చెప్పగలను!

భీష్ముడు

ధర్మకర్త

(అదేరీతిగా) సరి! ఇంక పీఠాధిపతి కాజాలడు!

భీష్ముడు

లావణ్యశోభితులగుతరుణవయస్కులారా! రండు నన్ననుసరించుడు. ఈ చీకటికోణమునందలిధూళిని చెదరగొట్టి జీవనశ్వాసము మీకు స్వేచ్ఛ నొసగునట్లొనర్పనిండు. విజయముగలుగువరకు నన్ననుసరింపుడు: ఏనాటికైనను మీరు మేల్కాంచుట అవసరము; గౌరవనీయులై యేనాటికైనను సమాధానబుద్ధితో నిశ్చయముగా తెగతెంపుచేసుకొని తీరవలయును; ఈ పిరికితనమును, హీనదశను, యీ అరమనసును పరిత్యజించి మర్దించవలయును మీ శత్రువుకనుబొమ్మలనడుమ దెబ్బకొట్టవలయును. చనిపోవునంతవరకు యుద్ధమొనర్చునట్లు ప్రతినలు పల్కి యొప్పించవలయును!

కొత్వాలు

నిలుపు! అల్లరిచట్టమును చదువుతాను!

భీష్ముడు

చదువు! నీతోటి సంధి నుల్లంఘించితిని!

గుంపు

దారితీయండి! మే మనుసరిస్తాము!

భీష్ముడు

గుట్టలనక, కోనలనక దేశము గుండా మనము పోదాము—తమ ఆత్మలు చిక్కుకొని పడియున్న ప్రతిజాలమునుండియు ప్రజలను విడిపించెదము.—పాపమున్నూ, పోమరితనమును కాలిక్రింద నలిపివేసెదము. శరీ



శరీ

శుద్ధులనొనర్చి, ఉద్ధరించి స్వతంత్రుల నొనర్చెదము — మనుజులను, వారి గురువులను, ఒకటిగా జేర్చెదము—అరిగిపోయిన ముద్రపై అక్షరముల మరలనెక్కించి — ఈ రాజ్యమునే దేవాలయమునకు కప్పుగా నొనర్చెదము !

[ఆగుంపు, వారిలో గుమాస్తా,ఉపాధ్యాయుడు, భీష్మునిచుట్టు కమ్ముకొందురు. ప్రజలు భీష్ముని తమభుజములపై కెత్తుకొందురు.]

అనేక స్వరములు

ఈకాలము మహోత్తరము! మధ్యాహ్నపు సూర్యున కడ్డముగా తేజోవంతములగు దృశ్యములు మెరయుచున్నవి.

[ప్రజలగుంపు మైదానముగుండా పరుగెత్తును. కొలదిమంది వెనుక నిలుతురు.]

ధర్మకర్త

(బయలుదేరనున్నవారితో) ఓ గ్రుడ్డివాళ్లారా ! ఎక్కడికింతిరభసము? నిలవండి! వానిమాటలలో సైతానుస్వరము వినిపిస్తావున్నది; మిమ్ముల మోసముచేసితీసుకపోతాడు !

కొత్వాలు

ఓయి ! ఓహోయి! తిరగండివెనక్కు! మీ క్రమముగుహద్దులు కాంతముగు మీలోయలోనేఉన్నవి. కూడివస్తేనే తప్ప మీకు పుట్టగతులు లేవు. అయ్యో ! మారుపలకడమే లేదు—గాడ్దెలు !

ధర్మకర్త

మీయిద్దర్నువిషయ మాలోచించుకోండి !

గుంపులో కొందరు

అంతకంటె శ్రేష్ఠమగు గృహమునుగూర్చియే మేము తిరుగునది !

కొత్వాలు

మీపొలాలు, స్థలాలు, బీళ్లు, వీటిసంగతి ఆలోచించండి; మీగొర్రెలు గొడ్లు, గోదసంగతి యోచించుకొండి !

కొందరు

ఈశ్వరానుగ్రహపాత్రు లగు ప్రజలు పరితపించునపుడు స్వర్గపు మంచేవారి కాహారము నొసగగలదు !

ధర్మకర్త

మీభార్యలు వెనుక ఏడుస్తూన్నారు; నిలవండి !

స్వరములు

(దూరమునుండి) అట్లయిన వారు మాభార్యలుగారు

ధర్మకర్త

మీబిడ్డ యేడుస్తున్నాడు : తండ్రి పోవలసినదేనా?

గుంపులోనివారందఱు

మాకు స్నేహితుడవా, శత్రుడవా!

ధర్మకర్త

(చేతులుమడచుకొని వారివెనుక త్వణము నేపుచూచి దీనముగా) గాఢముగా- గాఢముగా, నన్ను బాధించిరి! నందను,సర్వస్వమును, అత డు కొనిపోయెను. ముసలిగోపాలుని కట్టుబట్టలతో వదలిపెట్టిపోయిరి!

భీష్ముడు

కొత్వాలు

(భీష్మునివైపు ముష్టినాడించుచు) వానిదే అవమానము, పతనము! మిత్రమా, కడకు మనమే, జయింపగలము!

ధర్మకర్త

[అశ్రుపూరితుడై] జయించుట ? ఏమి, మనల నిప్పుడే వదలిపెట్టిపో యిరిగదా!

కొత్వాలు

నిజమే, కాని ఈగొఱ్ఱెల గుణము నేనెరిగియుండుట నిజమే యయిన మనము పూర్ణముగా ఓడిపోలేదనుట వాస్తవము.[వారి ననుసరించును.]

ధర్మకర్త

కొత్వాలుగూడ వెళ్లాడు! అయితే ఎక్కడికి ? వాళ్లవెంబడే అని స్పష్టముగా చెప్పగలను ! అహో ! నాభావములుగూడ రేగుతున్నవి. నేను గూడా పోయి, అదరుపాటున వాళ్లపైనబడతా—వెనక చిక్కినవాళ్లను ఖయిదుచేస్తా—నా గుర్రానికి జీనివేస్తా......కొండలెక్కగల కంచరగాడిదను పట్టవలె. [వారుపోవుదురు.]

[లోయకు పైవైపు అన్నిటికంటె ఎత్తగుకొండపైనున్న యింటి సమీపమున దృశ్యము. పెద్దశిలాలములగు బీటినేలలు;చినుకులు పడుతున్నవి. భీష్ముడు గుంపు—పురుషులు, స్త్రీలు, బిడ్డలు—కన్ననుసరించుచుండ పర్వతోపరిభాగమునకు వచ్చును.]

భీష్ముడు

ముందు చూడండి! విజయ మిచ్చటి కెగిరివచ్చుచున్నది. దూరమున ఆ తగ్గులో మాపల్లెయున్నది. ఋాదివన్నె పొగమంచు దానిని గప్పివే

భీష్ముడు

యుము, ఒకకొండనుండి యింకొకకొండపైకి పలుచనిగుడారమును వైచుచున్నది......మీరు నడచిన చీకటిదారుల మరచిపోండు; ఉన్నతమార్గము నధిరోహింపుడు. పావనాత్ములారా! స్వేచ్ఛతో ఆరోహింపుడు.

ఒకపురుషుడు

మాతండ్రి అలసియున్నాడు. నిలవండి!

ఇంకొకడు

ఒక్కరొకబళ్ళమైనను యీదినము నాకు దొరకియుండలేదు.

అనేకులు

అవును; మాఆకలి చల్లార్చండి! దాహము తీర్చండి!

భీష్ముడు

మొదటకొండను దాటి సాగిపోదండి.

ఉపాధ్యాయుడు

ఏమార్గము?

భీష్ముడు

మనగమ్యమును సరిగా చేరునట్లయిన యేమార్గమయినను పరవాలేదు. ఇటురండి నాతో.

ఒకపురుషుడు

వద్దు. అది మిగుల నిట్రము. రాత్రికి శిఖరమును చేరజాలము.

గుమాస్తా

ఆదారిన ముందు, మంచుదేవాలయ మున్నది.

భీష్ముడు

నిత్రమైనమార్గములే హ్రస్వతరములు; ఏల సంకోచించెదరు?

ఒకస్త్రీ

నాబిడ్డకు జబ్బుగానున్నది!

ఇంకొకతె

నాపాదములు వాచియున్నవి.

మూడవస్త్రీ

త్రాగుటకు ఒకబొట్టు ఎక్కడ దొరుకుతుంది?

ఉపాధ్యాయుడు

ఏదియైనచేయండి స్వామీ! వారిప్రాణాలు కొట్టుకొంటూవున్నవి!

అనేకులు

అద్భుతాలుచేయండి! మహత్త్వము చూపించండి!

భీష్ముడు

ఆహా! మిమ్ము బానిసలుగనొనర్చినవారిమహిమ! పనికిముందే మీకు కూలిరావలయుననికోరెదరు. ప్రాణాపాయకరమగు నీ సోమరితనమును విదలించివేయుడు. అట్లుగానిచో మీ రెచ్చటినుండివచ్చితిరో ఆశ్మశానములోనికే తిరుగపొండు.

ఉపాధ్యాయుడు

అదిసహేతుకము: మొదటకావలసినది సమరము—పిమ్మట బహుమానము సగబడునని మే మెరుగుదుము.

భీష్ముడు

ఈశ్వరుడు స్వర్గమున నుండుట ఎంతనిశ్చయమో అర్హతను జ్ఞప్తియందుంచుకొని ఆదరించుననుటగూడ అంతనిశ్చయము.

## అనేకస్వరములు

దివ్యజ్ఞాని! దివ్యదృష్టితో బలుకుచున్నాడు.

గుంపులోనికొందరు

యుద్ధము తీవ్రముగ జరుగునా, ఈ బహుమతిని బొందుటకు?

ఇతరులు

రక్తపాతమగునా స్వామీ? ఎంతకాలము స్వామీ?

ఒకడు

మనము బలము, ధైర్యము గలిగియుండవలయునా?

ఉపాధ్యాయుడు

(అల్పమగుస్వరముతో) నాప్రాణము విషయములో ధైర్యముగా నుండ వచ్చునా?

మఱియొకడు

నాభాగ మెంత, స్వామీ, బహుమతివచ్చినపుడు?

ఒక స్త్రీ

నా పుత్రుని గోలోక్పవవని వాగ్దత్తము చేయగలరా?

గుమాస్తా

మంగళవారమునాటికైనా యుద్ధములోనుంచి గట్టెక్కుతామా?

భీష్ముడు

(వ్యాకులముతో గుంపును కలయజూచి) ఏమని ప్రశ్నించెదరు! మీ[illegible] తెలిసికొనగోరెదరు!

గుమాస్తా

మొదట, స్వామీ! ఎంతకాలమువరకు యీ యుద్ధము జరుగును, అని;— మేమనుభవించవలసినకష్టనష్టములు, —కడపట, విజయము నకు బహుమతి (యొట్టిది) అనువిషయము.

భీష్ముడు

ఇవేనా మీప్రశ్నలు?

ఉపాధ్యాయుడు

అక్కడ, ఆక్రింద ఈవిషయములు స్పష్టంగా, విపులంగా తెలియ జేయకపోతిరి.

భీష్ముడు

(కలగిన మనస్సుతో) అయిన నిప్పుడు తెలియపఱుపబడుగాక!

గుంపు

(మరీదగ్గరకువచ్చి భీష్ముని చుట్టుకొని) చెప్పండి, అట్లయితే చెప్పండి!

భీష్ముడు

"ఈయుద్ధము ఎంతకాలము జరుగును?" అని మీరడుగుచున్నారు. మీజీవితాంతమువరకును అది జరుగుచునే యుండగలదు. సమాధాన బుద్ధితో తెగతెంపుజేసికొని త్యాగమును, ఔన్నత్యమును మీరుపొందు వరకు—మీసంకల్పములకు గల బలహీనత నశించువరకు—మీ పిరికి సందేహములన్నియు "సర్వమో, సర్వశూన్యమో" అను సందే శము నెదుట పడిపోవువరకు, అదిజరుగుచునే యుండగలదు.

దీనివలననష్టము? మీ విగ్రహముల విచ్ఛేదనము,—మీ దుర్బల హృద యములకు పండుగల అభావము.—మీబానిసత్వ చిహ్నమగు ప్రతి

అపరంజిగొలుసు, మీమాంద్యము నిదురింపనగు సర్వస్వమును అదృశ్యమగుట—ఇవి.

మరిలాభము ? — నూతనోదిత సంకల్పము—తత్వమెరుగు ఆత్మ—రెక్కలుగల భక్తి—సంకోచమేలేక మృత్యురాజ్యమున సయితమురుకగల త్యాగజనితానందము; ప్రతిమనుజుని ఫాలతలమున మంజ్లికిరీటము — అవును. ఇవియే మీవిజయమునకు గలుగబోవు ఫలితములు.

గుంపు

(వెర్రికేకలతో) చెడ్డాము, చెడిపోయినాము! మోసపోయినాము! ద్రోహము !!

భీష్ముడు

నామాట వెంట్రుకజవయంతయైన తొలగలేదు.

అనేక స్వరములు

మేము ఒప్పుకుంటేనేచాలు మాకు తప్పక జయము గలుగుతుంది అని చెప్పియుంటిరి. మరి యిప్పుడు త్యాగముచేయవలె నంటూవున్నారు.

భీష్ముడు

మీకు విజయము గలుగగలదని యంటిని—ఇప్పుడు సయితము మీరు సాహసము చూపేయెడల అది మీదేయగునని నేను ప్రమాణము చేయుచున్నాను. సేనాగ్రమున నిల్చి యుద్ధమొనర్ప నెంచువాడు తన స్వత్వసంరక్షణమునకై పడియే తీరవలయును; భయపడువారు రణదుందుభులు మ్రోగక మునుపే తమ ఆయుధముల పారవేయుటమేలు:. బలశూన్యమగు సంకల్పమును మాత్రమే సన్నద్ధమొనర్పగల పతాకము

భీష్ముడు

శత్రువుల హస్తములందే రా (యుండ) వలయును ; చంపుటకు ఒక్క హస్తమైనను పైకి లేవకమునుపే భయమువలన స్తబ్ధుడై పోవునును జానకు పాతిత్యమే గతి.

గుంపు

మనయెదుటనే మనపతనము నపేక్షిస్తూవున్నాము, ఎన్నడో పుట్టు బోయ్యేవాళ్లకు లాభము చేయడానికి—

భీష్ముడు

మనస్వర్గమును చేరుటకు త్యాగమను బీటినేలలమార్గమున నే నడచిపో వలయును. మనము పడిపోవుట జయించుటకొఱకే ప్రతిమనుజుడు ఈశ్వరసేవకుడే కావున (త్యాగమొనర్పవలెనని) విన్నవించెదను.

గుమాస్తా

మనము బలే పరిస్థితులలో చిక్కుకొన్నాము. అక్కడ క్రింద యింటి వద్ద మనము బహిష్కరింపబడిన పాపులము.

ఉపాధ్యాయుడు

ఎక్కడికైనాపోతాముగాని వెనక్కుమాత్రము రాజాలము !

గుమాస్తా

ఈకొండ లెక్కి పోవలెనని యెవ్వరికీ అంతగా లేదు !

కొన్ని స్వరములు

చంపండి ఆయన్ను !

ఉపాధ్యాయుడు.

వద్దు; అట్లుచేస్తే యింకా అధోగతే! నాయకుడు లేకపోగానే మనము చీలిపోయి అల్లాడవలసివస్తుంది.

కొండఱు స్త్రీలు

(అతిభీతితో రస్తావైపు చూపుచు) ధర్మకర్త, ధర్మకర్త!

ఉపాధ్యాయుఁడు

మంచిది వారిని రానివ్వండి!

ధర్మకర్త

(వెనుక జిక్కినవారు కొందఱు తనవెంటరా ప్రవేశించి)

ఓనాయనలారా!—— నాప్రియ శిష్యులారా! మీముసలి గోపాలుని వదలి యికమీఁద చరియింపబోకండి!

ఉపాధ్యాయుఁడు

(గుంపు నుద్దేశించి) మన కింక నీలోయఆవాసము కాజాలదు; కొండపై నెక్కిపోవుటయే మనకు కర్తవ్యము!

ధర్మకర్త

మీ రిట్లు నన్ను బాధింపవచ్చునా!——ఏడ్పించవచ్చునా! మీకొఱకు ఎంతగా దుఃఖించితిని!

భీష్ముఁడు

కాని నీవనేకసంవత్సరములు జీవుల బాధపెట్టియుండలేదా!

ధర్మకర్త

ఒక్కమాటగూడ వినవలదు! బూటకపు వాగ్దానములతో మిమ్ముల మోసము చేస్తాడు——

అనేకులు

అది వాస్తవము.

భీష్ముడు

ధర్మకర్త

మేముమాత్రము అంతకచ్చితంగా వుండము ; తగినంతపశ్చాత్తాపము కనబడినతోడనే మేము మన్నిస్తాము : ఓహో ! మీహృదయములలోనికి చూపుల మరల్చి ఎట్టి క్షుద్ర మంత్రతంత్రములతో యీప్రజలను ఈతడు వశపఱచుకొనియున్నాడో, చూచుకొండి !

అనేకస్వరములు

మే మీకుతంత్రములలో బడిపోయియేయుంటిమి. కాని యిక వీని చర్యల గమనిస్తూవుంటాము.

ధర్మకర్త

మీకుగలశక్తి యెంతమాత్రము? కొంచెము సింహావలోకనముచేయండి. లెక్కపెడితే మీరు కొన్నిపదులకంటె అధికము లేదు. మహోత్కృష్టకార్యముల నొనర్చుటకు మీరా నియమింపబడితిరి? బంధితులవిముక్తి నొసగుటయే మీకర్తవ్యమా ? మీ రొనర్పవలసిన మీదైనికకృషి ఉండనేయున్నది ; దాని కావలనున్న కార్యములు మీరొనర్పవలసినవి గావు! ప్రమత్తులై, డేగలు, గద్దలు, తోడేళ్లు, యెలుగుబంట్లు, వీటినడుమ జిక్కుకొనియున్నమీ రేమిచేయగలరు ? సమరగర్జనములతో మీకు ప్రమేయమే వద్దు. మీచిన్నియిండ్లను జాగ్రత్తతో కాపాడుకొనవలసినబాధ్యత మీపైగలదు. నాయనలారా ! మీశత్రువుల దోపిడిలో ఆహుతికావడానికే మీరిప్పుడు పోవడము.

గుంపు

వేదవాక్యము ! అయ్యో ! అయ్యో ! ఎంతసత్యము !

ధనం

గుమాస్తా

అయితే...... మేము బయలుదేరేటప్పుడు మా వెనకనే మాయిండ్లకు తలుపులు వేసేసి వచ్చినాము. కాబట్టి మునుపటివలె మా కింకనక్కడ గృహములే లేవు.

ఉపాధ్యాయుడు

వారు ప్రజలందరికండ్లను తెరచినారు. లోపాలు, అనృతాలు మాకు చూపినారు. జనులిప్పుడు నిద్రించుటయే లేదు. పూర్వము మాకు తృప్తి నికలిగిస్తూవుండిన ఆ జీవితము యీ మధ్యాహ్న కాంతిలో (పేలవముగా) ప్రాణహీనముగా కనిపిస్తూవున్నది!

ధర్మకర్త

నామాటనమ్మండి; ఆభావాలుపోతవి లేండి, ఈ గంద్రగోళమునకు కొంచెముసేపు ఎడముగా నిల్చుచున్నారంటే సందర్భాలన్నీ త్వరలోనే చక్కబడగలవు. ఇది దాటిపోయినదంటే మీకు పూర్వముండిన శాంతిని త్వరలోనే మరల మీరు పొందగల రనుటకు నాదిపూచీ.

భీష్ముడు

స్త్రీపురుషులారా! నిర్ణయించుకొనుడు!

కొన్నిస్వరములు

మేము యిండ్లకు పోతాము.

ఇతరులు

కానిపని! ప్రయోజనములేదు! పర్వతారణ్యములలోనే సంచరిస్తాము.

కొత్వాలు

ఓహో! మీరిక్కడున్నారా! ఎంతఅదృష్టము!

భీష్ముడు

స్త్రీలు

అయ్యా! కోప్పడకండి. మీరు చాలాదయగలవారు.

కొత్వాలు

దానికంత యిప్పుడవకాశము లేదు! సంకోచిస్తూ నిలబడ్డారేమి! మన దేశానికి మంచిదినా లుదయిస్తూవున్నవి. ఇదిగో వినండి—నోళ్లుమూయ లేదు చూడు—మీరందరు మీరు కోరుకున్నంత భాగ్యవంతులు గావచ్చు.

అనేకులు

ఎట్లొస్తుంది భాగ్యము ?

కొత్వాలు

ఇట్లు చేపలు దిబ్బలుదిబ్బలుగా మడుగుకు వస్తున్నవి—కోట్లు.

గుంపు

ఆయన చెప్పేదేమిటి ?

కొత్వాలు

బాగా ఆలోచించుకోండి——ఈ దరిద్రుడు, మంచులో, ఈదరగాలి చినుకులలో పడియుంటాడులే; మీరు రాండి! మును పెప్పుడు యింత దిబ్బలు కనబడినదిలా. అయితే యిక మనఉత్తరతీరవాసులకు ముందు చాలామంచిదినా లున్నవని స్పష్టంగా చెప్పవచ్చు!

భీష్ముడు

వానితోగూడ బోయెదరా? ఈశ్వరాహ్వానము నంగీకరించెదరా? ఏదియో నిర్ణయించుకోనుడు.

కొత్వాలు

దిట్టమైన మీలౌకికజ్ఞానమును అనుసరించండి

ధర్మకర్త

ఆహా! ఎట్టి అద్భుతము! ఏమిసూచిస్తున్నది! దీనిమూలమున మనము జాగ్రతపడవలయునని భగవంతుని యుద్దేశ్యము! కొన్నివేళలలో ఇట్టి విషయము జరుగునని నేనును కలలో భావించుచుంటినిగాని బాధాకరములగు స్వప్నములు మాత్రమే అని తలపోసితిని. ఈవిషయము మన జీవితముల కొక నీతినిబోధించుచున్నది?

భీష్ముడు

లోబడితిరా మిమ్ము, మీ ఆత్మల నాశనమొనర్చుకొనినట్లే!

అనేక స్వరములు

ఒకదిబ్బ!

కొత్వాలు

ఎంతపెద్ద! పర్వతమంత!

ధర్మకర్త

మీబిడ్డలకు భార్యలకు ఎట్టియాహారము!

కొత్వాలు

మీశక్తి కమితదూరములగు బలములతో తెలివిమాలిన యుద్ధమొనర్చుచు మీశక్తిని వ్యయించుకొనుట కిది సమయ మేమాత్రముగాదని మీకు తెలియుటలేదా? ధర్మకర్తగారే యీపని యొనర్పలేక నిస్పృహచెందియున్నారు. చంద్రుడు నాదగ్గరకు రావలెనని గోలపెట్టుట

భీష్ముడు

కంటె, మీకిష్టమున్నయెడల త్వరలోనే మీరొనర్పవలసిన శ్రేష్ఠమగు కార్యమొకటియున్నది.

భగవంతుడు తన దక్షిణహస్తమునే ఉపయోగింపగలడు—స్వర్గలోకము పాపము నేమాత్రము అంగీకరింపదనుట నిశ్చయము! ఇతరుల జగడాలలో కలిగించుకోబోకండి; మీవలలు బైటికి దీయండి!—ఇది నా ఉపదేశము:—ఇంకా అది, ఆచరణీయమగు విషయము. కవచాలు, రక్తము, అని అది ఆక్రోపశింపదు. మీకే తెలుస్తుంది. దానికర్హమైన బజారుధర ఉండనేయున్నది. కాబట్టి భౌమికత్యాగము దాని కసలే అవసరముండదు!

భీష్ముడు

(అట్లయ్యును త్యాగము భగవంతుని పెద్దహక్కైనట్లు మేఘములనుండి జ్వాలా (మయము) లగు నాలుకలతో బలుకుచునేయున్నది!

ధర్మకర్త

త్యాగమొనర్పుటయే యుద్దేశ్యమైతే ఒకదినము కొంచెము మాయింటికివచ్చిచూడండి—మాటవరసకు అనుకుందాము వచ్చే ఆదివారము—నిజముచెప్తూవున్నా నేను.—

కొత్వాలు

(మాటకడ్డమువచ్చి) ఔను, ఔను, ఔను!

గుమాస్తా

(ధర్మకర్తతో రహస్యముగా)నాగుమాస్తా వుద్యోగము నిలుస్తుందిగదా!

ఉపాధ్యాయుడు

(ఆదేశరీతిగా) చెప్పండి పాఠశాల నాదగ్గరనుండి ఊడబెరుకుతారా!

ధర్మకర్త

(మెల్లనిగొంతుతో) మీరుగాన యీజనాన్ని ఒప్పించగలిగినారంటే మేముగూడ తేలికగానే పోనీవలసియుంటుంది.

కొత్వాలు

పొండి పోండి! కాలాతీతమైపోతున్నది!

గుమాస్తా

ముందుపొయ్యేవాళ్లు పడవల దగ్గరకు పరుగెత్తండి!

కొన్నిస్వరములు

స్వాములవారు......

గుమాస్తా

పిచ్చివాడు ఉంటాడులే!

ఉపాధ్యాయుడు

వదలిపెట్టండాయన్ను—అవని దేవుడు వదలిపెట్టినట్లే! అచ్చుపుస్తకములోనున్నట్లు, ఆవిషయము స్పష్టంగా తెలుస్తూనేవున్నది.

కొత్వాలు

ఆఁ, ఆయన వుంటాడులే. కథలని, స్వప్నాలని, తంత్రాలతో మీకు బాగాపురియెక్కించినాడు చాలాకాలమునుంచి.

కొందఱు

మాకు అబద్ధాలుచెప్పినాడు.

ధర్మకర్త

అతనిమతమంతా తప్పులే! రెండోరకముసన్నదే అతనికివచ్చినది!

భీష్ముడు

కొందరు

ఏమివచ్చింది !

కొత్వాలు

నీచప్రవర్తనకు పేరు.

గుమాస్తా

అవును; అవును; అయ్యా! అదిమాకూ స్పష్టంగా కనబడుతూనేవుంది.

ధర్మకర్త

వీనితల్లివృద్ధు పాపము ! దిక్కులేని చావు చచ్చింది.—ఈ దరిద్రుడు ఆమె జీవప్రాయశ్చిత్తానికికూడా ఒప్పుకోలా !

కొత్వాలు

తనసొంతబిడ్డకు ప్రాణము తీయడము ఒక్కటితప్ప తక్కినవన్ని చేసినాడు వీడు !

స్త్రీలు

సిగ్గు, సిగ్గు !

గుమాస్తా

వీడిభార్యవిషయములో ఇంకాచెప్పనే పనిలేదు.

ధర్మకర్త

దుర్మార్గుడగుపుత్రుడు, దుర్మార్గభర్త, దుర్మార్గజనకుడు—ఇంకాచెప్పవలసియుంటే దుర్మార్గహైందవుడు పయితము !

అనేకస్వరములు

మనగ్రామదేవళాన్నిగూడ పడదోసివేసినాడు !

ఇతరులు

తర్వాత, క్రొత్తదేవాలాన్ని రెండుతాళాలువేసి బంధించినాడు!

మరికొందరు

వడిసముద్రములో మనలను పడవతోగూడ ముంచినాడు.

కొత్వాలు

మెల్లగా నానిర్మాణోద్దేశమును అపహరించినాడు.

భీష్ముడు

ప్రతిమనుజునినుదుట ఆకళంకచిహ్నము కనబడుచునేయున్నది. ఈ దరిద్రపుజాతి ఎచ్చట గట్టెక్కునది తెలియుచున్నది.

గుంపంతయు

(కిలారింపులతో) ఈ పాపాత్ముడిమాటలు వినవద్దు! వీడితో యింక సంబంధమేవద్దు—— తరమండివాడిని—— కత్తులుతీసి పొడవండి; రాళ్లు రువ్వండి!

[భీష్మునిపై రాళ్లురువ్వుచు తరిమివేయుదురు. ఒకరొకరుగా వానిని తరిమినవారు వెనుదిరిగివత్తురు]

ధర్మకర్త

ఓనాయనలారా! నాప్రియశిష్యులారా! ఇకమీదట మీయిండ్లను వదలిపెట్టిపోకండి. బుద్ధిమంతులై తగినంత పశ్చాత్తాపము జూపినా రంటే సందర్భా లెట్లు చక్కబడివచ్చునో మీరేమూడకలరు.

మనభగవంతుడు చాలమంచివాడని మనకు తెలుసు; నిరపరాధుల రక్తమును ఆయన కోరడు. తర్వాత...శాంతియుతమగు మన దొరతి

నము ప్రత్యేకప్రశంసాపాత్రమై గర్వింపదగియున్నది; రాజ్యాధికారులు మీకు కష్టాల నేమాత్రము కలిగింపరు: — ఇక్కడ మన కొత్వాలు మీకై ఎంతో చేయనున్నాడు. నాకుకూడ, ఈకాలపు ఉద్యమములతో పాటు ప్రజాసౌఖ్యమే పరమావధిగా గల హిందూ మతముపై పూర్ణాభిమాన మున్నది; మేమందఱము అసహ్యించుకొనేది ఒక్క విషయముమాత్రమే ఉన్నది. అది మీకు మీఅధికారులు పోట్లాడుకుంటూవుండడము.

కొత్వాలు

ఎక్కడైనా, ఏదైనా చిన్నలోప మగపడిందంటే, అప్పుడే దాన్ని సర్దుపాటు చేయడానికి ప్రయత్నిస్తాము. విషయములు మరల సౌమ్యమగు పరిస్థితులలోనికి రాగానే మేమొకచిన్న సంఘము నేర్పాటు చేయనున్నాము. వారు పరిశీలనచేసి, ఎంతవరకు మనము జ్ఞానము నభివృద్ధిచేసికొనుటకు వీలుంటుందో కనుక్కొంటారు. కొందరు బ్రాహ్మణులుగూడా తప్పకుండా సహాయము చేస్తారు—ధర్మకర్తగారు, నేను కలసి ఒక జాబితాతయారుచేస్తాము—మరి మీరుగాన కావలెనంటే, గుమాస్తా, ఉపాధ్యాయుడు, వీళ్లుగూడా ప్రజలప్రతినిధులుగా నందులోనుండవచ్చు. నన్ను నమ్మండి! మేము కొన్ని మంచినివారణోపాయముల కనుక్కొగలము.

ధర్మకర్త

మీదుఃఖములన్నియును తగ్గించివేయగలము. మీరు యీదినము మీ వృద్ధగోపాలుని ప్రేమార్ద్రమగు పరితాపభరమునుతగ్గించియుండలేదా. అల్లే! ఈఅద్భుతము, కోర్కెలకందనిచిత్రము. మనదైవభక్తి నెన్నియోరెట్లధికముగ జేయగలదు. సెలవుదీసుకొండి. మీవలలనిండా చేపలు పడును, పొండి!

గుమాస్తా

రాగార్ద్రహృదయులగు హిందువులు యిక్కడ ఉన్నారయ్యా!

ఉపాధ్యాయుడు

ఎట్టి అట్టహాసశూన్యమగు శ్రద్ధ!

కొందరు స్త్రీలు

ఎంత తెలివిగలవారు. నవ్వుతూ ఎంత బాగావుంటారు!

ఇతరులు

ఎంతవినయము! ఎంత నెమ్మది! ఎంతసులభులు!

గుమాస్తా

వారేమిగాయాలు కోరడము లేదు—అందు కాక్షేపించ వలసినదే!

ఉపాధ్యాయుడు

"మాతంగ్రడే" అనుటకంటె కొంచెమెక్కువగానే వీరెరుగుదురు.

[గుంపు కొండ క్రిందివైపుగాదిగి నిష్క్రమించును.]

ధర్మకర్త

(కొత్వాలునుద్దేశించి) ఆహా! ఇది చాలామట్టుకు మేలే. రానున్నమా ర్పును స్పష్టముగా గన్పింపజేయుచున్నది. సర్వేశ్వరా! ఇందులకు వాన మస్కృతుల గైకొనుము. ప్రతినూతనవిజృంభణము నెప్పుడును పతన ము ననుసరించియే యుండును.

కొత్వాలు

ఈ ఉద్యమమునంతా ఒక్క దెబ్బతో పూర్తిగా నాశనముచేసే యీ ఆలోచన తట్టడమే మన భాగ్యము!

ధర్మకర్త

సమయానికి ఆయద్భుతము జరగడము అదృష్టము !

కొత్వాలు

ఏ అద్భుతము ?

ధర్మకర్త

చేపల దిబ్బ

కొత్వాలు

(తలవేయుచు) మిత్రమా ! అది వట్టి అబద్ధమేనండీ!

ధర్మకర్త

కాదు. నిజంగా అంతేనా. ఇదంతా ?

కొత్వాలు

నా తలలోకేదివస్తే అది చెప్పివేసినా. అంత మంచికార్యానికైనా కూడా అట్లుచెప్పడము తప్పే అంటారా ?—

ధర్మకర్త

అబ్బే ! లేదు. నిశ్చయంగా ; అవసర సమయములలో అటువంటి వాని కేమితప్పు లేదు.

కొత్వాలు

అంతేకాక, ఒకటి రెండు దినాలు గడచిన వెనుక, ప్రజలు తమ సహజ ధోరణిలో పడిపోయిన తరువాత,విజయము కలిగినది అబద్ధము వల్లనా, నిజము మూలమునా, అని విచారిస్తూ ఎవడుంటాడేమి ?

ధర్మకర్త

మంచిది. నా మట్టుకు నే నట్లుకోరేవాడను గాను.

(బీటిమీదుగా చాలదూరము దృష్టిసారించుచు) అతడే భీష్ముడు. నా కళ్లకగపడుతున్నాడు. కాళ్లీడ్చుకుంటూ పోతూ ఉన్నాడు:—

కొత్వాలు

సందేహమే లేదు! ఏకాకియై యుద్ధవీరుడు బయలుదేరుతున్నాడు!

ధర్మకర్త

నిలువు! వానిని హేళనపాలు గాకుండ కాపాడుటకు అతని వెనుక ఒకర్రురున్నారు.

కొత్వాలు

గిరిక, వాస్తవంగా. సరి; వీడు అది బలే జత.

ధర్మకర్త

(సంతోషముతో)అతని కడపటి త్యాగము పూర్తియైన పిమ్మట వాని సమాధిపై నిట్లు వ్రాయబడుగాక! "భీష్ముని జ్ఞాపకార్థము. ఒకర్రురు అతని ననుసరించిరి—ఆమె యొక ఉన్మత్తురాలు."

కొత్వాలు

(చేతిని గడ్డముక్రిందనుంచి యోచిస్తూ) కాని, యిప్పుడు నేను ఆలోచిస్తే ఈ సారాంశము తేలుతూ వున్నది. ప్రజాభిప్రాయము కొంత మట్టుకు.........క్రూరమైనదే.

ధర్మకర్త

(భుజము లెగరవేయుచు) ప్రజల వాక్కులే దివ్యవాక్కులు. రండి!

[వారు పోవుదురు]

[విశాలములగు మరుభూముల నడుమ. తుపాను కూడుకొనుచున్నది; తీవ్రముగ వీచుగాలిచే మేఘములు చెల్లాచెదరై ప్రదేశమునంతయు

గప్పివేయును. నల్లని శిఖరములు, పర్వత పైభాగములు అప్పుడప్పుడు క్షణమునేపు అగుపడును ; ఇంతలో పొగమంచులో పూడిపోవును. భీష్ముడు దేహము దెబ్బలు తగిలి నెత్తురు గారుచుండ కొండలపైన తన దారినిబట్టి పోవుచుండును.]

భీష్ముడు

(నిలిచి వెనుదిరిగిచూచుచు) లోయలోనుండి వేయిమంది బయలుదేరిరి; పర్వతోపరి భాగమున ఒక్కరును నాతో రారు. ప్రతిజీవియు ఉన్నత ప్రదేశమును, ఉత్తను కాలమును అధిరోహింప నిచ్ఛగల్గియే యుండెను. ప్రతి హృదయములోను ఒక స్వరము ' లెండు, యుద్ధ శూరులు గండు ' అని పలుకుచునే యుండెను. త్యాగముమాట యెత్తగానే సర్వము చల్లబడును. త్యాగము వారి సంకల్పములకు పిరికి మందుపోయును. అందరు జనుల నుద్ధరించుటకు ఒక్కరి రక్తమే కదా వ్యయింపబడినది; కావున ఇకమీద పిరికితనము నేరము కాదు.

(ఒక బండపై నిలబడి, వణకుచు తన చుట్టును చూచుచు) పసిబిడ్డలు వినునట్లు నిబిడాంధకార బంధురములగు పైశాచికావాసములలో అరుపులు, పెదబొబ్బలు శివారావములు నేను విని ఘోరాకారముల వలని భయముచే నా వెండ్రుకలు నిక్కబొడుచుకొన్న దినములు గూడ గలవు——.........అయితే అప్పుడు కొట్టుకొనుచుండిన నా హృదయమును స్తిమిత పరచితిని; బిగియుచున్న నా పెదవులకు పలుకుల నేర్పితిని : ' అక్కడ, వెలుపల, యిప్పుడు రాత్రికాదు,——సాయంత్రముగూడ కానేకాదు ! కిటికీ తలుపునకు వెనుక తేజఃప్రవాహము దాగుకొనియున్నది' అని శీఘ్రముగనే పగలువచ్చి తెరచియున్న ద్వారముగుండ కాంతిని వసంతకాలపుభాగ్యమును, వికాస

మును పైశాచికావాసమగు నీ చీకటిగదిలో క్రమ్మరింపగలదని తల పోసితిని !.........

క్రూరముగ వంచింపబడితిని ; కండెనచీకటిరాత్రియే త్రోసుకొని వచ్చెను. వెలుపల అధోమతులై, వంగిన మేనులతో దారితప్పిన మనుజులు వాగుపొడుగున శవప్రాయమగు తమ స్మృతి మొత్తములను ఎదుట పెట్టుకొని పూర్వకాలమందలి ఒకానొక రాజువలె కూర్చొని యుండిరి. ఆ రాజు ప్రతిసంవత్సరము తన ప్రణయిని శవము ప్రక్క కూర్చొని శవముపై గప్పియున్న వస్త్రపుమూలల నెత్తుచు, గుండె ఏమైన కొట్టుకొనునా అని పరీక్షింపుచు, సౌఖ్యపు తునక లేమైన దొరకునా యని తడవుకొనుచు తనప్రియ మరల జీవించునను ఆసతో అరుణవర్ణ గులాబిపుష్పములు మృతులైనవారిపై వికసింపవలసినట్లు స్వప్నముల గనుచుండ అతనివలెనే వీరెవ్వరును శ్మశానముగూడ తనభాగము అది పొందవలయు గదా అని లేచి సమర్థింప బూనినవారు లేరు. విగతజీవియై చల్లబడియున్న కళేబరమును మరల బ్రతికించుట కలలో సహితము కానిపనియనియు, అది ఉండదగు స్థలము మట్టిలోనే అనియు, అది ఒనర్పవలసిన ఒక్కకార్యము క్రొత్త చిగ్గినవిత్తనములకు పుష్టినొసగుటమాత్రమే యనియు, వీరిలో నొక్కడుగూడ ఎరుగడు... రాత్రియే, కటికచీకటి రాత్రియే మరల స్త్రీలను, పురుషులను, బిడ్డలను ఆవరించినది. నాహస్తము విద్యుల్లతను పట్టుకొనజాలియుండెనా, వీరిని రక్షించియే యుండెడి వాడను. ఈ వీరికివారిని తమ మరణావస్థలోని మూల్గులనుండి కాపాడియుందును గదా !

(లేచినిలచి) భీకరదృశ్యములు నరకలోకమే వేటకు బయలుదేరెనా యనునట్లు రాత్రియందు రెక్కలపై లేచి ఎగిరిపోబోవుచున్నవి......అదిగో యీ కాలము ఝుంఝూమారుతమున కనుపగు

వస్త్రముల ధరించి నది; వెచ్చని జీవరక్తమును కార్చుమని మనకాజ్ఞాపించుచున్నది; తొడపైన వరలో జారవిడిచిన కరవాలమును చేకొని విసురుమనుచున్నది: ఓహో! మనబంధువులు రంగము నాక్రమించినారు. కాని వారి సోదరులు కనబడకుండునట్లు నక్కి దాగుకొనుచున్నారు—తమ్ముత్త కప్పివేయవలసినదని అంధకారమును ప్రార్థించుచున్నారు! వణకుచున్న దృష్టి ఎదుట ఆ పిరికిపందల అధఃపతనదశ అంతయు సాక్షాత్కరించుచున్నది: స్త్రీలు కుయ్యిడుచున్నారు. పురుషులు వారిస్థితికి వగచుచున్నారు. ఆక్రందనములకు, ప్రార్థనలకు చెవులు బధిరత్వమును వహించినవి. ఫాలతలములపై యీబయిసిమాలిన వ్రాతవ్రాయబడియున్నది:—"పడవలు పెట్టుకొనియుండు దరిద్రజనులము; భగవంతుని భోషాణములో మేము చిల్లిగవ్వలముమాత్రమే" అని. పిడుగువంటి ఆ శబ్దమును వివర్ణులై వినుచున్నారు. దాని నాపుకొనుటకు తాము తెచ్చిపెట్టుకొన్న బలహీనతయే ఉపయోగపడవలయును.

మనోహరమగు నడివసంతమున జన్మించిన యింద్రచాపమా, స్వాతంత్ర్యదివసపతాకమా, యిప్పుడు నీ కేమిగతి సంభవించినది? ఝంఝామారుత స్వరముతో ప్రజలు పాడుచుండినప్పుడు కోపోద్రేకమున స్తంభమును మర్దించుచుండిన ఆ త్రివర్ణము లిపుడేచటనున్నవి? ప్రగల్భములు కొట్టుటకుమాత్రమేనా నాలుక పనికివచ్చునది? ఈ స్వాప్నికులలోని ఆక్రూరవ్యాళము తన పండ్లను దాచుకొనియే యుండునంతవరకు ధ్వజములతో నేమి అవసరము?.........

నీతిబాహ్యములగు కాలములు, దృశ్యములు భీకరముగ భవిష్యద్రాత్రిని వెలిగించుచున్నవి.........పరరాష్ట్రముల బొగ్గుపొగ నల్లగా రోతగలిగించుచు దేశము నావరించుట అదిగో కనబడుచున్నది. తన మార్గ

మునందు నూతనముగ నుదయించు ప్రతిపచ్చనిమొక్కను కాల్చి కడ కండ్లు పెట్టుచున్నది. తన విష మేఘములు ప్రదేశమునంతయు నావ రించి సూర్యకాంతిని కళావిహీనముగ నొనర్చుచున్నది. శాపోపహత మగు ఈ పురాతన నగరముపై ఎప్పుడును బూడిద వడగండ్లవలె పడు చున్నది...మానవజాతి మిగుల నీతిబాహ్యమై పోయినది: అగనిక్రింద, నీరుపడుధ్వని పెద్దగా వినబడుచున్న దేబకే శ్రుతితో అచ్చట, ప్రాస్వాం గులగు అఖనకుల జాడుము; ఎంత తెలివితో ఎంత మెలకువతో ఖనిజ మను ఖైదీని విడుదలచేయుచున్నారు. వారి వీపులవలెనే వారిఆత్మలు గూడ వంగిపోయియున్నవి. వారి నేత్రములు తళుకుమని మెరయుచు పడియున్న అపరంజిపై దురాశతో పొర్లాడుచున్నవి. మాట, మొగ మెరుగని జీవులు, మందహాసము రుచిచూడని ముఖములు, సోదరుని పతనము సహితము కనుగందింప జాలని హృదయములు, యెట్టి అవ మానమునకును దోషము పూనజాలని మనస్సులు—అందరును సమ్మె టలు వేయుచున్నారు; పోతపోయుచున్నారు; ఆకురాళ్ల నుపయో గించుచున్నారు; దీపపు కడపటి మిణుకుమిణుకుమను కణమును సహితము చల్లార్చివైచిరి! 'బలము తప్పినప్పుడు సహితము సంకల్పము నిర్వహింపవలసిన ధర్మములు కొన్నిగలవు' అని చెవిలో పలుకు చుండు ఆస్వరమును ఇక నీ జాతి ఎన్నడును వినిపించుకొన బోదు... నీతిబాహ్యములగు కాలములు, దృశ్యములు, వికృతాకారములు భవి ష్యద్రాత్రిని వెలిగించుచున్నవి. సందడిచేయుకవచ్చు దొంగతోడేళ్లు కారుచీకటిబోలు తమ శ్వాసముతో హిందూమతసూర్యుని భయపెట్టు చున్నవి. ఉత్తరమున యుద్ధనాదములు మ్రోగుచున్నవి. గుట్టలనక, వాగులనక అందరు వచ్చివేయండి అని పిల్చుచున్నవి. కొరమాలి కూ ర్చున్న గూనివానిసొదను వినుము: ఇటువంటి యుద్ధములు నాబోటి

వారికి కాదు! బలవంతులైయున్న ప్రజను రగుల్పవలయును; మేము బలహీనులము, అల్ప సంఖ్యాకులమై పోయినాము. ధైర్యాత్మకులగు వారు సత్యముకొరకై రక్తబలి నొసగవచ్చును. మమ్ముమాత్రము ఘన కార్యముల నొనర్పకోరవద్దు. ఈశ్వరు డొసగు విముక్తియందు మాకు గల నమ్మిక మత్యల్పము. వారి సమరములలో మేము పాల్గొన నిచ్చ గింపము. వారన్ని యిడుమలబడుట మాకొరకుగాదు: రక్తముస్రవించు వారిఫాలతముపై ముండ్ల కిరీటముధరించుట మాకొరకు గాదు; వారి డొక్కలోనుండి వెల్వడు రక్తముతో ఆబల్లెము కళంకితమైనది మాకొ రకుగాదు. ఆమహాత్ముడు తన చేతులు, కాళ్లు చెక్కించుకొనినది మాకొరకుగాదు! లెక్కలో మాది కడపటి పద్దు. యీ నూతనోద్యమ మును లేవదీయుట మాకొరకు గాదు: ఎట్టి శంఖారావము సహితము సైనికులరీతి మమ్ము యుద్ధమునకు పురికొల్పజాలదు.........చా లదు.........

(మంచులోపడి ముఖమును మూసుకొనును; కొంతసే పైనవెనుక లేచి పరికించుచు) స్వప్నావస్థనుండి నే నిప్పుడే మేల్కొనుచున్నానా? అంతయు మంచు, పొగవలె కప్పివేయుచున్నది.........యీదినము వరకు నే గాంచినదంతయు వ్యాధి బాధిత చిత్తవైకల్యమే యగునా? ప్రారంభమున మానవుడు గైకొన్న మనోహర బింబము నాశనమై నట్లేనా? పాపమొనర్చుటచే ఆశక్తి చల్లారిపోయినదా?—

(వినుట నభినయించి) ఏమది! గాలిలో సంగీతము తేలివచ్చుచున్నది.

అదృశ్యరూపమున కొన్ని స్వరములు

(తుపానులోనుండి నిట్టూర్పులతో)

పురుషుడ! రక్తమాంసముల బుట్టువునొందిన ప్రాణివౌట నీ శ్వరుసరిపోలుయత్నములు వ్యర్థములై చనువారియాజ్ఞలక్ష

శిరమునదాల్చినన్ దురము సేయుచునిల్చిన గంపితాంఘ్రివై
పరుగులువారినన్ పతనప్రాప్తియె నిశ్చయమం చెరుంగుమా!

భీష్ముడు

(ఆ మాటలనే తనలో నుచ్చరించుకొనుచు హీనస్వరముతో పలుకును.)
ఆహా! ప్రత్యక్షరము సత్యమువలె చెవికి తగులుచున్నది! వారు దేవాలయ గర్భగుడిలో నిలుచుండి కోపముతో నామాటలు మరల నాపైననే విసరివేయలేదా? నాఆనందమును నాసర్వస్వమును గైకొనలేదా? కాంతికిరణములు ప్రవేశింపనగు ప్రతిమార్గమును నిరోధించి ఆద్యంతము సమరమొనర్ప నన్నొక్కనినే విడలి—అపజయమున కాసజూపి. పతితుడవుగమ్ము అనలేదా?

అదృశ్యవాణి

(పైనుండి యింకనూ పెద్దశబ్దముతో)
ఆవిమలాత్ము దివ్యసముఖమ్ము ప్రియమ్మున జేరి నిల్వగా
లేవు శ్మశానవాటిక లలిన్ చవిగొంటివి కీటకంబ! సం
భావనచేసినన్, పథముబాసిన, సోలిన భీతిజెందినన్
నీవెటులున్న నీపతన మెంతము నిశ్చయమం చెరుంగుమా!

భీష్ముడు

(మెల్లగా) సుధా! నరేంద్రా! మన ఆనందదివసముల కాంతిచే విశ్రాంతిచే పూర్ణములగు దినముల నన్నిటిని సమరమార్గములకై పరిత్యజించితిని.

భీష్ముడు

నా హృదయమును యాగములో జీర్చివైచితిని—కాని ప్రజలను పీల్చి పిప్పిచేయు ఆ క్రూరవ్యాళముల సంహరింపజాలకపోతిని.

అదృశ్యవాణి

(మృదువుగా లాలించినట్లు)

భౌతికరాగ పంకిలము స్వప్నకుమార! భవచ్చరిత్ర సం
ప్రీతి సమస్తభాగ్యలహరీ వెదచల్లి వ్యయంబొనర్చి నా
వాతనిపూర్ణదృష్టికి నిరర్థక మీ కృషి సర్వమున్ వ్యర్థ
భూతలజీవివై మనగ బుట్టితి వీవు నిజం బెరుంగుమా!

భీష్ముడు

(అశ్రువులురాల దుఃఖించుచు)

నరేంద్రా! ఓసుధా! తిరిగిరాండి! నల్లగామోడుబారియున్న పర్వత శిఖరములలో ఏకాకినైయున్నాను. గాడ్పులు నా దేహము తూట్లు పడునట్లు వీచుచున్నవి. నిబిడాంధ దృశ్యములు, వికృతాకారములు నన్ను స్తంభింపచేయుచున్నవి.—

[అతడు శిరముపైకెత్తును; మంచులో నొకచోట మిణుకు మిణుకు మనుచుండిన తేజము విశాలమగును; అందులోనుండి ఒక స్త్రీవిగ్రహము తళతళలాడు వస్త్రముల ధరించినది పచ్చడముగప్పుకొని ప్రత్యక్షమగును. ఆమె సుధ.]

అవ్యక్తి

(మందస్మితముతో తనహస్తములనతని వైపు చాచుచు) చూడు భీష్మా! నేను మరల నీదానవే అయితిని.

తెర

భీష్ముడు

(భయముతో ఉలికిపడినట్లు లేచి)సుధా! ఓ! నాయెదుట నుండునది నీవేనా!

వ్యక్తి

అంతయు జ్వరకల్పితమగు స్వప్నమే! ఇప్పుడు పొగలెల్ల విచ్చి పోయినవి.

భీష్ముడు

సుధా! సుధా! (ఆమెవైపు పరుగిడును.)

వ్యక్తి

(విహ్వలయై) సమీపమునకు రావలదు. రొదపెట్టుచున్న పర్వతప్రవాహము మనల వేరుచేయుచున్నది. చూడుడండి—ఆసొరియ యెంత లోతుకి పాతాళము నంటియున్నది. (మృదువుగా) లేదు. మీరు నిద్రించుట లేదు. స్వప్నముల గనుట లేదు; అగపడురీతిగనే సమస్తము ఉన్నవి! నాథా! మీరు వ్యాధిలో బడియుంటిరి. జ్వరోన్మాదమున, మీ భార్య మిమ్ము బాసిపోయెనని తలపోసితిరి.

భీష్ముడు

ఓహో! నీవు జీవముతోనున్నావు! ఈశ్వరునికృపవల్ల.—

వ్యక్తి

(త్వరితముగా) సద్దు! ఆవివరము చాలు నిప్పటికి: రండి, మనము యిప్పటికే పోయియుండవలసినది!

భీష్ముడు

ఆఁ! మరి నరేంద్రుడో!

భీష్ముడు

వ్యక్తి

వాడు మరణించలేదు.

భీష్ముడు

నరేంద్రుడు జీవముతో... !

వ్యక్తి

యెర్రగా, లావుగా! సర్వవ్యసనములు మీస్వప్నములోనివే. సమరము కల్పితమే; పతనము కల్పితమే. మీ తనయుడు మీ తల్లియంకమున నున్నాడు. పొడుగుగా ఆనందపూర్ణుడై ప్రజ్వరిల్లుతూవున్నాడు... దేవాలయము నిర్మించేయున్నది. — మీకట్టి సంకల్పమున్నచో పడగొట్టివేయండి—ఈ దేశము యెప్పటిమార్గమున నే వర్తిస్తూవున్నది.— పూర్వపు సత్యకాలమునందువలెనే కష్టిస్తూవున్నది.

భీష్ముడు

సత్యకాలము?

వ్యక్తి

శాంతి యిచ్చట వాసముచేసినదినాలు.

భీష్ముడు

శాంతి !

వ్యక్తి

సరే, త్వరగారండి నాతోగూడ.

భీష్ముడు

నేను స్వప్నావస్థలో నున్నానా?

వ్యక్తి

ఇక నేమాత్రము గాదు; శ్రద్ధాభక్తులు మిమ్ము బలిష్ఠులుగాజేయగలవు.

ఎఱు

భీష్ముడు

నేను బలవంతుడనుగనేయున్నాను.

వ్యక్తి

అప్పుడేకాదు: మీవెనుకనే ఆనల్లని స్వప్నము పొందియేయున్నది. మరల నీపాదనులు నీతనయుని, నన్ను వదలి పరుగెత్తిపోవునేమో; పొగమంచు మీభావముల నవరోధించునేమో? ...... ఈ చికిత్సను కొంచెము పరీక్షించి చూడండి.

భీష్ముడు

ఇమ్ము!

వ్యక్తి

మీకే ఆపురుషులు! చికిత్సను పరీక్షించండి: ఇతరుల కదిసాధ్యము గానిపని!

భీష్ముడు

అ దేదియో చెప్పుము!

వ్యక్తి

ఆవృద్ధవైద్యుడు, గ్రంథములు నేర్పగలిగిన దంతయూ ఎరిగి నతడు, ఎవ్వరు అర్థము చేసికొనజాలని ఐంద్రజాలికుడు, మీసర్వవ్యసనములకు మూలసూత్రమును కనిపెట్టినాడు. మీహృదయమును ముట్టడించు భూతములు, వికృతాకారములు ఉదయించుటకును, ధ్వజమెత్తుటకును కారణము మూడు మాటలు.

వీనిని మీరు ధైర్యముతో మీ స్మృతిపత్రమునుండి తుడిచివేయవలయును.—మీ శాసనఫలకములనుండి తీసివేయవలయును. అవియే ఆవేళ

భీష్ముడు

పూర్ణమగు ఉన్మాదమువలె యీవ్యాధి మిమ్ము కబళించునట్లొనర్చి నవి :—త్వరపడండి ! ఆమాటలు మఱచిపోండి; మీయాత్మ నాచ్ఛాదించియుండు పొగమంచు నంతయు చుట్టివేయండి.

భీష్ముడు

అవేవియో చెప్పుము, అవేవో చెప్పుము.

వ్యక్తి

"సర్వము లేక సర్వశూన్యము."

భీష్ముడు

(భయముచే వెనుకకు తగ్గి) ఏమి !

వ్యక్తి

జీవితము నాదేయగుట యెంతసత్యమో! ఒకప్పుడు మరణము మీది కానుండుట ఎంతయథార్థమో అదియు అంతవాస్తవము.

భీష్ముడు

మనకు కష్టములే గతి ! మునుపటివలెనే ఆఖడ్గము యిప్పుడుగూడ మనపైన వ్రేలాడుచున్నది.

వ్యక్తి

భీష్మా ! కరుణ వహించండి; నాహృదయము భావపూర్ణమై యున్నది. నాధా ! మీబలిష్ఠములగు బాహువులతో నన్ను కౌగిలించండి. వసంతమార్గమున మన మెగిరిపోవుదము.

భీష్ముడు

[illegible]ము; ఆ వ్యాధిమరల రాజాలదు.

కారా

భీష్ముడు

వ్యక్తి

ఆఁ! అది తప్పకవచ్చును; దానినెన్నడు నమ్మవద్దు.

భీష్ముడు

(తలనడ్డముగా నాడించుచు) కాదు. దానిని నావెనుకనే త్రోసివేసి తిని. స్వప్నసంచార మిప్పుడు ప్రబలముగా లేదు: లేదు. ఇప్పటిలో భీతికరమగునది ...... జీవితమే.

వ్యక్తి

జీవితము?

భీష్ముడు

నాతోరా సుధా!

వ్యక్తి

నిలువండి, ఏమిచేసెదరు?

భీష్ముడు

ఏదచేయనగునో అది: ఇప్పటివరకు స్వప్నమాత్రమె అయియుండిన విధమున జీవింపబోయెదను. దృశ్యమాత్రమెయై నమ్మిక కలిగింప లేకుండిన దానినే సత్యమొనర్చెదను.

వ్యక్తి

ఆపని మీరు చేయజాలరు మీపురోభాగమును తిలకించండి. ఒకప్పుడది మిమ్ముకొనివచ్చిన ఆమార్గమును పరిశీలించండి.

భీష్ముడు

అట్లే చేసెదను. మరల!

భీష్ముడు

వ్యక్తి

స్వప్న మేఘములు మిమ్మావరించియుండినపుడు మీకుపుట్టినట్లు సంచారమొనర్చితిరి. ఇప్పుడు మేల్కొనియున్నారు గదా! స్వేచ్ఛతో నిప్పు డట్లు విహరించెదరా?

భీష్ముడు

స్వేచ్ఛతో, మేల్కొనియే!

వ్యక్తి

బిడ్డనువదలి పెట్టారు!

భీష్ముడు

ఆఁ!

వ్యక్తి

కాని, భీష్మా!

భీష్ముడు

అది అంతే.

వ్యక్తి

నారక్తస్రావమును సయితము గమనించక నన్నావలలోనుండి చీల్చి ఊడబెరికెవరా? త్యాగమనుకశాఘాతములతో నా దేహము నా మరణాంతము బాధింతురా?

భీష్ముడు

అట్లయ్యే తీరవలయును.

వ్యక్తి

జ్ఞానమును సౌఖ్యమును వదలుకొందురా? ఒక్కసూర్యకిరణమును గూడ మీ సమీపమునకు రానివ్వరా? జీవితఫలములజూచియు నా

ఆర్తి

నీలో నొక్కవానినైన త్రుంచఁ రాయే యుందురా? అనంతములగు తన గీతములతో మీ కాహ్లాదమును గలిగించుటకు సమ్మతింపరా?

భీష్ముడు

అట్లయ్యే తీరవలయును. నీ యుపన్యాసము లిక చాలింపుము.

వ్యక్తి

భగవంతుడు ఏమి ప్రతిఫలమును మీకు కలిగించెనో మీ రెరుగుదురా? ప్రతి ఆశయు మీపట్టున జిక్కక పోయెను; జనులందరు మిమ్ము మర్దించి ద్రోహమొనర్చిరి.

భీష్ముడు

నాకష్టప్రతిఫలమును అనుభవింపవలయునది నేను గాదు. స్వలాభమునకై కరవాలమును నే నెన్నడును పూనియుండలేదు.

వ్యక్తి

అంధకారమునబడి మూల్గుచుండు ప్రజలకోసరము.

భీష్ముడు

ఒక్కడు అనేకులకు జ్ఞానమును వెలిగించగలడు.

వ్యక్తి

వారి భవిష్యత్తుపైన నే శాపము వ్రేలాడుచున్నది.

భీష్ముడు

ఒక్కరి సంకల్పమునకు సయితము మిక్కుటముగ శక్తిగలదు.

భీష్ముడు

వ్యక్తి

మానవుడు, అవమానితుడై, జ్వాలాకరవాలములతో, నందనోద్యానము నుండి తరుమబడియుండలేదా? ద్వారమునసే అఖాతము నొకదాని నేర్పరిచిరి. ఇంతవరకు మీరెవ్వరు దానినిదాటి (ఆవనమును మరల ప్రవేశించి) యుండలేదు.

భీష్ముడు

వేచియుండినచో నెన్నటికైనను ద్వారము తెరవబడకయుండునా?

వ్యక్తి

(ధాం అనుశబ్దముతో అదృశ్యమగును. అది నిలిచియుండినప్రదేశమంతయు పొగమంచు క్రమ్ముకొనును. శ్రవణపుటభేదనమొనర్చుచు, పరుగెత్తువా రొరచిన ట్లొకతీవ్రమైనస్వరముతో) చావుము! ప్రపంచమునకు నీవలన ప్రయోజనమేమియు నుండబోదు.

భీష్ముడు

(రాపడినట్లు క్షణమునేపు నిలుచుండి) ఆహా! మంచు దట్టముగ వ్యాపించియున్నచోట, కొండలమీదుగా నతిత్వరితగతి నెగిరిపోవుచున్నది......అవును; ఒక్క క్రేవే లందిమ్మని కోరుటయే నాహస్తమును బట్టుకొనుట కత్తినమార్గము!—అవును. అదియే సమాధానబుద్ధి!

గిరక

(తుపాకిపూని ప్రవేశించి) డేగను చూచినారా? ఆడేగను!

భీష్ముడు

ఆఁ! ఇప్పుడేమాత్రము నేను వాస్తవముగా చూచినాను.

గిరక

గిరిక

అట్లయితే యిక నన్ను తప్పించుకొని తిరగలేదు. చెప్పు త్వరగా, ఏదారిన అదెగిరిపోయినది?

భీష్ముడు

ఆయుధములకోఅ లేక వానినెన్నటికి బాధింపజాలవు! ప్రాణాపాయకరమగు గుండుదెబ్బ గుండెపగిలి అతను పారిపోవుచున్నట్లొక్కొకసారి అగపించును, కాని నీవు చావగొట్టి వెనుదిరుగగానే, అప్పుడే, నీవెనుకనే, చేరియుంటాడు. ఎప్పటివలెనే ధైర్యముతో, నిన్ను మళ్లీ పిలుస్తూ, టక్కరిస్తూ వుంటాడు!

గిరిక

చూడు! దాన్ని చంపడానికి, దుప్పుల వేటాడేవాళ్లు కాలుస్తారే, అది దొంగిలించుకొనివచ్చినా—బాగా ఘుట్టనచేసిపెట్టినా—అదిగో! నేనేమి వారనేటంత వెర్రివెంగళప్పను గానులే.

భీష్ముడు

గురిపెట్టి కాలువు.

[పోవుటకు మరలును.]

గిరిక

స్వామీ! నువ్వు ఒక్క-కాలిమీద నిల్చుకొనియున్నావే! అదేమి?

భీష్ముడు

ఆజనులు నాకాలు విరుగగొట్టినారు.

గిరిక

(సమీపించి) హృదయమూలమునుండి వచ్చేరక్తమువలె ఎఱ్ఱగా నున్న దేమి మీనొసలు?

భీష్ముడు

ప్రజలు నన్నిట్లొనర్చిరి.

గిరిక

ఒకప్పుడు, ప్రజల నిద్రపుచ్చడానికిగాని, మేల్కొల్పడానికిగాని, నీకంఠస్వరము వసంతగానమువలె నుండేది. ఇప్పుడో, మోడుబారిన కొమ్మలు రాచుకొన్నట్లు అతికటువుగా వినబడుతున్నది.

భీష్ముడు

ప్రతిమనిషి, ప్రతివస్తువు.

గిరిక

ఏమి?

భీష్ముడు

మోసముచేసిరి. ద్రోహమొనర్చిరి. తుద కాక్షేపించిరి!

గిరిక

(విశాలమైన నేత్రములతో భీష్ముని నిదానించి చూచి) తుదకిప్పటికి నేను నిన్ను కనుక్కొన్నాను! నీ వొకస్వాములవారివి మాత్రమే అని తలస్తూవుంటిని—స్వాములు, మిగతా సర్వము నాశనమైపోనీ! నీవు మహాత్ముడవు! పురుషులలో మొదటివాడవు!

భీష్ముడు

నా ఉన్మత్తావస్థలో సగ మట్లే యనుకొనియుంటిని.

గిరిక

నీచేతిని కొంచెము చూడనీ !

భీష్ముడు

నాచేయి ?

గిరిక

చీలలతో చీల్చినారు ! నీవెంట్రుకలలోను, నీ నొసటిచుట్టును, ఎర్రని బొట్లు నిండియున్నవి. ముండ్లపదునైనకోరలు నీశిరస్సు నక్కడ పట్టుకొనియుండినవి కావాల.

ఆ శిలువభరించినది నిన్నే ! నేను చిన్నదాన్నిగా వుండినపుడు మా నాయన చెప్పేవాడు. 'ఆవిషయము ఎప్పుడో, చాలకాలముక్రింద, చాలాదూరాన జరిగినది' అని; కాని యిప్పుడు నాకు తెలుసును; మా నాయన అబద్ధము చెప్పినట్లు కనబడుతూ వున్నది; నీవే ఆ గ హాను భావుడివి !

భీష్ముడు

నాయెదుటనుండి వెడలిపొమ్ము !

గిరిక

మట్టిలోబడి సాష్టాంగప్రణామము చేయనా! దండము పెట్టనా!

భీష్ముడు

పో !

గిరిక

రక్తము వ్యయించే పుణ్యామూర్తీ! మమ్మందరిని రక్షింపగలశక్తి మీాయందున్నది.

భీష్ముడు

నాసొంత ఆత్మకే, కైవల్యముయొక్క అత్యల్పశకలము సయితము దొరకని దరిద్రుడను

గిరిక

తుపాకి తీసుకో. కాల్చి చంపివేయి !

భీష్ముడు

(తలనాడించును) ఆమరణాంతము సంకల్పము ప్రయత్నించియే తీరవలయును.

గిరిక

కాదు. నీకుమాత్ర మట్లుగాదు. చీలలు దిగబడినగుర్తులు నీచేతులు చూపుచున్నవి; ప్రపంచసర్వస్వముకంటెను నీజీవిత మమూల్యము.

భీష్ముడు

నేను !—భూమిపైగల కీటకాధముడను !

గిరిక

(పరికించును. మేఘములు లేచిపోవుచున్నవి.) ఎచ్చట నిలుచుకొనియున్నావో ఎరుగుదువా ?

భీష్ముడు

(తనముందువైపు చూచుచు) నేనెరుగుదును. అన్నిటికంటె క్రింద మెట్టుమీద; పాదములు వాచియున్నవి! చాలదూరము పోవలసియున్నది.

గిరిక

(ఎక్కువ వికృతిముగా) అదికాదు జవాబు చెప్పు! ఎక్కడనో ఎరుగుదువా?

భీష్ముడు

ఆఁ; మంచు వీడిపోవుచున్నది.

గిరిక

ఎంతధైర్యముతో నల్లమలశిఖరము నూటిగా ఆకాశమును తాకుచున్నదో చూడు.

భీష్ముడు

(పరికించుచు) నల్లమలశిఖరము. మంచు దేవాలయము.

గిరిక

అవును; ఇంకా దేవాలయానికి పొయ్యేవాడివేనా? అట్లయితే నిలువు!

భీష్ముడు

ఓ! ఇప్పటికి కొన్ని యామముల దూరములో నుండకపోతినే! ఈ అంధకారములో తెన్ను తెలియక పరితపించుచున్నాను. జ్ఞానమునకై, సూర్యకాంతికై, దయకై, పరితపించుచున్నాను. సమరమునకు బదులు శాంతికై, నాజీవితక్రూరహేమంతమున వసంతభాగ్యమునకై పరితపించుచున్నాను. [కండ్లనిండ నీరుక్రమ్మును.]

సర్వేశ్వరా! నీనామము నెన్నిసారులో స్మరించియుంటినిగాని ఒక్కసారియైనను నీరొమ్మున జేర్చుకొనకపోతివి! సగము స్మృతిపథమున నున్నవాక్యము నాలుక తుదకు వచ్చినట్లే నీసన్నిధానము కలిగెను.

భీష్ముడు

వెడలిపోయెను. నన్ను మునుపటివలెనే పరిత్యక్తుడనుగా నొనరించి పోయెను. త్రైవల్య(కాంతా)వసనమును, నిశ్చయమగు పశ్చాత్తాపమధు వుచే నార్ద్రమైనదాని కొనయందును యిక్కైన నన్నందుకొననిమ్ము!

గిరిక

(వివర్ణయై) ఇదియేమిటి? నీవు యేడుస్తున్నావు? నీవు!—కన్నీళ్లు. వేడికన్నీళ్లు నీచెక్కులమీదుగా ప్రవహించుటచే యీమంచువసనము కరగి, జారి, శిఖరములమీదనుండి బొట్లుబొట్లుగా పడుచు ఆవిరిరూపమున పైకిపోవుచున్నది; మంచుక్రమ్మికొనియుండిన నాజ్ఞాపకశక్తికి మరల తెలివివచ్చుచున్నది. హృదయాంతరాళమునందలి మంచుకరగి కన్నీళ్లుగా మారుచున్నది; మంచునదియను పురోహితుడుగూడ తన తెల్లనివస్త్రమును తనప్రక్కనే జారవిడుచుచున్నాడు:—(వాకుచు) అయ్యా! తమరిప్పటివరకెందుకు ఏడ్వకుండా వుండినారు?

భీష్ముడు

(శాంతప్రపూర్ణమై ప్రకాశించు ముఖముతో, మరల యౌవనునివలె) శాసనజీవితపర్యంతము మంచు నిశ్చిరయే యుండగలదు; అప్పుడు సూర్య కాంతి, అప్పుడు మంచుకరగుట! ఈదినమువరకు నాకు కనుపించిన ఆదర్శము సర్వేశ్వరుని హస్తము వ్రాయదగు శుభ్రఫలకముగా నుండ వలయునని మాత్రమే; ఈ దినము మొదలు నా జీవితము మారిపోవల యును; ప్రేమ మొదలగు భాగ్యముల కౌగిటిలో నిముడ్చుకొనవల యును; పైని కప్పియుండిన మొండిబొచ్చె పగిలిపోయినది: ఈదినము నేనేడ్వగలను. భక్తితో ప్రార్థించగలను.

[మోకాళ్లపై వ్రాలును.]

గిరిక

(పర్వతముపైకి దృష్టి సారించి మెల్లగా భీతిజెందిన స్వరములో) వాడుగో అక్కడ కూర్చున్నాడు — చూడడానికే అసహ్యంగా వున్నాడు! వాడినీడ ఊగుతూ వుండటము కనబడడములేదా. విశాలంగా పఱచిన ఱెక్కలతో వాడు పర్వతపు ప్రక్కలను మర్దిస్తూ వున్నాడు. ఇక ముందుగాన ఉపయోగపడేటట్లయితే రక్షించుకోవలసిన సమయము యిప్పుడు వచ్చియున్నది!

[తుపాకిమొదలు చెంపకానించుకొని కాల్చును; ఉరుమువంటిధ్వని పర్వతమునకావలి వైపునుండి వినవచ్చును.]

భీష్ముడు

(ఉలికిపడి లేచి) బిడ్డా! ఏమిచేయుచున్నావు?

గిరిక

పడిపోయినాడు క్రింద! చూడు! నేను వాడిని పూర్తిగా చంపివేసినాను. ఆకొండమీదుగా వాడు పారవేసే యీకలు యెట్లెగిరిపోతున్నవో చూడు. ఒకటివెంబడి ఇంకొకటి! ఓ, ఎంతపెద్దగా తెల్లగా అయినాడు. దొర్లి సరిగా యిక్కడికే వచ్చిపడుతున్నాడు!

భీష్ముడు

(కూలిపోవుచు) అవును. వంశములో పుట్టిన ప్రతిప్రాణియు, తనపాపమునకై మృత్యుముఖమును జూచియే తీరవలయును!

గిరిక

వాడు పడిపోయినదిమొదలు మనశిరస్సుపైన ఆకాశము పదింతలు పెద్దదిగా పెరిగింది. దొర్లుతున్నాడు క్రిందకు—చచ్చిపడిపోయినాడు.

భీష్ముడు

...ఇకను వాడినిజూస్తే నాకిప్పటికి భయముండబోదు...వాడుకూడ అన్ని కొంగలవలెనే తెల్లగానే వున్నాడే! ..(భీతితో అరచును.) అయ్యో: భయము! ఆ భయంకరము గర్జనము!

[మంచులో క్రిందపడిపోవును.]

భీష్ముడు

(క్రిందికి జారివచ్చుచున్న మంచుపర్వతముక్రింద ఒదిగికొనుచు బిగ్గరగా ఓ సర్వేశ్వరా! ఇందుకుప్రత్యుత్తరమిమ్ము! మృత్యువదనములో: మానవ సంకల్పపుమొత్తము కైవల్యములో నొక భాగమునైన సాధించజాలదా? [మంచుకొండ అతనిని పూడ్చివేయును లోయఅంతయు మంచుతో నిండిపోవును.]

ఒకస్వరము

(ఉరుములోనుండి అరచినట్లు) భగవంతుడు ప్రేమస్వరూపుడు.

---

# ఆంధ్ర గ్రంథమాల

నెం. 7, తంబుశెట్టి వీథి, మద్రాసు.

---

## వెలువడిన గ్రంథములు

1. శతకమంజరి (భక్తిసంపుటము):—వృషాధిప, సర్వేశ్వర, దేవకీనందన, నారాయణ, కాళహస్తీశ్వరాదిశతకములు పదియిందుగలవు. ఒక్కొక్కశతకమునకు పీఠికయు, పాఠభేదములు గలవు. (ఈశతకములు విడిగను దొరకును.) ౧-౨-౦

2 బసవపురాణము (ద్విపద):— పాల్కురికి సోమనాథుకు. అనేకతాళపత్రమాతృకలను బరిశీలించి కూర్చిన మూలము. పాఠభేదములు సూచింపబడినవి. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిన విపులమగు పీఠిక గలదు. రు ౨-౨-౦

3. గాంధిమహాత్ముని బెల్గాము కాంగ్రెసు అధ్యక్షోపన్యాసము:— రు ౦-౪-౦

4. కమలాక్షి (చిన్ని విచిత్రకథ):—రాయసం వెంకటశివుడుగారు, యమ్. ఏ, యల్. టి. రు ౦-౨-౦

5. నీతినిధి:—వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. మానవజీవిత నిబంధనము లిందు సూటిగావివరింపబడినవి. రెండువేలయేండ్లకు పూర్వ మొక భారతీయబ్రాహ్మణునిచే రచియింపబడినది దీని మూలము. ఇట్టి యుత్కృష్టనీతిగ్రంథ మాంధ్రగీర్వాణవాఙ్మయముల గానరాదు. ౧-౪-౦

## వెలువడనున్న గ్రంథములు

6. జీర్ణవిజయనగర చరిత్రము:—కుందూరి ఈశ్వర దత్తుగారు, బి. ఏ. కృష్ణదేవరాయల సామ్రాజ్యలక్ష్మీవిహారభూమియై వెలసిన విద్యానగరము (హంపిశిథిలముల) యొక్క ప్రాచీనచరిత్రము, ప్రకృతపు జీర్ణస్థితియు నిందు వర్ణితములైనవి.

7. త్యాగరాజస్వామిచరిత్రము-(పద్యకావ్యము) శ్రీ పసుమర్తి కృష్ణమూర్తిశాస్త్రి గారు. శ్రీరామభక్తాగ్రణియు, గాయకశిఖామణియు నగు శ్రీత్యాగరాజుగారి చరిత్ర మిందు సరసముగ వర్ణింపబడినది. సందర్భానుసారముగ త్యాగరాజుగారు రచించిన కృతులు ౫౫ ఇందు జేర్పబడినవి. ౦-౧౦-౦

| | |
|---|---|
| శ్రీవృషాధిపశతకము—పాలకురికి సోమన | ౦-౨-౬ |
| సర్వేశ్వర శతకము—యథావాక్కుల అన్నమయ్య ... | ౦-3-౦ |
| దేవకీనందన శతకము ... ... | ౦-3-౦ |
| ఒంటిమిట్టరఘువీరశతకము-అయ్యలరాజు త్రిపురాంతకుడు | ౦-౨-౦ |
| నారాయణశతకము ... ... | ౦-3-౦ |
| కాళహస్తీశ్వర శతకము ... ... | ౦-౪-౦ |
| దాశరథిశతకము-కంచర్లగోపకవి ... ... | ౦-3-౦ |
| రంగశాయి శతకము ... ... ... | ౦-౨-౦ |
| శ్రీరామతారకశతకము ... ... | ౦-3-౦ |
| రామచంద్రశతకము-పైడిపాటి వెంకటనృసింహకవి... | ౦-౨-౦ |

కాశీనాథుని నాగేశ్వరరావు,
వ్యవస్థాపకుడు.

# శుద్ధప్రతి

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧ | ౧ | కురుస్తూవుంది | కురియుచున్నది |
| ౩ | ౨౦ | మంచు | మంచా, |
| ౮ | ౭ | సుఖించిపో | సుఖించుపో |
| ౧౨ | ౧౨ | నేసితివే | నేసితినే |
| ౧౮ | ౧, ౨, ౩ | ౧, ౨, ౩ | ౨, ౩, ౧ |
| ౩౭ | ౨ | కట్టి | కట్టిన |
| ౪౮ | ౨ | మొదటి | మొదట |
| ౫౮ | ౬ | పాల్వేయ | పాల్వేయు |
| ౫౮ | ౧౬ | మోకాళ్లు | మోకాళ్ల |
| ౬౮ | ౧౯ | స్మృతియన | స్మృతియను |
| ౬౯ | ౧౫ | కోవిల | కోయిల |
| ౭౧ | ౪ | నీకే | నీవే |
| ౭౨ | ౬ | వాడ | ఆడ |
| ౭౨ | ౧౦ | చేయ | చేయి |
| ౭౪ | ౧౭ | నడవ | తడవ |
| ౭౬ | ౬ | దగ్గిరి | దగ్గర |
| ౭౬ | ౨౦ | కాపాడుట | కాపాడుటకు |
| ౧౦౧ | ౧౩ | రీతి | నీతి |
| ౧౦౨ | ౪ | జిక్కినది | జిక్కునది |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౦౪ | ౪, ౧౫ | స్వస్థ | స్వస్త |
| ౧౧౧ | ౩ | యొడల | యెడల! |
| ౧౧౧ | ౧౮ | హంగారు | హుషారు |
| ౧౧౯ | ౧౫ | మీ | మీరు |
| ౧౩౩ | ౭ | తండ్రి | తండ్రివి |
| ౧౩౮ | ౧౧ | ధ | న్ధ |
| ౧౫౯ | ౧౫ | లేసి | వేసి |
| ౧౮౧ | ౨౦ | అప్పు | అప్పుడు |
| ౧౮౪ | ౧౬ | బొచ్చు | బొచ్చె |
| ౧౮౮ | ౭ | బూక | మూక |
| ౧౭౦ | ౧౩ | రొంపు | రొంపి |
| ౧౭౨ | ౨౧ | చోట | చోటి |
| ౧౭౩ | ౧ | గలదు | గలడు |
| ౧౭౪ | ౧౭ | అతడి | అతని |
| ౧౭౬ | ౭ | యోమి | ఏమియో |
| ౧౭౭ | ౧౩ | లేదు | దు |
| ౧౯౨ | ౭ | చేనిలో | చేతిలో |
| ౧౯౨ | ౧౫ | తలుపును | తలుపును తీసి |
| ౧౯౨ | ౧౮ | లోపలకి | లోపలికి |
| ౧౯౪ | ౩ | వాళ్ళను | మావాళ్లను |
| ౨౦౩ | ౩ | నిష్ణంచు | నిర్ణయించు |
| ౨౦౭ | ౧౨ | బుద్ధి | వృద్ధి |
| ౨౧౩ | ౨౧ | నుండిన | కుండిన |
| ౨౧౯ | ౨౧ | మృగవాసముగు గృహము | మృగావాసముగు గుహ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨౨౦ | ౩ | కిలకిల | కలకల |
| ౨౨౦ | ౫ | యుత్సవ | ఉత్సవ |
| ౨౨౧ | ౧౩ | వరకు | ఊరక |
| ౨౨౨ | ౧౬ | ముమాత్రను | మాత్ర |
| ౨౨౪ | ౨ | కనుపడ | కనబడు |
| ౨౨౬ | ౧ | ఖర | కర |
| ౨౨౭ | ౯ | సోదరి | సోదరున |
| ౨౩౩ | ౬ | బావి | బావి |
| ౨౩౭ | ౧౫ | ఉడ | ఉండ |
| ౨౪౧ | ౧౪ | తోవల | త్రోవల |
| ౨౪౧ | ౨౦ | యుండుఁను | యుందురు |
| ౨౪౭ | ౩ | పొరాడు | పొర్లాడు |
| ౨౫౨ | ౧౩ | దీవనము | జీవనము |
| ౨౫౪ | ౪ | గాన | గాని |
| ౨౫౬ | ౯ | బోటు | చోటు |
| ౨౬౧ | ౧౧ | పొదండి | పదండి |
| ౨౭౦ | ౧౭ | లా | లా |
| ౨౭౨ | ౭ | ఆక్రోప | ఆక్రో |
| ౨౭౨ | ౯ | భౌమిక | భౌతిక |
| ౨౭౩ | ౧౩ | అవని | అతని |
| ౨౮౩ | ౧౦ | మాటు | మాట |
| ౨౮౪ | ౭ | తము | తలము |
| ౨౮౭ | ౧౧ | చూడు | చూ |